# ఆంధ్ర సామ్రాజ్యస్థాపనము

(చారిత్రక నవల)


రచయిత:

విద్వాన్ వారణాసి సూర్యనారాయణశాస్త్రిగారు

ప్రధానాంధ్రోపాధ్యాయులు, శ్రీ వీరేశలింగ ఉన్నతపాఠశాల

రాజమహేంద్రవరము






పబ్లిషర్సు:

వేంకట్రామ అండ్ కో.

బెజవాడ - మద్రాసు

1946

# పీఠిక

ఆంధ్రనాథో మహావిష్ణు ర్నిశుంభ దనుజాపహా।
పురా స్వాయంభువమనోః కాలే కలియుగే హరిః।
కాకులే రాజవర్యస్య సుచంద్రస్య తనూభవః।
అభవ త్సర్వదేవైశ్చ వేష్టితో లోకపూజితః॥
శ్రీశైల భీమ కాళేశ మహేంద్రగిరి సంయుతమ్।
ప్రాకారం తు మహత్ కృత్వా త్రీణి ద్వారా న్వాకరోత్ ।
త్రిలోచనో మహేశ స్స త్రిశూలం చ కరే వహన్ ।
త్రిలింగ రూపీ వ్యవస త్త్రిద్వారేషు గణైర్వృతః।
ఆంధ్రవిష్ణు స్సురయుతో దనుజేన నిశంభునా।
యుద్ధ్వా త్రయోదశ యుగాన్ హత్వా తం రాక్షసోత్తమమ్।
అవస త్తత్ర ఋషిభిర్యుతో గోదావరీ తటే।
తత్కాల ప్రభృతి క్షేత్రం త్రిలింగ మితి విశ్రుతమ్.

బ్రహ్మాండ పురాణము నందలి యీ శ్లోకముల నాధారముగాఁ గొని శ్రీ చిలుకూరి వీరభద్రరావు పంతులుగారు తమ యాంధ్రుల చరిత్రము పూర్వయుగములో సుచంద్రుఁడను రాజుకుమరుఁ డాంధ్రవిష్ణువు నిశుంభుఁడను రాక్షసుని సంహరించి కృష్ణాతీరమందలి శ్రీకాకుళము రాజధానిగా నాంధ్ర సామ్రాజ్యమును స్థాపించెనని నిర్ధారణ చేసి యున్నారు. అప్పు డాంధ్రదేశము కృష్ణా గోదావరీ నదుల మధ్యనుండి శ్రీశైలము, కాళేశ్వరము, మహేంద్రగిరి వఱకు వ్యాపించి యున్నట్లు పై శ్లోకములవలన విదితమగుచున్నది. శ్రీశైలాది క్షేత్రములందలి శివలింగములవలన నాంధ్రదేశమునకుఁ ద్రిలింగదేశమను ప్రసిద్ధి గలిగినట్లు బహుగ్రంథములలోఁ దెలుపఁ బడియున్నది.

ఆంధ్రసామ్రాజ్య మెప్పుడు స్థాపితమైనది నిశ్చయముగాఁ జెప్పుట కవకాశము లంతగాఁ గానరావు. అశోక చక్రవర్తి కాలమున

కాంధ్రులు కోటలుం గట్టుకొని యీ సార్వభౌమునకు సామంతులై యున్నట్లు చరిత్రకారులు నుడువుచున్నారు. ఈ కారణముచే నీ సామ్రాజ్యము రెండువేల సంవత్సరములకుఁ బూర్వమే స్థాపితమై యుండవలయును. బుద్ధుని కాలమున నీ దేశము వజ్రభూమియనియు, మంజీరదేశమనియు వ్యవహరింపఁ బడుచున్నట్లు తోఁచుచున్నది. ఏది యెట్లున్న నాంధ్రసామ్రాజ్యము బహు పురాతనమైనదనుట నిర్వివాదాంశము.

కథాగౌరవమును బట్టి పై యంశములను మనస్సున నుంచుకొని నేనీ యాంధ్రసామ్రాజ్యస్థాపనము గ్రంథమును రచించితిని. ఇందలి కథాకల్పనాది విషయములను విజ్ఞులు విమర్శింతురు గాక !

తమ దేశముయొక్క, జాతియొక్క గౌరవప్రతిష్ఠలను దెలిసికొనుట కీ గ్రంథ మాంధ్ర విద్యార్థులకు సాధన భూతము కావలయునని సంకల్పముతో నేనీ ప్రయత్నమున కుత్సహించితిని. దాని నాదరించెడి బాధ్యత యాంధ్రులకుఁ గలదని వేఱుగా మనవి చేయ నక్కఱలేదు.

— గ్రంథకర్త

# ఆంధ్ర సామ్రాజ్యస్థాపనము

(చారిత్రక నవల)



## మొదటి ప్రకరణము

ప్రకృతిలక్ష్మి ముచ్చటపడి తనంతఁదాను దీర్చిదిద్ది యలంకరించినదో యనునట్లు మన భారతభూమి సర్వవిధ సౌందర్యముల కాటపట్టయి యలరారుచున్నది. ఉన్నతమగు హిమాలయశిఖర మాదేవికి నవరత్నఖచితకిరీటము; తత్పరిసర శ్యామలవనమాలికలు నిగారించు చికురజాలములు; సాకేతము కస్తూరికాతిలకము; అవిముక్తక్షేత్రము సువర్ణమంగళపతకము; యమున నీలమణిహారము; భాగీరథినది వజ్రాలపేరు; సింధుశాఖ లాణిముత్తెపు సరములు; నర్మద మువ్వల మొలనూలు; గౌతమీస్రవంతిని జీరాడుదువ్వలువ; కృష్ణవేణి జిగితంపుమధ్య శాటి; కావేరీ తుంగభద్ర లందెకడియములు; సేతువు పాద పీఠము.

మఱియు మనదేశమాతకు వివిధభాషాయోషలు ప్రాణ సఖులు; వేదవాఙ్మయము నిలువుటద్దము; విశుద్ధమతములు రాచబాటలు; చుట్టుకొనియున్న మహార్ణవములు కేళా కూళులు; నగరరాజములు భూషాపేటికలు; విద్యాపీఠములు కళామందిరములు; ఋషివాటికలు విశ్రామగృహములు; పుణ్య క్షేత్రములు ధ్యాననిలయములు; యజ్ఞశాలలు వంటయిండ్లు;

భప్పన్న దేశములు సవ్యసవ్యసంభరితములగు కేదారఖండములు; కదనరంగములు నర్తనశాలలు.

ఇంతియగాక యుత్తుంగపర్వతపంక్తు లాజనని స్థైర్యమును, సాంద్రారణ్యములు శత్రుదుర్భేద్యతను, విశాలసరోవరములు నిర్మలస్వభావమును, ఖనిజసంపదలు సహజసామర్థ్యమును, అనుకూల వాయుసంచారము లానందపారవశ్యమును నెప్పుడు వేనోళ్ళఁ జాటుచుండును. ఇట్లు సర్వసమృద్ధమగుటచేతనే ధర్మపరులు ధర్మక్షేత్రమనియుఁ, గర్మవీరులు కర్మభూమియనియు, నైతిహాసికులు భరతఖండమనియు నీదేశమును వ్యవహరించి యున్నారు. అనేక కల్పములనుండి పరంపరాప్రాప్తమైన విజ్ఞాన మీదేశ నాగరికత యత్యంతప్రాచీనమైనదని ఋజువుచేయుచున్నది. జన్మప్రభృతి నైహికసుఖములను తృణప్రాయములనుగా విసర్జించి సత్యాన్వేషణముకొఱకు, సర్వమానవ సౌభ్రాత్రముకొఱకు, సకలప్రాణి సుఖసాధనకొఱకు తనువులు, జీవితములు వినియోగించి ధన్యులైన యుత్తమపుత్రుల నెందఱినో కన్న యీజగన్మాత పుణ్యభూమియని పొగడొందుటలో నాశ్చర్య మేముండును? ఆధ్యాత్మికవిషయములతోడనే తనివినొందక పరోపకారమే పరమధర్మమని, ధర్మసంస్థాపనమే మోక్షమార్గమని, మానవసేవయే యీశ్వరసేవయని విశ్వసించి నిశ్చలభక్తితో దేశమాత నారాధించి యొందఱు మనపూర్వులు కీర్తికాయములతో విజ్ఞుల చిత్తఫలకముల నిప్పటికిని బ్రతిబింబించు చున్నవారు కారు? ఆ మహనీయుల గుణసంపద, శిల్పనైపుణి, సమరపాండిత్యము, జాతిమతగౌరవము, దృఢసంకల్పము వినుట తటస్థించినప్పుడు

నాగరిక శిఖామణులమని విఱ్ఱవీగు నధునాతనులు నిర్ఘాంతపడు చుండుట గనుగొన్న యేభారతీయుని దేహము పులకాంకితము గాకుండును? ఏ సహృదయుని హృదయము నూతనభావోదయముచే వికసింపకుండును?

ఇట్టి సువిశాల భరతఖండమున నాంధ్రదేశము తూర్పు సముద్రతీరమునందలి దేశములందెల్లఁ బ్రసిద్ధివహించియున్నది. బహుకాలము క్రిందట నార్యులు దక్షిణాపథమునకువచ్చి తమ విజ్ఞానమును నాగరకతను నచ్చటివారికిఁ బ్రసాదించుచు వారితోఁ గలిసి యందందు స్థిరనివాసము లేర్పఱచుకొని ప్రత్యేక సంఘములుగా విడిపోవుచు వచ్చిరి. అట్టి వారిలో నాంధ్రు లొకరు. కృష్ణా గోదావరీ నదీ ముఖద్వారముల మధ్యనున్న భూభాగము తెలుఁగువారి తొలినివాసమని పలువు రభిప్రాయ పడుచున్నారు. మన కథాకాలమున నారెండునదుల యుభయ పార్శ్వముల నివసించుచు నాచార వ్యవహారములందు, మత సంప్రదాయములందుఁ గొంతభేదము కలిగి యందఱునాంధ్రు లయ్యుఁ గులగోత్రములఁ బురస్కరించుకొని యొకప్రాంతమువా రింకొక ప్రాంతమువారిని ద్వేషించుచుండిరి. సహనశీలముగల యుత్తమ పురుషులు, నదీ తీరముల నాశ్రమములు నిర్మించుకొని తపస్సుచేసికొనుచున్న మహర్షులును జాతియైక్యమును గోరి శాంతిమార్గములు బోధించుచుండిరి. బలవంతులు తమ తమ పరిసర ప్రదేశముల నాక్రమించి యన్యులను దఱిమి వేయుచుఁ దమబలగముల బలపఱుచుకొను చుండిరి. మధ్య మధ్యఁ గొంద ఱాటవికులు ప్రవేశించి బాటసారులకు, శాంత ముగా జీవనము గడపు మునిసంఘములకు నుపద్రవము గలి గించుచుండిరి. ఎవరి గుంపును వారు కాపాడుకొనుటకు వల

యున్నన్ని కట్టుదిట్టములు గావించుకొన్నను నడుమ నడుమ నిత
రులవలన నిబ్బందులు కలుగుచునే యుండుటచే నాంధ్రు
లందఱు నైకమత్యము కలిగి యుండు టావశ్యకమని వారిలోఁ
గొంద ఱుదారాశయులు గుర్తించిరి. అట్టి పరమపావనుల పరి
శుద్ధ నిశ్చల సంకల్పఫలమే యాంధ్ర సామ్రాజ్యస్థాపనము.

ఒకనాఁటి యుషఃకాలమున బ్రాగ్దిశనుండి సాంద్రారుణ
కాంతులు గోదావరీ నిర్మలవారిపూరములఁ బ్రతిబింబించుచు
నందలి పిల్లకెరటములతోఁ జెరలాడుచుండెను. అర్థవికసితము
లగు పద్మవనముల నొరసికొనివచ్చు ప్రభాతవాయువులు సర్వ
ప్రాణులను సుఖపారవశ్యమున ముంచుచుండెను. అనూపదేశ
ములం దేపుగాఁ బెరిఁగిన లతామతల్లికల లాస్యనైపుణికిఁ దీర
ప్రాంతముల బారులు దీర్చిన వనస్పతిప్రతతి యలర, తల
లాడించు చుండెను ఆనందమయకోశమున విశ్రమించియున్న
జీవరాసులం గోయిల పంచమ స్వరమున మేలుకొలుపు
చుండెను. క్రమముగా జీఁకటి ముసుఁగు దొలఁగించి విశ్వ
ధాత్రి తననైసర్గిక రూపసంపదను బయలుపఱుపఁ జొచ్చెను.
ఋషివాటికఁ బ్రాతస్స్మరణము వినవచ్చెను. హోమగంధము
పుష్పఫలసౌరభముతో వియ్యమందుచుండెను.

అది గౌతమాశ్రమమునకు సమీపముగానున్న పావన
గోదావరీ తీరము. పూర్వమొకప్పుడు గౌతముఁడను మహర్షి
శిష్యబృందముతో నందు నివసించుటచే నా యాశ్రమము
నట్లందురు. గౌతముఁడు కాని, తద్వంశీయులు కాని యిప్పు
డచ్చట నెవ్వరును లేరు. పవిత్రప్రదేశమనియు, గోష్పాదక్షేత్ర
మనియు ననేకులు మహర్షులు తీర్థసేవకై వచ్చి కొంతకాల

మక్కడఁ దపస్సుచేసికొని పోవుచుందురు. ఎవ్వరో కులపతి
యందువసించుచు వచ్చుచుఁబోవుచుండు జడదారుల కాతిథ్య
మొసఁగి సత్కరించు చుండుటమాత్ర మచట నవిచ్ఛిన్నము
గానే జరుగుచుండెను. మన కథాకాలమున నాపస్తంబుఁడను
మునిసత్తముఁ డయ్యాశ్రమమున వసించుచుండెను.

తెల్లవాఱినది. ఇంకను సూర్యోదయముకాలేదు. గర్భ
మందలి యాణిముత్తియమును వెలువరింప సిద్ధముగా నున్న
ముత్యపుచిప్పవలెఁ దూర్పుదిక్కు దర్శనీయమై యుండెను.
జ్ఞానోదయమునకుముందు చిత్తవృత్తులవలె నక్షత్రములు క్రమ
ముగాఁ గనుమాయఁ దొడంగెను. అట్టితఱి నొక యాత్రికుఁ
డయ్యేటి గట్టునుండి నెమ్మదిగాఁ బ్రయాణము చేయు
చుండెను. ఆతనిదృష్టి యన్వేషణపరాయణమై యుండుటచే
నతఁడాశ్రమద్వారము నరయుచున్నవాఁడేమో యని తోఁచు
చుండెను. ఆతని వయస్సు నలుబది సంవత్సరములకు మించి
యేఁబదికి దాటకయుండునని చూచువారికి గోచరించు
చుండెను. వక్షమున్నతము, విశాలము నై వ్రణకిణాంకితమై
యుండెను. గంభీరమైన మొగము, విశాలనేత్రములు, ఆజాను
బాహువులు రాజభావమును వ్యక్తముచేయుచుండెను.

ముఖము మంచుదెబ్బతిన్న పద్మమువలె మనోహర
మయ్యు హృదయమందలి విచారమునకుసూచకమైయుండెను.
ఎఱ్ఱవాఱెడి కనుగొలుకులు, అదరుచుండెడికెంబెదవులు, కృష్ణ
సర్పమువలె దీర్ఘమైవెడలు నిశ్వాసము, వ్రేటువడిన బెబ్బులి
వలెనున్న యాతనిచందము నప్పుడప్పుడు బయలు పుచ్చు
చుండెను. ఆతఁడెక్కిన యుత్తమతురంగము మాటలునేర్చిన

దానివలె రౌతుచిత్తము ననుసరించి నడచుచుండెను. దూర దేశము నడచివచ్చిన బడలిక పైకిఁ గనఁబడుచున్నను యజమానుని యాజ్ఞల ననుసరించి గతిలాఘవమును గనఁబఱచుటలో నయ్యశ్వరాజ మణుమాత్రము వెనుదీయుటలేదు. ఆశ్రమద్వారము కంటఁబడఁగానే యాపురుషుఁడు గుఱ్ఱము నుండి దిగి నదీప్రవాహమును సమీపించి హయమునకు నీరు పట్టి చక్కఁగాఁ గడిగి పీఁపుతట్టి "నేఁ దిరిగివచ్చునంతవఱకు నీవీతీర శాద్వలముల మేయుచుండు" మని విడిచిపెట్టెను. అట్లే చేసెదనని సమాధాన మిచ్చెనోయన నా తురంగము మంద్ర గంభీరముగా సకిలించి ప్రశాంత పావనములైన గౌతమీతీర భూములు నడయాడఁజొచ్చెను. అశ్వికుఁడు నదీప్రవాహమున నవగాహనముచేసి కాలకృత్యముల నాచరించుకొని వినీత వేషమును ధరించి యాశ్రమాభిముఖుఁడై నడువసాగెను. ఆశ్రమద్వారముదాఁటి యించుకలోనికిఁ బోవుసరికి బంగారు పిచ్చుక యొకటి చెవుల కింపుగాఁ గిచకిచలాడుచు నాతని యెడమ వైపుననున్న యొక మామిడికొమ్మనుండి మఱియొక కొమ్మమీఁదికిఁబఱుగెత్తెను. అందు సుఖముగాఁ గూరుచుండి పలుకఁబాఱిన కాయను ముక్కుతో పొడుచుచున్న శుకరాజ ముచ్చారణ సౌష్ఠవముమీఱ 'ఆర్యా! స్వాగతము' అని దానిని బహూకరించెను. "ఇది గొప్ప శుభసూచనము. మహర్షి నాయెడఁ దప్పక ప్రసన్నుఁడగుననియు, నా హృదయ భార మచిరకాలముననే తొలఁగింపఁబడు ననియు నాకు విశ్వాసము జనించినది" అనుకొనుచు నాయాశ్వికుఁడు మఱి నాలుగడుగులు వైచెను. ఇంతలో నొకమునికుమారుఁ డెదురు వచ్చి "అయ్యా! మీరు వైదేశికులవలె నున్నారు. ఇటు

దయచేసి యర్ఘ్యపాద్యములు స్వీకరింపుఁడు" అనెను. అశ్వినుఁడానందించి "ఋషికుమారా! ప్రియమధురములగు నీమాటల చేతనే సత్కరింపఁబడితిని. నేను మహాత్ముఁడైన యూప స్తంబుని జూడఁ గోరుచున్నాఁడను. శీఘ్రముగా వారి దర్శనభాగ్యము నాకు లభించుటకు మార్గ ముపదేశింపుము ?"

ఋషి:—(మందహాసము చేయుచు) దానికి నిదేదారి.

అశ్వి:—అయినచోఁ బద.

ఇరువురు నెమ్మదిగాఁ బోయి యొక తాటియాకుల పాకలోఁ బ్రవేశించిరి. అతిథులు విశ్రమించుటకు వలయు సదుపాయములన్నియు నందు గల్పింపఁబడి యుండెను. నిసర్గ రమణీయమైన ప్రదేశమున గాలి, వెలుతురు బాహాటముగా బ్రసరించుట కనువుగా నాశాల నిర్మింపఁబడి యుండెను. దాని చుట్టును బూలమొక్కలు వరుసలుగా నాటఁబడి మొదటినుండి కొనవఱకు నాకులు గనఁబడనంత దట్టముగాఁబూచి పరిమళమును వెదచల్లు చుండెను. అలికి ముగ్గులుపెట్టిన నేలపైఁ గొబ్బరియాకుల చాపలుపఱవఁబడి యుండెను. ఋషికుమారుఁడాతని నుచితాసనమునఁ గూర్చుండఁజేసి లోనికిఁ బోయెను. అంత నొకబ్రాహ్మణోత్తముఁడు ఫలపుష్పాంబువులు సేకరించుకొని వచ్చి యర్ఘ్యపద్ధతి నాతని కాతిథేయసత్కారము గావించెను.

అశ్వి:— అయ్యా ! మీకులపతి యెచ్చటనున్నవారు ?

బ్రాహ్మ:— వా రగ్నిసమారాధనము చేసికొను సమయమిది. కొలఁది సేపటిలో మీకు దర్శన మీయఁగలరు. సుఖముగా విశ్రమింపుఁడు.

బ్రాహ్మణుఁడు తన పనిమీఁదఁ బోయెను. ఆశ్రితుఁడాశ్రమరామణీయకమున కచ్చెరువందుచు మానసికవ్యథల నెల్ల విస్మరించెను. ప్రకృతిసౌందర్య మాతని దృష్టి నాకర్షించుటచే నా పురుషుఁడు నెమ్మదిగా లేచి నలువంకలు చూడ సాగెను. అప్పుడే యుదయించిన సూర్యకిరణ ప్రసారముచే నాశ్రమమందలి భూరుహాగ్రములు బంగారు నీరార్చినట్లు మెఱయుచుండెను. ఆ చెట్లమధ్య ఋషివరేణ్యుల పర్ణశాలలు వరుసగాఁ గనవచ్చుచుండెను. ఇండ్ల ముందటి వాకిళ్ళలోని యరుఁగులమీఁదఁ గూర్చుండి ముని కుమారులు వేదశాస్త్రములను వల్లించుచుండిరి. ఆజ్యగంధముతో హోమధూమము వెడలుచుండుటచే నగ్నిహోత్రశాల లివియని చెప్పనక్కఱ లేకయే తెలియనగుచుండెను. ఆశ్రమగృహము లన్నియు నైర్మల్యము, పావనత గలిగి, యారోగ్యనిలయములై యుండెను. వెనుకతట్టున నాశ్రమ మృగములు సంచరించుచు ఋషిభార్యలతోఁ దల్లిబిడ్డల న్యాయమున వర్తించుచుండెను.

వీనినన్నిటి సవిమర్శముగఁ బరికించుచుఁ దన్మయత నొందియున్న యా పురుషుఁడు నెమ్మదిగా జరిగి పోవుచున్న కాలమును సైతము గుర్తింపఁ డయ్యెను. ఇంతలో నొక ప్రాంతమునఁ బలువురేకకంఠముతో నగ్నిసూక్తములు పఠించు చుండుట నాతఁడువినెను. ఋషివర్యుని యగ్నిసమారాధనము పూర్తికావచ్చినదను తలంపుతో నాపురుషుఁడు యథాస్థానము నకువచ్చి వేచియుండెను. అప్పుడొక విద్యార్థివచ్చి 'అయ్యా! గురువుగారు మీరాకను గోరుచున్నా' రని యా నూతన పురుషునితో వాక్రుచ్చెను. ఆతఁడును సంభ్రమముతో లేచి 'ముని పుంగవు లెచ్చటనున్నారు ? పద! వారి పాదాభివందన మాచ

రింప మనసు తొందరపడుచున్న' దనుచు నాతని వెంబడినే పోయెను. ఆతఁడు మొగసాలనుదాఁటి చతురస్రముగానున్న వేఱొక విశాల చతుశ్శాలను బ్రవేశింపఁగానే మునిబాలుఁడు 'వారే గురువర్యులు! నమస్కరింపుఁ'డని నెమ్మదిగాఁబలికెను. ఆపస్తంబమహర్షి కుశాస్తరణముపైఁ బఱచియున్న యేణాజినమునఁ జిత్రాసనమున నాసీనుఁడై యుండెను. ఇరువైపుల ఋషివర్యు లనేకులు గూర్చుండి యాతఁడొనర్చు ధర్మోపదేశములను శ్రద్ధతో నాలకించుచుండిరి. ఉదయించుచున్న బాలభానుని బింబమువలె మహర్షి ముఖమండలము తేజఃపుంజముల నీనుచుండెను. భస్మోద్ధూళితమైన శరీరమున రుద్రాక్షమాలికలు వ్రేలాడుచుండెను. నల్లని గడ్డము, జటాజూటము చూచువారి హృదయమున వినయసంపదను హెచ్చించుచుండెను. శాంత స్తిమితములైన యాతని చూపులలో నవ్యక్త గంభీరమగు తేజము ప్రవహించుచుండెను. మహర్షి తనవంకఁ జూడఁగనే యాశ్వికుఁడు సాష్టాంగదండ ప్రణామమాచరించెను. తగురీతి నాశీర్వదించి యమ్మునిచంద్రుఁ డా పురుషు నొక కృష్ణాజినముననఁ గూర్చుండ నియమించెను. ఇంచుక సేపెల్ల వారును నిశ్శబ్దముగా నుండిరి. పిమ్మట మౌనిసత్తముఁ డా యాశ్వికునితో నిట్లు ప్రసంగించెను.

ఆప:—అతిథివిశేషలాభముచే మా యాశ్రమము ధన్యమైనది.

ఆశ్వి:—మీ దర్శనభాగ్యము మావంటి సామాన్య మానవులకు లభించుట పెద్దపెన్నుఁదగినది. చిరకాలమునుండి మిమ్ము దర్శింపవలయుననెడి కోరిక నేఁటి కీశ్వరానుగ్రహమువలన నీడేఱినది.

ఆప:—తెలియక మానవులు వేగిరపడు చుందురు. కాని యాశ్చర్యముఁ జెప్పు దేది చేయవలయునో అప్రమత్తుఁడై చేయుచునే యుండును. ఈ రహస్యమును తెలిసికొనుటయే విజ్ఞానము.

ఆశ్వ:—మహర్షుల చిరకాల శుశ్రూష చేసినఁగాని మానవులకు విజ్ఞాన ముదయించుట దుర్ఘటము. ఈ మందబుద్ధికా యదృష్టము ననుగ్రహింపుఁడని మునిసత్తములను వేఁడుకొనుచున్నాను.

ఆప:—మంచిది. మీ వాలకము దూర ప్రయాణముచే శ్రమ చెందినట్లున్నది. కొంత విశ్రమించిన పిమ్మట మరల సంభాషింతము.

ఆ మహర్షి యభిప్రాయము ననుసరించి విద్యార్థి నూతనపురుషుని ముఖశాలకుఁ గొనివచ్చి విడిచెను. ఆతఁడు వెడలిన పిమ్మట మునిరాజు సభ్యులను జూచి యిట్లు చెప్పెను. "మనమిఁకఁ గార్యరంగమునఁ బ్రవేశింపవలసిన యవసరమగుచున్నది. మీరు మీ కార్యములం దప్రమత్తులరై యుండుఁడు" ఆ మాటలు విని యందఱు "గురునర్ణేల యానతియైనచో ప్రళయాగ్నిలో నైన దుముకుదుము. సూర్యమండలము నైన మ్రింగుదుము. జాతిమత సంరక్షణకుఁ బ్రాణములను దృణప్రాయములుగాఁ బరిత్యజింతుము" అని యేకకంఠముగా శపథము చేసిరి. ఈ మాట లనుటతోడనే గురువర్యుఁ డాదరముతో వారిని విలోకించి "ఈ దీక్షతో నింకఁ గొంచెము కాలము శ్రమపడుదు రేని యాంధ్రసామ్రాజ్యము స్థాపితము కాఁగలదు.

నానావిధములఁ జెదరిపోయియున్న యాంధ్రజాతి యేకమై వ్యక్తిత్వమును గాంచఁగలదు. అప్పుడాంధ్రుఁ డార్యుఁడే; యనార్యుఁడు కాఁడు. వీనిని మ్లేచ్ఛునిగాఁ బరిగణించుట పొరపాటని యెల్లవారును గ్రహింపఁగలుగుదురు. ఇదియే మన మితరులకుఁ జెప్పవలసిన పాఠము. సరే! మీరు నిశ్శబ్ద ముగా నేగి స్వకార్యములఁ బ్రవృత్తులరై యుండుఁడు!"

వారికి సెలవొసంగి యా కులపతి నెమ్మదిగా లేచి మొగసాలకు విచ్చేసెను. ఏమియుఁ దోఁచక యొంటరిగాఁ గూరుచున్న యాశ్రితునిజూచి 'యించుక బడలిక తీఱినచో నా వెంట రావచ్చును. ఆశ్రమసందర్శనముగూడ విశ్రాంతి నిచ్చును' అనెను. తన వృత్తాంతమును సమగ్రముగ నమ్మునీం ద్రున కెఱిఁగింప వేగిరపడుచున్న యాశ్రితుఁడు తటాలున లేచి వెంటనరిగెను. బోదెలవెంట జలజల ధ్వనిచేయుచుఁ బూపొదలఁదడుపుచున్న సన్నని నీటికాలువ ననుసరించి వా రిరువురు నయ్యాశ్రమవృక్షములఁ జూచుచుఁ బోయిరి. అట్లు పోయి యొక నికుంజమున బ్రవేశించిరి. అందుఁ బుష్పాస్తరణ మున నాసీనులై యిరువురు చాలసేపు సంభాషించిరి. వారు బయటికి వచ్చునప్పటికి జామున్నర ప్రొద్దెక్కి యుండవచ్చును. మునివర్యుఁడు చతుశ్శాలాభిముఖముగఁ బోవుచుఁ "గాల కేతూ! రమ్ము! నీవు క్షత్రియుఁడవయ్యు జాతి ధర్మమును బాటింపవైతివి. అందుచే నీకీ యిక్కట్లు ప్రాప్తించినవి. నీవిక్కడఁ గొంతకాల ముండుట కవకాశమున్నదా ?"

కాల:—జీవితాంతమువఱకు నుండుమన్న నుండెదను. నా రాజ్యము ననుకూలుఁడు, విశ్వాసపాత్రుఁడు, నీతిపారగుఁడు

నగు మంత్రిచేతఁబెట్టి వచ్చితిని. కాళేశ్వరమునకుఁ బోవల
సిన పనియే నాకిప్పుడు లేదు.

ఆప:—నిశుంభుఁడు ప్రబలశత్రువే. అయినను సాధించుట
దుష్కరముకాదు. దానికిఁదగిన పురుషునియోగించెదను.
ఆతఁడు కొలఁది దినములలో నిచటికి రాఁగలఁడని
యూహించుచున్నాను. నీవు నాపుణ్యపురుషుని దర్శింప
నచ్చును. ఆతఁడు మిమ్మెల్ల నుద్ధరింప సమర్థుఁడని నా
యభిప్రాయము.

కాఁ:—మీ సాదరవచనములవలన నా కూఁతురు నాకు
లభించినదనియే తలంచుచున్నాను. ఆమె నుద్ధరించుటయే
నాజీవిత పరమావధి.

ఆప:—మూర్ఖుఁడా! నీకింకను రాజసభావము నశింపలేదు.
ఆశ్రమభూములు శుద్ధమైన సత్వగుణమునకు నిలయము
లని గ్రహింపుము.

కాలకేతువు నిర్ఘాంతపడి మునివర్యుని మొగమువంకఁ
జూచెను. ఆమహాసియుని నేత్రకోణము లెఱ్ఱవాఱి యుండెను.
ఏమిచెప్పుటకును దోఁపదయ్యెను.

ఆప:—నీ జీవితపరమావధి యేమనుచున్నావు? స్వార్థమా?
(అని గద్దించి పలికెను.)

కాలకేతువు మాట తడఁబడ 'స్వామీ కాదు' అని
హీలగొంతుకతో ననెను.

ఆప:—మఱియేమి?

కాల:—దేశసంరక్షణము, స్వజాతి సముద్ధరణము, స్వమత
పరిపాలనము, స్వధర్మాచరణము.

ఆపస్తంబుఁడు మందహాసముతో నాతని విలోకించెను. 'ఇప్పుడు నీచిత్తము దారికి వచ్చినది. నీవెవరికొఱకుఁ బాటు పడుదువు ?'

కాల:—నాబిడ్డకొఱకు – మునివర్యుఁడు మొగము చిట్లించెను. వెంటనే తెలివితెచ్చుకొని, నాదేశముకొఱకు – నాజాతి కొఱకు – అని కాలకేతువు గంభీరముగా వాక్రుచ్చెను.

'నీ వింకను సందిగ్ధావస్థలో నున్నావు. దీక్షగొనఁగుట కర్హతకలుఁగ లేదు. నీయాప్తవర్గము నిన్ననుసరించునా ?' యని యాపస్తంబుఁడు మరలఁ బ్రశ్నించెను. కాలకేతువు హృదయ మును బలపఱచుకొని 'తప్పక నన్ననుసరించును. నా మంత్రులు, సేనాధిపతులు నాక్షేమమునకై ప్రాణములనైన సులభముగాఁ ద్యజింతురు' అనెను.

ఆపస్తంబుని ముఖము మరలనించుక చండిమను వహించెను. కాలకేతుఁడు తెల్లపోయి 'మీతో మాటలాడుటకు నేనెంతవాఁడను ? మహాత్మా ! మీ యాదేశమును శిరసా వహించెద' ననెను.

ఆప:—మూఢుఁడా ! మనమొక ఘనకార్యమునకుఁ బూనినప్పుడు స్వార్థమును బూర్తిగాఁ బరిత్యజింపవలయును. త్యాగశీలుఁడుకాని దేశసేవకర్తుఁడుకాఁడు. నీతోఁబాటు దీక్షవహించిన గురుపుత్రులు నీకాప్తులుకాని యింటఁ గూర్చుండి యైహికసుఖముల ననుభవించువారు నీకాప్తు లెట్లగుదురు ? వారిమనస్సు లొకప్పుడు వికృతి నొందినను బొందవచ్చును. ఆశ్రమవాసులకుధర్మము, పరోపకారము,

నస్సిగతములు కావలయును. వారికి దేశమే కుటుంబము. కీర్తియే కళత్రము. స్వధర్మసంస్థాపనమే పరమావధి.

కాల:—గురూపదేశమును జక్కఁగా గ్రహించితిని. మోహ పాశములు తెగిపోయినవి. పంజరమునుండి వెలువడిన చిలుకవలె నాచిత్తము స్వాతంత్ర్యనభమున ఱెక్కలు విదుర్చుచున్నది. స్వామీ! నేనే నాయాప్తులయడుగుజాడల ననుసరింతును. నన్నొక యాశ్రమవాసునిఁగా గటాక్షించి దీక్షాబద్ధుని గావింపుఁడు.

ఆప:—నీ రాజ్యమిక్కడి కెంతదూరమున నున్నది ?

కాల:—నేనిప్పుడురాజునని చెప్పుకొనుటకు సిగ్గుపడుచున్నాను. నేనొక వనవాసిని. పూర్వపరిచిత రాజ్యమున్నదికాని దాని పై నాకు మమకారము లేదు.

ఆప:—నీవెవరిని గెలువవలయును ? ఏది యభీష్టము ?

కాల:—ధర్మకంటకులను నిర్మూలింపవలసిన భారము నాపై నున్నది. సన్మార్గమును విడువక యుత్తమ ధర్మమును స్థాపించుటయే నా యభీష్టము.

ఆప:—కాలకేతూ ! కొంతవఱకు నీ వహంకార మమకార ములవలన విముక్తుఁడవైతివి. సాధుమార్గావలంబికి సర్వము సుఖదాయక మగును. విశ్వమం దంతటను నిర్భరప్రేమ తొలఁకాడు చుండును. రమ్ము ! ఇటు దగ్గఱగా—

అప్పుడు వారొక చెట్టునీడను నిలిచియుండిరి. మహర్షి తనచేతులతోఁ గాలకేతుని నేత్రములు తుడిచి “చూడుము! ప్రపంచమునఁ బ్రేమ యెంత నిర్భరమై యున్నదో ? ఇది

పవిత్రప్రేమ. అట్టి దానికే యాశ్రమవాసుల హృదయమున స్థానముగలదు. ధర్మసంస్థాపనమే మన ప్రధానాశయము. ఇతరఫలము లానుషంగికములు" (పైకిఁ జూపుచు) ఈ చెట్టు పేరేమి ?

కాల:—సహకారము.

ఆప:—చక్కఁగా గుర్తించితివి. స్థావరమయ్యు నది యెట్లు తన నామమును సార్థక పఱచుకొనుచున్నదో సావధానముగా మననము చేయుము. చిత్తశుద్ధి గల వారికిఁ బ్రకృతియే జ్ఞానోపదేశము చేయుచుండును. నీవిప్పుడు నీ కాళ్ళమీఁద నిలువఁబడఁ గలవా ?

కాల:—మీ పాదపద్మములను స్మరించి నిలువఁగలను.

ఆప:—రమ్ము ! నీ వొక మనోహర దృశ్యమును జూడఁగలవు.

ఇరువురును మధ్యశాల కేగిరి. ఆశ్రమ వాసులలో ముఖ్యులైన వారెందఱో యచట నుండిరి. అందఱు సాష్టాంగ దండ ప్రణామములు కావించి నిలువఁబడిరి. ఒకరు చెప్పఁగా నందఱు నేకకంఠముతో ననువదించుచుండిరి.

| | |
|---|---|
| "ఒకఁడే దేవుఁడు" | "ఒకఁడే దేవుఁడు" |
| "గురుఁడే దేవుఁడు" | "గురుఁడే దేవుఁడు" |
| "ధర్మమే నిత్యము" | "ధర్మమే నిత్యము" |
| "ధర్మముకొఱకుఁ బ్రాణములు బలి యిచ్చెదను" | "ధర్మముకొఱకుఁ బ్రాణములు బలి యిచ్చెదను" |
| "స్వధర్మే నిధనం శ్రేయః" | "స్వధర్మే నిధనం శ్రేయః" |

| | |
|---|---|
| "నే నాంధ్రుఁడను" | "నే నాంధ్రుఁడను" |
| "నాది యార్యధర్మము" | "నాది యార్యధర్మము" |
| "సత్యశౌచముల నేమరి యుండను" | "సత్య శౌచముల నేమరి యుండను" |
| "ఐకమత్యము, సౌభ్రాత్రము, నాకనుష్ఠేయములు" | "ఐకమత్యము, సౌభ్రాత్రము, నా కనుష్ఠేయములు" |
| "ఈ నవరత్నమాల నెప్పుడును గంఠమున ధరించెదను" | "ఈ నవరత్నమాల నెప్పుడును గంఠమున ధరించెదను" |

కాలకేతు వొడలు జలదింపఁ బరవశుఁడై తానును ముక్తకంఠమునఁ బ్రతిజ్ఞావచనము లుచ్చరించెను. అప్పటికిఁ గుతపకాలమగుటచే మాధ్యాహ్నిక కృత్యములు దీర్ప నెవరి తెన్నున వారు పోయిరి. కాలకేతువు గురునానతి నాతిథ్యము స్వీకరించి తన యశ్వమును జూడఁబోయెను.

— —

# రెండవ ప్రకరణము

ప్రొద్దు వాలఁబడినది. దక్షిణమారుతము నెమ్మదిగా వీవఁదొడఁగెను. చల్లని చెట్లనీడలను జేరి విద్యార్థులు సూత్ర గ్రంథములను వల్లించుచుండిరి. ఆ సమయమున నొక గున్న మామిడి చెట్టుక్రింద నాపస్తంబమహర్షి కూరుచుండి తాటి యాకుల పుస్తకమును బరిశీలించుచు నందందు సవరణలు చేయుచుండెను. ఒకవిద్యార్థి "ఆర్యా! అర్జునదేవుఁడు తమ దర్శనమునకు వచ్చియున్నవాఁడు" అని మనవిచేసెను. "అర్ఘ్యపాద్యాదు లొసఁగి విశ్రమించిన పిమ్మట నిటుతీసికొని రమ్ము. దర్భాసన మొకటి యిటుపంపుము" అని గురువు చెప్ప గానే చిత్తమని విద్యార్థి వెడలిపోయెను. మునిబాలుఁ డొకఁడు దర్భాసనముదెచ్చి యచ్చట పఱచివెళ్ళెను. మహర్షి పుస్తక మును బరిశీలించుచునే యుండెను.

కొంతసేపటికి విద్యార్థి దారిచూప నర్జునదేవుఁడు వచ్చి గురువర్యుని పాదములకు నమస్కరించెను. ఆపస్తంబుఁడు యథోచితముగా నాశీర్వదించి ప్రక్కను గూర్చుండ నియ మించెను.

అర్జు:—ఏదో గ్రంథవిమర్శనము చేయుచున్నట్లున్నారు గురు వర్యులు.

ఆప:—విమర్శనముకాదు. ధర్మమును సంస్కరించుచున్నాఁడను.

అర్జు:—ధర్మముగూడ సంస్కారార్హమా?

ఆప:—జడస్వభావముగల మనుజుల యాచరణవలన నధ ర్మము ధర్మమువలె భాసించుచుండుట యొకప్పుడు తట

స్థించును. మధ్యమధ్య మహర్షులు దురాచారములను రూపుమాపి ధర్మమార్గమును బ్రకాశింపఁ జేయుచుందురు. దీనినే సంస్కరణమని యార్యులందురు. సరే! కీనికేమి? అన్నగారు భీమేశ్వర మహారాజు క్షేమముగ నున్నారా?

అర్జు:— మీ దయవలన క్షేమముగనే యున్నవారు. వారే మీకొకవిషయము తెలిపి తమయనుమతిని బడసి రమ్మని నన్నుఁ బంపినారు.

ఆప:— ఓహో! ఏమి విశేషము.

ఇట్లు పలుకుచు మునీంద్రుఁడు చేతనున్న పుస్తకమును సూత్రముతో బంధించి శిష్యుని కందిచ్చెను. వాఁడు దానిని గొని పర్ణశాలకేగెను. ఆపస్తంబుఁ డర్జునదేవుని ముఖము వంకఁ దిలకించెను.

అర్జు:— కృష్ణాతీరమునఁ గాకులము రాజధానిగాఁ దత్ప్రాంతము నేలుచున్న విష్ణుదేవుని పినతండ్రి వజ్రధరుఁడు మహారాజు గారికొక సందేశమును బంపియున్నాఁడు.

ఆప:— ఓహో! సుచంద్రుని సోదరుఁడు వజ్రధరుడా? సుచంద్రుఁ డీమధ్యనే కాలముచేసెనని వింటిని. సుచంద్రుఁ డాంధ్ర దేశము నొకపద్ధతికి దేవలయునని చాలకృషి చేసియుండెను. ఇట్టిఘనకార్యములు సాధారణముగా నొకని జీవితకాలమున గొనసాగుట దుర్ఘటము. ఆతని సోదరుఁడు, కుమారుఁడు నీ విషయమై ప్రయత్నించుచున్నట్లు వింటిని. వజ్రధరుఁడు మీసాయము నాశించుచున్నవాఁడన్నమాట. ఔనా?

అర్జు:—సాహాయ్యమర్థించుటయే యగునేమో? 'ఒక మహత్తర కార్యసంఘటన కాంధ్రనరపాలురలోఁ దలమానికము వంటి మీతో సంప్రతింప మా కుఱ్ఱవాఁడు కుతూహలపడుచున్నవాఁడు. సెలవైనచో రెండు మూఁడు దినములలో దర్శనము చేయగల' మని వారి సందేశము. మహారాజుగారు సందేశహరుని బహూకరించి మిత్రసమాగమమునకు మానేత్రపద్మము లెదురుచూచుచున్నవని ప్రతిసందేశము నంపిరి.

ఆప:—మహారాజునకుఁ జెప్పవలసిన దేమున్నది. నీవంటి సోదరుఁడు పరమభక్తితో సేవించుచుండుటయే భీమేశ్వరుని యదృష్టము. ఇప్పుడది యినుమడింపనై యున్నది. భావి చక్రవర్తి నీకు—

అర్జునదేవుని ముఖము నమ్రమయ్యెను. ఆతఁ డేమియు మాటాడలేదు. లలాటమున నించుక నిరుత్సాహము గోచరించెను. మహర్షులవాక్యములను గార్యజాత మనువర్తించునని యాతఁడెఱుఁగును. "ఏమి? నాకట్టి అర్హత లేదా?" యని తనలో దాను ప్రశ్నించుకొనెను. నిక్కముగా నర్జునదేవుడు ధీరోదాత్తుఁడు కానిచో నప్పుడు గలిగిన భావపరివర్తనము వలనఁ దలక్రిందులై యుండును. ఆపస్తంబ మహర్షి యది గుర్తింప లేకపోలేదు. "కుమారా! నీవు నిరుత్సాహపడవలసిన పనిలేదు. అనుభావమునకుఁదగిన మహాఫలమును బొందగలవు" అని యమ్మహర్షి వాక్రుచ్చెను. అర్జునదేవుని ముఖమున నూతనోత్సాహము పొడకట్టెను. మహనీయులకుఁగాని దేవరహస్యములు దెలియరావని యాతఁ డనుకొనెను.

యథార్థమున కర్జునదేవుఁడు చక్రవర్తిత్వమునకుఁ దగిన వాఁడే. ఆతని సుందరవిశాలనేత్రము లుత్సాహమును వెలువరించుచుండును. ఉన్నత విశాలవక్షము లక్ష్మి కాటపట్టయి యుండును. ముఖము గంభీరమై కార్యదీక్షతను వ్యక్తీకరించుచుండును. ఆజానుబాహువులు శౌర్యసంపదను వెల్లడించుచుండును. సర్వావయవములు దృఢములు. పుష్టికలవియునై చూపరకు భయముగొలుపుచున్నను, ఆకృతియం దనిర్వాచ్యమగు సౌమ్యత విలసిల్లుచుండును. ఆత డించుమించు ముప్పది సంవత్సరముల వయస్సు గలవాడు. వయస్సునకు దగిన యుద్యమోత్సాహము, దానికిఁదగిన మంత్రశక్తి గలవాఁడు. ద్రాక్షారామము రాజధానిగా గోదావరి తూర్పుతీరము నేలుచు విఖ్యాతిగాంచిన భీమేశ్వరుని యనుంగు సోదరుఁడు. ఆతని చాకచక్యము నెఱింగియే ఆపస్తంబుఁ డాతని వాత్సల్యముతో జూచుచుండును. నీవు ఘనకార్యమును సాధించుటకై జనించిన యవతార పురుషుఁడవని పెక్కుసారులు మునీంద్రుఁ డాతని శ్లాఘించి యుండెను. ఏమైనను నేను జక్రవర్తిని గాఁజాలను గదా యని యాతఁడు విన్నదనము నొందలేదు. ఆపస్తంబుఁ డిచ్చకపు మాటలాడు వాఁడు కాఁడని యా రాజకుమారుఁ డెఱుంగును. పదవుల కాశించి పనిచేయుట సామాన్యుల లక్షణము. సత్పురుషులు విధి నిర్వహణమునకే నిష్కాములై కర్మాచరణమునకుఁ గడంగుదురు. మునిచంద్రుని నోటినుండి యిట్టి నీతివాక్యముల నాతఁ డెన్నియోసారు లాలకించి యుండెను. ఆలకించుటతోఁ బోవక దృఢముగ విశ్వసించి యుండెను. అట్టివాఁడగుటనే తలఁపులనఁ గలిగిన చిత్తవికృతిని జక్కఁ జేసికొని యుత్సాహముతో మరలఁ దలయెత్తి మునీం

ద్రుని మొగమువంకఁ జూచెను. ఆతని చూపులలో భక్తి విశ్వాసములు తాండవించు చుండెను.

ఆప:—కుమారా! మహారాజుతో నావాక్యములుగాఁ జెప్పుము. ధర్మనిర్వాహణమే మన పరమధర్మము. మనము నిర్మింపఁదలఁచిన రాచబాట కెన్నియో పర్వతపంక్తు లడ్డు కొని యున్నవి. వానిని నేలమట్టము చేయుటకంటె నిమ్నోన్నతముల ననువుపఱచుట ముదావహము. భావి చక్రవర్తి నీప్రియ సోదరునకు విడువరాని చెలికాఁడు. ఆంధ్రదేశము స్థిరసౌఖ్యము నందఁగలుగునట్లు ద్రాక్షా రామ భీమేశ్వరుఁ డనుగ్రహించుఁ గాక!

అర్జు:—అనుగ్రహింపఁ బడితిని. ఇట్టి ముఖ్య సందేశమును గొనిపోవు భాగ్యము నాకిన్ని దినములకుఁ గలిగినది.

ఆప:—నీవు నైసర్గిక వినయసంపదను వ్యక్తీకరించినను నీనోటి నుండి కావలసిన వాక్యమే వెలువడినది. ఈ విషయమున నొక పరమార్థ మిమిడియున్నది. దానిని ముందుముందు నీవే గ్రహింపగలవు. భగవంతుఁ డెప్పుడేది చేసినను మన మేలుకొఱకే యని యెఱుంగువారు లేనిపోని సందియము లకు లోనుగారు. సంశయాత్ములు కానివారి కెన్నటికి వినాశము లేదు. విజయము కరతలామలకమై యుండును.

అర్జు:—ఇఁక నేను సెలవు దీసికొందునా? మహారాజుగారు నారాక కెదురు చూచుచుందురు.

ఆప:—ఈ రాత్రి యిచ్చటఁ గడపి యుదయమున సుఖముగా దక్షవాటి కేగఁగలవు.

అర్జు:—గురుదేవుని మాట జవదాటుటకు ఫాలాక్షుఁడుగూడ వెనుకాడును. అప్పటికి బాగుగాఁ జల్లఁబడినది. వారుభ యులును లేచి యించుకసేపు పూలమొక్కలను జూచుచు నందందు నడయాడి సాయంతనకృత్యములను దీర్ప చతు శ్శాల కేగిరి.

సూర్యుఁడ స్తగిరిశిఖర మధిరోహించెను. సంజకెంజా యలు ప్రసరించుటచేఁ గాలువలలోని నీరు సువర్ణద్రవమువలె భాసించుచుండెను. సూర్యాస్తమయము కాఁగానే చండశాస నుఁడగు దుష్టప్రభువునకుఁ దొలఁగియున్న సజ్జనులవలెఁజుక్కలు పొడచూపి క్రమముగాఁ దేజోవంతములగుచుఁ గలానిధియగు రాజు నుదయమును గాంక్షించుచుండెను. తామర సంకోచము నొందుటకుఁ గువలయము హార్దమును సూచించుచుండెను. పక్షులు కులాయములు చేరుకొనుచుండెను. హోమధేనువులు కడంగరమున కెదురుచూచుచుండెను. ఋషులు సంధ్యావంద నములు పూర్తిచేసిరి. మాణవకులు సాయమగ్నికార్యములను నిర్వర్తించిరి. ఆహితాగ్నులు శ్రౌతాగ్ని నుపాసించిరి. మునిపత్నులు వంటకములను సిద్ధముచేసిరి. ఇంతలోఁ జంద్రుఁడు కలాకలాపమును విస్తరించుచు గగనరంగమునఁ బ్రవేశించెను. చకోరపక్షులు కిచకిచలాడుచు నాకాశమధ్యమునఁ బరువు లెత్తెను. అంధకారము పటాపంచలై నిద్రారూపమునఁ బ్రాణి కోటి నాశ్రయింపసాగెను.

సాయంకాల భోజనములైన పిమ్మట మధ్యశాలలో ఋషులందఱు సమావేశమైరి. ఆపస్తంబుఁడు నర్జునదేవుఁడు నచ్చటికివచ్చి నడుమ దమకై సిద్ధముచేసియుంచిన యాస్తరణ

ముల నాసీనులైరి. శిష్యుఁడొకడు చదువఁగా నాపస్తంబ మహర్షి తాను రచించిన ధర్మసూత్రములలోని కొన్ని ఘట్టముల భావమును సభ్యులకు వివరించి చెప్పెను. ప్రాయశ్చిత్త ప్రకరణము, దాయవిభాగము, సత్సంతాన నిరూపణము, మున్నగు విషయములందు గౌతమాదుల యుద్దేశము, బౌధాయనుని యాశయము వివరించి సంస్కారావశ్యకర్తవ్యత నెఱిఁగించి తన నిర్ణయము నుపన్యసించెను. అప్పటికిఁ జంద్రుఁడు గగనమధ్యమును సమీపించి నిర్మల చంద్రికలను గ్రుమ్మరించుచుండెను. ఆపస్తంబుఁడు చాల ప్రొద్దుపోయినది. మీరింకఁ బోయి నిద్రింపుఁడని యందఱకు సెలవొసంగెను. ఎల్లవారును ఋషివరేణ్యుని వాఙ్మాధుర్యమును శ్లాఘించుచుఁ దమ తమ స్థానములకుఁబోయి శయనించిరి.

అర్జునదేవునకుఁ దగిన శయ్యా యేర్పాటు చేయఁబడినట్లు విప్రకుమారు లెఱిఁగించిరి. సరే! మీరేగి శయనింపుఁడని వారి కనుజ్ఞ యొసఁగి 'మహర్షి, కుమారా! నిద్రవచ్చుచున్నదా?' యని యర్జునదేవునితో ననెను. ఏమిసెలవు? కార్యభారము తలమీాద నున్నప్పుడు నిద్రించుట కవకాశమెక్కడ? ఆంధ్రదేశము స్వస్థపడకుండ నే యాంధ్రుఁడు మైమఱచి నిద్రించును?

ఆప:—యథార్థముచెప్పితివి. ఒకవైపున రాక్షసులమూఁకలు, ఒకవంక దోఁపిడి కాండ్ర గుంపులు. వీరుచాలక యాటవికుల బలగములు; ఇన్ని దేశమును గలవరపెట్టుచుండ నీవంటి శూరుఁడెట్లు నిద్రింపఁగలఁడు? సరే! ఆగుము—

మహర్షి చివాలున లేచి తన కుటీరమును బ్రవేశించి యొక్కింతలోనే వచ్చి తన యాస్తరణపైఁ గూర్చుండి 'రాజపుత్రా ! దీనిని బరిశీలింపుము' అని యొక రత్నఖచిత సువర్ణాభరణము నర్జున దేవుని చేత నుంచెను.

చంద్రిక కెదురు వెన్నెలలీను మణిభూషణమునుజూచి 'ఆహా! ఏమి దీని తేజఃపుంజము? ఇది తప్పక లోకమాత శిరోభూషణమైయుండును. ఇట్టి యనర్ఘమణిని ధరింప జగజ్జననికిఁ గాక మఱియెవ్వరి కర్హతయుండును ? ఇది గురువర్యుని కెట్లు లభించినదో ? లేదా మీరే తపోమహిమచే దీనిని నిర్మించితిరో ? నాకు బోధపడకున్నది. ఇందలి కుందనమును బదాఱు వన్నెలతో విలసిల్లుచున్నది.

ఆపస్తంబుఁడు స్మేరాననుఁడై యర్జునదేవుని నోటినుండి వెలువడు మాటలను వినుచుండెను. ఆతని కే సమాధానము నీయఁడయ్యెను.

అర్జు:—మహాత్మా ! దీనివృత్తాంతము వినఁదగునేని సవిస్తరముగా వినఁగోరుచున్నాను.

ఆప:—వినుట కేమున్నది. కొందఱు దస్యులు దొంగిలించిన వస్తువులను బంచుకొనుచు నున యాశ్రమవాసుల కంటఁబడిరఁట. వారు వారిని గకావికలుగాఁ దరిమి కొన్నివస్తువులు తెచ్చిరి. ఇది యందొకటి.

అర్జు:—అయినచో నాదుష్టులేపుణ్యదేవాయతనమునో కొల్లగొట్టి యుందురు. పురాతన దేవాలయములందుఁ జండికాదేవి కిట్టి శిరోభూషణములు గనవచ్చుచుండును. ప్రాచీన

చక్రవర్తుల నిస్తుల సంపదను సూచించు చిహ్నములలో నిదియొకటియని నాకుఁ దోఁచుచున్నది.

ఆప:—నీకుఁగలిగినట్లే నాకును దీనిని జూడఁగానే చిత్తమునఁ బ్రహ్మాభావము జనించినది. కాని యిట్టి యుత్తమరత్నము నేటి సంఘటనకై దైవము నాకడకుఁదెచ్చెనో బోధపడ కున్నది.

అర్జు:—పూజనీయములైన వస్తువులు లోకమాన్యులనే చేరు చుండును.

ఆప:—అది యటుండనిమ్ము! మఱియొక విశేషము. ఇంద్రావతి గోదావరిలోఁగలియు ప్రదేశమునఁ గాళేశ్వరమను నగర రాజము కలదు. కాలకేతుఁడనురాజు దానిని బాలించు చుండెను. ఒకప్పుడు నిశుంభుఁ డాదేశముపై దండెత్తి ప్రజానీకమును బాధించెను. కాలకేతువు సేనలను సమ కూర్చుకొని వానినెదిరింపక దుర్మతియై ప్రాణములు దాఁచుకొనుట కొకయడవిని బ్రవేశించెను. శత్రువు కుటుంబ ముతో నొక కొండకోన దాఁగియున్నవాఁడని తెలిసికొని నిశుంభుఁడాదారినే తనసైన్యములను మరలించుకొనిపోవుచు నిస్సహాయుఁడైన వానిని సకుటుంబముగా బంధించి తీసికొని పోయెను. కొన్నిదినములైనపిమ్మట దయదలఁచి విడిచి పెట్టెను. కాలకేతుని యేకైకపుత్రికను మాత్రము విడువఁ డయ్యెను.

అర్జు:—ఎంతదారుణకృత్యము! ఆమెవయసెంత?

ఆప:—అప్పటికి మూఁడేండ్లఁట.

అర్జు:— నాఁడా శిసువును దల్లిదండ్రుల కెడముచేయుటలో రాక్షసాధముని దురుద్దేశమేమి ?

ఆప:— నిశుంభునకు సంతతిలేదు. ఆతనిభార్య కాశిశువుపైఁ బుత్రికాప్రేమ యుదయించెను. భార్యయభీష్టమును నెఱవేర్చుట కాతఁ డట్లు చేసెను.

అర్జు:— పాపము! కాలకేతు డేమిచేసెనో ? ఆతనిభార్య పుత్రికావిరహమున నెంత దురపిల్లెనో ?

ఆప:— దురపిల్లుటతోఁబోలేదు. బెంగపెట్టుకొని యా సాధ్వి మరణించినది.

అర్జు:— శివశివా ! కాలకేతునకుఁ జెంపపెట్టు గోడపెట్టు దటస్థించినది.

ఆప:— ఆతని దుస్థితికి జాలిపడి యమాత్యవర్గము నిశుంభ వధోపాయ మాలోచించుచుఁ గోటనుబలపఱచి, నూతన దుర్గములను నిర్మించి, సైన్యసంపదను వృద్ధిచేయుచున్నవారు. కాలకేతువు నిశుంభునిపైఁ బగదీర్చికొన నీభుజచ్ఛాయ నాశించుచున్నవాఁడు.

అర్జు:— మీ సెలవైనచో నిశుంభునేకాదు. శ్రీరామచంద్రునివలె సకలరాక్షససంహార మొనర్చి దక్షిణాపథము నిష్కంటకము గావించెదను. ఇప్పుడు కాలకేతు వెక్కడనున్నాఁడు ?

ఆప:— ప్రస్తుత మాతఁ డిచ్చటనేయున్నాఁడు. మనోదౌర్బల్యమింకను నాతనిని బిశాచమువలె బీడించుచున్నది. కొలది

కాలములో నాతఁడొక యుద్ధవీరుఁడై యిచ్చటి వీరులను నడుప సమర్థుఁడగును.

అర్జు:—ఈ విషయమున మహారాజుగారితో నేమి మనవి చేయుమని తమయాశయము.

ఆప:—ఇప్పుడేమియుఁ జెప్పనక్కఱలేదు. మన కన్నివిధముల దైవము సహాయపడుచున్నాఁడనుటకు నిదర్శనముగా నీ కెఱిఁగించితిని. గ్రామవాసులు, జానపదులుగూడ మనకను కూలురై యున్నవారు. ఆశ్రమవాసులైన ఋషులు విధి విరామములులేక పల్లెపల్లెకుఁ బోయి ధర్మబోధచేయుచు నైకమత్యమును గలిగించుచున్నారు. కాకులేశ్వరునితో మన మేకీభవించిన మూఁడు పెద్దరాజ్యములొక్క త్రాటి మీఁద నడువఁగలవు. ఇంద్రసేన కుమారస్వామినివలె నాంధ్రసేన నిన్ను వరింపనై యున్నది.

అర్జు:— అంతవచ్చినచో మహారాజుగారే స్వయముగా సైన్యములను నడుపఁగలరని నా నమ్మకము. వారి యుద్ధోత్సాహము సాగరమువలె నపారము.

ఆప:—ఔను. ఆసంగతి నేనెఱుఁగనిదికాదు. కాని మీవంటి యువరాజులు వృద్ధులకుఁ బనికల్పింపరు. భీమేశ్వరుఁ డేకాలపువాఁడు. ఆతని విక్రమగాథలు చెప్పఁబూనినచో పెద్ద పురాణ మగును.

అర్జు:—ఇప్పటికి నాయనకు యుద్ధతృష్ణ యధికముగానే కలదు. ప్రతిదినము సైన్యములను స్వయముగాఁ బరిశీలింపక మానరు. శూరుల నుత్సాహ భరితులఁ గావించుటలో వారికిఁగల నైపుణ్య మత్యధికము.

ఆప:—సత్యమే. ఆ రణశూరు నాధారముగాఁ జేసికొనియే మీరు ప్రవర్తింప వలయును. దురాక్రమణతృష్ణ భీమేశ్వరుని చిత్తమును గలంపలేదు. కాని భరతఖండము నంతను నాతఁ డింతకుముందే జయించి యుండఁడా? ప్రజలను బిడ్డలవలె బోషింప వలయును గాని, బలవంతులము గదా యని యెన్నిప్రాణములనో బలియిచ్చి పరరాజ్యాక్రమణము చేయుట న్యాయమా? అది మన పూర్వ సంప్రదాయము కాదు. ఆవశ్యక మైనప్పుడు దుష్టులను మూలచ్ఛేదము చేయకమానరు. శ్రీరామచంద్రుఁడు వాలిని జంపి సుగ్రీవునకు, రావణుని జంపి విభీషణునకు రాజ్యమిచ్చెను గాని తాను లేశమును గొనలేదుకదా! రాజపుత్రా! చాల ప్రొద్దుపోయినది. ఉదయముననే నీవు నిజనగరమున కేగుము. నేననుష్ఠానములో నుందును. వేఱుగా సెలవక్కఱలేదు. కాకులరాజును సగౌరవముగాఁ బాపుమని భీమనాయకునితోఁ జెప్పుము. పోయి పరుండుము.

ఇరువురును లేచిరి. అర్జునదేవుఁడు రత్నమును మునివర్యునికిసమర్పించెను. దానిని గ్రహించి దీనియం దద్భుతమైన యాకర్షణ శక్తి గర్భితమైయున్నదనుచు శిష్యునకు సెలవొసంగి మహర్షి తన శయనాగారమున కేగెను.

# మూడవప్రకరణము

"ఆర్యా! అర్జున దేవుని యనురాగము భీమేశ్వరుని యుదారత చిత్తమున కెంతయుఁ బ్రీతిదాయకము లైనవి."

"కావుననే వీరిసహాయ మపేక్షణీయమని నొక్కి-చెప్పితిని."

"సాహాయ్యమల్పము. మైత్రియే వాంఛనీయము. సత్పురుషసహవాసము సర్వశ్రేయముల నొసంగును. సజ్జన సంభాషణమువలనఁ గలుగునానందము లోకమున సాటిలేనిది."

"ఔను! సజ్జనసాంగత్యమట్టిదే. కాళింగుని సాహాయ్యము స్వల్పమని త్రోసివేయఁదగినది కాదు. వీరిసైన్యసంపద యెంతసారవంతమైనదో నావికాబలము నంత ఘనమైనది."

"ఆర్యా! వీరాంధ్రులుకదా! కాళింగుఁ డంటివేమి?"

"గౌతమీనది కుత్తరతీరమునఁగల దేశమును గళింగ దేశమనియుఁ గొందఱు వ్యవహరింతురు. వీరు నౌకాయుద్ధమున నిపుణులు."

"నౌకాయుద్ధపుఁ బ్రసక్తి మనకంతగా నుండదు. మెట్ట మీఁద గూఁడ సాధ్యమైనంతవఱకుఁ బోరాటములు లేకుండఁగనే కార్యములు సాధింపఁ గోరుచున్నాను. రక్తముచేఁ దడియుటకు వసుమతీదేవి యెంత తల్లడిల్లుచుండునో నాహృదయము నంత వెనుకాడు చుండును."

"ఆవశ్యకము కానిదే ప్రాణివధకుఁ బూనుట యార్య సంప్రదాయముకాదు. క్రూరరాక్షసుఁడగు నిశుంభుఁడుతక్క-

తక్కినవారెల్ల సామంతతంత్రమునకే లొంగిపోవుదురు. కొందఱు పాళెగాండ్రు కొన్ని యధికారములిచ్చి మన్నించిన లొంగుబాటునకు వత్తురు. నిశుంభుని సర్వోపాయములు ప్రయోగించి తప్పనిచోఁ దుది యుపాయముచే లోఁగొనవలయును.

"నిశుంభుఁ డంతమూర్ఖుఁడని నీ యభిప్రాయమా ?"

"మూర్ఖుఁడేకాదు. గర్వితుఁడును."

"కారణము?"

"సింహళ ద్వీపవాసి చూలోదరుఁ డీతని భగినీపతి. ఆతని సాహాయ్యసంపద యీతనికి గర్వకారణ మగుచున్నది. మఱియు నీతఁడు నివసించు ప్రదేశము శ్రీశైల ప్రాంతకాంతారము. కొండజాతులవారు పాళెగాండ్రెందఱో విధేయులై యితని ననుసరించుచుందురు. వారి క్రూరకార్యముల నీతఁడు శూరకృత్యములనుగాఁ గొనియాడుచుండును."

"సింహళమునుండి తోడ్పాటు వీని కందకుండఁ జేయుటకు మనము నౌకాబలమునుగూడ వృద్ధిచేయ వలయుననియా నీ యుద్దేశము. ఔను!"

ఇట్లు మాటలాడుకొనుచు నిరువు రాశ్వికులు గౌతమీనది దక్షిణతీరమునఁ బ్రయాణము చేయుచుండిరి. వీరు కాకుతేశ్వరుఁడు, సుచంద్రాత్మజుఁడు నగు విష్ణుదేవుఁడు, నాతని పినతండ్రి యగు వజ్రధరుఁడునని పాఠకుల కవగతమే యై యుండును.

వీరు దక్షవాటి కరిగి భీమనాయకునితో మైత్రి చేసికొని తమ రాజధానికిఁ బోవుచుండిరి. వజ్రధరుఁడు రాజనీతి విశా

రదుఁడు. విష్ణుదేవుఁడు ధీరోత్తముఁడు. నూత్న యౌవనమాతని యంగకములకు నవక మొసంగుచుండుటచేఁ జిగిర్చిన వసంత చూతమువలె నాతఁడు దర్శనీయుఁడై యుండెను. చక్రవర్తి లక్షణము లాతని నాశ్రయించి చూచువారల మానసముల విధేయతను బొందుకొలుపుచుండును. చంద్రబింబమువంటి ముఖమును, విశాలములైన యాకర్ణాంతనేత్రములు రాచ శీవికి నిలయములై భాసిల్లుచుండును. ఔన్నత్యము, పుష్టి, దర్పము నాతని సర్వావయవములకు సాధారణ లక్షణ మన వచ్చును. ఆకృతి సౌష్టవమేకాక యంతరంగ శుద్ధి, నిసర్గ గాంభీర్యము, భూతదయ, శౌర్యము, ధైర్యము మున్నగు సుగుణము లాతని నాశ్రయించుకొనియుండుటచే శ్రీరాముని వంటి యవతారపురుషుఁ డీతఁడని నాఁటి జనులలోఁ జాల మంది విశ్వసించి యుండిరి. అందుకుఁ దగున ట్లాతఁడు బంధు ప్రేమ, మిత్రవాత్సల్యము గలిగి యితరుల కష్టములను దనవిగా భావించుకొని నివారించుచుండును. తన యేలుబడిలోని ప్రజలు సుఖించు చుండిరని తెలిసికొన్నప్పు డాతనికిఁ గలుగు నంతటి యానందము మఱియెన్నఁడు దేనివలనను జనింపదు. ఇట్టి యుత్తముఁడగుటచేతనే ప్రజానురాగము నాతఁడు చూఱ గొనఁ గల్గెను.

వజ్రధరుఁ డాతని పిన్నతండ్రియు, మంత్రియునై కార్యములు నడుపుచుండెను. ఆంధ్రదేశము యథాయథలుగా నుండుట కనుఁగొని పరితపించి సామ్రాజ్యస్థాపనకు బునాదులు వేసిన సుచంద్రుని సోదరుఁడగుటచే నన్నగారి యభీష్టము కుమారునికాలమందైన నెఱవేర్చుటకు దీక్షవహించి వజ్రధరుడు

చాలమంది పాళెగాండ్రను వశముచేసికొని తగువారితో రాయబారములు నెఱపి మిత్రసంపదను వృద్ధిచేయుచుండెను. అంతటితో నూరకుండక యుద్ధమునకు వీలగు నౌకలను గట్టించి సముద్రముమీఁద యుద్ధము చేయు సైనికులను బ్రోత్సహించుచు అంతర్వేది, బృందావనము మొదలగు రేవులను నౌకాశ్రయములుగా గట్టుదిట్టములు చేయించెను. కోటలును దుర్గములును నిర్మింపఁజేసి కందకములనేర్పఱచెను. దేశములో వ్యవసాయము వృద్ధిచేయుటకుఁజెఱువులు త్రవ్వించెను. దేశమునుండి దారిద్ర్యమును బాఱ ద్రోలుటయేకాక పరరాజులవలన, దోపిడికాండ్రవలన బ్రజలకిబ్బందులు లేకుండ జేయుచుండెను.

విష్ణుదేవుఁడు పినతండ్రిచేయుకార్యముల కించుకయు నడ్డుచెప్పక యాతడు గీచిన గీటు జవదాటక ప్రజోపయోగములగు కార్యముల బ్రోత్సహించుచుండెను. సామ్రాజ్యకాంక్ష యాతని చిత్తమును వ్యాకుల పెట్టలేకపోయెను. కాని యాంధ్రసామ్రాజ్యమును స్థాపించి తండ్రి తలంపు నెఱవేర్చి పితౄణము దీర్చికొన వలయునని యామహనీయుడు వేగిరపడుచుండెను. యుద్ధము మాట తలంపునకు వచ్చినప్పుడు కోట్లకొలఁది ప్రాణులనువధించి యొక్కనిఅభీష్టము నెఱవేర్చుట యుక్తమా? యనియాదయార్ద్రహృదయుఁడు తత్తఱిల్లుచుండును. వజ్రధరుఁడు నల రామ యుధిష్ఠిరాదులు లోకసంరక్షణముకొఱకు దుష్టసంహారము చేసిరనియు విషవృక్షములరూపుమాపక యారామనిర్మాణము సాధ్యముకాదనియు గుమారునకు నచ్చఁజెప్పుచుండును. ఉభయసేనామధ్యమున

బంధువధ నొనర్పఁజాలక నిర్విణ్ణుఁడైన పార్థునకు శ్రీకృష్ణ భగవానుఁడు చేసిన సద్బోధనను మరలమరలఁజదివి మననము చేయుచు నికూడ నాతఁ డతనికిఁ దెలుపుచుండును.

వజ్రధరుఁ డింతపట్టుదలతో నాతని బురికొల్పుటకుఁ గారణము లేకపోలేదు. సుచంద్రుఁడు చిరకాలము కృషిచేసి తన జీవితకాలములో నాంధ్రసామ్రాజ్యము స్థాపితమగుట యసంభవమని గ్రహించినపిమ్మట నొకనాఁడు సోదరునితో రహస్యముగా నిట్లుచెప్పెను. "తమ్ముఁడా! బంధువైనను మిత్రుఁడైనను మంత్రియైనను నాకునీవే. నామాట కెన్నఁడు నెదురాడియెఱుఁగవు. నేను దలఁపెట్టిన మహాకార్యము నీవు సహాయుఁడవై నిలుచుటచేతనే యింతవఱకైన గొనసాగినది. నాకు వయస్సుచెల్లినది. మృత్యువాసన్నమైనదనుటకు నాకుఁ గొన్ని సూచనలు గనఁబడుచున్నవి. నాకుమారు డింకను ముక్కుపచ్చ లారనివాఁడు. సామ్రాజ్యస్థాపనకు నేను నోఁచిపుట్టలేదు. నా కుమారునైన నాంధ్రచక్రవర్తిని జేయ నీవు మాట యిచ్చినచో హృదయశల్యమును విడిచి సుఖముగా జీవితశేషమును గడపెదను." ఈమాటలు వినునప్పటికి వజ్రధరుని హృదయము నీరయ్యెను. అన్నగారి దీనదృష్టిని జూచియతఁడు ఖేదపడెను. అతఁడేల యట్లు చెప్ప సాహసించెనో యూహింపఁ జాలక పోయెను. అన్నగారు తన్ననుమానించి యుండునని యనుకొనుటకైననాతఁ డిష్టపడలేదు. కార్యాసక్తియు, నిరుత్సాహము గలవర పెట్టఁ, దన్నట్లు కోరియుండెనేమో యని యెట్టకేల కాతఁడు మనస్సులోననుకొనెను. తగినంత నమ్మకము గలిగించి యుత్సాహపెట్టనిచో సుచంద్రునకుఁ బ్రాణాపాయస్థితి సంభవింపవచ్చుననికూడ నతఁడు భయపడెను.

అగ్రజునియెడఁ దనకుఁగల యపారభక్తిని బ్రత్యక్షీకరించుట కింతకంటె మంచి సమయము తన జీవితకాలములో లభించుట దుర్ఘటమని యాతఁడెంచెను. కొలఁదికాలము క్రింద టనే వజ్రధరునిప్రేయసి పరమపదించెను. ఆమెయందలి ప్రేమాతిశయముచే నన్నగా రెంతచెప్పినను మరల నింకొక సాధ్వి నింతవఱకు నాతఁడు చెట్టబట్టియుండలేదు. ఆ యవకాశమును బురస్కరించుకొని వజ్రధరుఁడు "అన్నా! భగవంతుఁడు నీనోట నేఁ డిట్టి వాక్యము నెందుకు పలికించెనో తెలియజాలకున్నాడను. నీ కుమారునికంటె నాకుమాత్ర మెవ్వరున్నారు? ఇదిగో! నా ప్రతిజ్ఞ వినుము! పోయినభార్య పోనేపోయినది. ఆ దివ్యజ్యోతి సాక్షిగా నీ కుమారు నాంధ్రసామ్రాజ్య పట్టాభిషిక్తుని జేయుటకై నా సర్వశక్తులు వినియోగించెదను. నా శక్తులనన్నిటిని గేంద్రీకరించుటకై యిఁక యావజ్జీవము బ్రహ్మచర్య మవలంబించెదను. ఇది త్రికరణశుద్ధిగాఁ జెప్పినమాట." అని నిరాడంబరముగాఁ బలికెను.

సుచంద్రుఁడు తెల్లపోయి "తమ్ముఁడా! కార్యభారము నీకొప్పగించి వెనుకనుండి నడపింపఁ దలంచితినికాని యింతటి ఘోర ప్రతిజ్ఞ చేయుదు వనుకొనలేదు. నీ వివాహమునకును రాజకార్యములకు నేమి సంబంధమున్నది? నామాట విని ప్రతిజ్ఞలోని చరమభాగము నుపసంహరించుకొనుము" అని యెంతయో బ్రతిమాలుకొనెను. "ఆడినమాట తిరుగుట వజ్రధరుని జీవితములో లేదు" అని యాతఁ డన్నతో ఖండితముగా జెప్పి ముందు జరుగవలసిన కార్యమున కాతనివలనఁ దెలియఁదగిన రహస్యము లన్నిటిని దెలిసికొనెను. ఇది జరిగిన కొలఁది

కాలముననే సుచంద్రుఁడ స్తమించుట సంభవించెను. ఆ కారణముచే వజ్రధరుఁడు విష్ణుదేవుని సుకుమార కోమల హృదయమున ద్వేషబీజముల నాటుటకు యత్నించుచుండెను. విష్ణుదేవుఁడు ధీరుఁడైనను దయాశాలియు, స్థిరుఁడైనను దురాగ్రహము లేనివాఁడు నగుటచేఁ బినతండ్రి యుపదేశము శీఘ్ర ఫలకారి కాఁజాలదయ్యెను. ఆపస్తంబుని బోధవలనఁ గుమారునకు సంగ్రామప్రీతి జనించునని తలంచి "కుమారా! యింకొక మహాపురుషునితో నీకుఁ బరిచయము గలుగనై యున్నది. ఎదుటఁ గనఁబడునది గౌతమాశ్రమము. ఇందాపస్తంబుఁడను మహర్షి వసించుచుండును. చెంతనుండి పోవుచు మహాత్ముల దర్శింపకుండుట యపచారమగును. ఆ మహనీయునితో సంభాషించిన నీమానసిక వృత్తులలో గొంతమార్పు సంభవించును. ధర్మసూక్ష్మము లెఱుఁగఁబడును. సందేహములు పటాపంచలగును" అని నుడివెను. విష్ణుదేవుఁ డందులకు సమ్మతించెను. ఇరువురు నాశ్రమద్వారమును సమీపింపఁగానే గుఱ్ఱములనుండి దిగిరి.

ఆపస్తంబమహర్షి వారిరాకనింతకుముందే శిష్యులవలన దెలిసికొని భావిచక్రవర్తి మనస్సు నాకర్షించుటకుఁ దగిన యేర్పాట్లు చేయించి యథార్థముగా నెదురేగి తీసికొని వచ్చుటకుఁ దగువారిని నియోగించెను. ఆశ్రమద్వారమున నున్న యమ్మహాపురుషుల కెదురువచ్చి మునిశిష్యులు స్వస్తివాక్యము లుచ్చరించుచు లోనికి దయచేయవలసినదిగా గోరిరి. వజ్రధర విష్ణుదేవులు తమయశ్వములను మునిబాలకులు చెప్పినచోట విడిచి ద్విజపుంగవులు చూపినదారిని మహర్షిని దర్శింపనేగిరి.

ఆపస్తంబుఁడు చతుశ్శాలలోఁ దననియమితాసనమునఁ గూర్చుండెను. అతని యెడమపార్శ్వమున నున్నతాసనములు రెండు కల్పింపఁబడియుండెను. కుడివైపునఁ దాటియాకుల పుస్తకములుంచిన పీఠమొకటియుండెను. తత్పరిసరముల షడ్దర్శనము లభ్యసించెడి శిష్యులు మహర్షికనుసన్నల మెలఁగుచుండిరి. వారికెదురుగా నాశ్రమవాసులలోఁ బెద్దలు కూరుచుండిరి. నాఁడు చతుశ్శాల తోరణములు మొదలగు వానితో నలంకరింపఁబడి దర్శనీయమై యుండెను. మహోత్సవమునకు వలె మంగళవస్తువులెన్నో సేకరింపఁబడి యచ్చటచ్చట నుంచబడెను. నాలుగువైపుల గోడలమీద మహావాక్యచతుష్టయము నాగరలిపిలో వ్రాయబడి యుండెను. తూర్పువైపునఁ గొలువు దీర్చిన యింద్రునకు బృహస్పతి రాజనీతి నుపదేశించుచున్నట్లు దక్షిణమునఁ గౌరవ పాండవ సేనామధ్యమున రథమునిలిపి విషణ్ణుఁడగు పాండవమధ్యమునకుఁ జక్రధరుఁడు విశ్వరూపమును గనఁబఱచుచున్నట్లు, పడమటఁ గల్పవృక్షమునీడఁ బుష్పకవిమానమున పీఠాసనాసీనుఁడై యున్న రామభద్రునకు వసిష్ఠమహర్షి జ్ఞానోపదేశము చేయుచున్నట్లు, నుత్తరమున వానప్రస్థాశ్రమస్వీకార మొనర్చి హరిసేవా ధురంధరుఁడై యొప్పిన యంబరీషుని జీవితమును చిత్రింపఁబడి యుండెను. అర్ఘ్యపాద్యాదులు స్వీకరించినపిమ్మట వజ్రధర విష్ణుదేవులు చతుశ్శాలకేతెంచి యూపస్తంబుని పాదపద్మములకు నమస్కరించిరి. విజయీభవ! అని యాతఁడు ప్రత్యేకముగా దీవించి పరిక్రమున్న యాసనములఁ గూర్చుండ నియోగించెను. వారు కూర్చుండుట తడవుగా సభాసదులెల్లరు లేచి యేకకంఠముగా "జయము! ఆంధ్రచక్రవర్తికి జయము! అభ్యుదయము!

ఆంధ్రజాతికి మహాభ్యుదయము" అని పలుకుచుఁ బుష్పవర్షము గురిపించిరి. వజ్రధర విష్ణుదేవులు లేచి అందఱకు నమస్కరించిరి. వజ్రధరుఁడు "మహర్షుల వచనము లమోఘములు. కార్యసిద్ధి చేతుల కందుబాటులోనున్నట్లు తెలుపుచున్నవి" అనెను. ఉభయులును మరలఁ గూరుచుండిరి.

ఆపస్తంబుఁడు మొదటఁ గొంత యిష్టాగోష్ఠి నడపెను. పిమ్మట సుచంద్రుని మరణమున దేశమునకుఁ గొఱంత వాటిల్లినదని తెలిపెను. మనమాంధ్రసామ్రాజ్యమును స్థాపింపగలుగుదుము. దానికి సందేహము లేదు. సుచంద్రుఁడు జ్యోతిర్మయ శరీరముతో మిమ్మాశీర్వదించుచున్నాఁడు. వజ్రధరా! మీరు దక్షవాటికేగి భీమేశ్వరుని మైత్రి సంపాదించుట శ్రేయోదాయకము. ఆ మహారాజు మీతో సగౌరవముగా మైత్రి నెఱపెనా? యనెను.

వజ్ర:—సర్వశ్రేయములకు మీ యాశీర్వచనమే మూలకారణము. మేము దక్షవాటికలోనున్నంతకాలము స్వగృహము మాట మఱచి పోయితిమి. భీమనాయకుఁడేమి, యతని సోదరుఁ డర్జునదేవుఁడేమి మమ్ము విశేష గౌరవముతోఁ జూచిరి. కృష్ణార్జునులవలె విష్ణుదేవుఁడు, నర్జునదేవుఁడు మిత్రభావమును వహించిమించిరి. అంతరంగ శుద్ధిగలవారి సఖ్యము సాప్తపదీనము.

ఆప:—విష్ణుదేవా! నికుంభరాక్షసుని సంహరించుటకు నీ వొకఁడవే సమర్థుఁడవు. మేమందఱము నీ యుద్యమమునకు దోహద మిచ్చెదము. సామ్రాజ్యలక్ష్మి నిన్ను భజింప నువ్విళ్లూరుచున్నది. దేవబ్రాహ్మణ హితార్థము నికుంభవధకుఁ

గంకణము కట్టుకొనుము. అనన్యసాధ్యమగు కార్యమును నిర్వహించుటవలననే యశస్సు చేకూరును.

విష్ణు:—మహాత్మా! దండన మధమసాధనమని పెద్దలు చెప్పుచుండఁగా మనము కయ్యమునకే యేల కాలు ద్రవ్వవలయును! ఇతరోపాయములచే సాధ్యముగానిచోఁ దమ శాసనము నవశ్యము శిరసావహించెదను.

ఆప:—నేను భావిని గుఱించి చెప్పుచున్నాను. అత్యంత దృప్తులయెడ నుపాయములు వమ్ములగును. అయినను బ్రయత్నింపకుండుట నీతివిదుల పంథకాదు. సర్వవిధముల బ్రయత్నించియే కార్య నిశ్చయము కావింపఁ దగును. శ్రీరాముఁ డంగదుని, యుధిష్ఠిరుఁడు శ్రీకృష్ణుని బంపి రాయబారములు జరపలేదా?

వజ్ర:—మనము కూడ సర్వము సిద్ధము చేసికొని నిశుంభునకు రాయబార మంపవచ్చును.

విష్ణు:—కార్యవాదులు మొదటినుండియుఁ గలుపుగోలుతనమునే పూనియుండుట న్యాయము. మనతోఁ మిత్రభావమున నుండుటకు నిశుంభుఁడు తిరస్కరించునని మన మేల ముందుగానే సిద్ధాంతీకరింపవలయును?

ఆప:—సిద్ధాంతము చేయుటలేదు. ఆతనికి మనకు నుద్దేశములలోఁ జాల వ్యత్యాసము లున్నవి. పరరాజ్యముల మాట యటుండఁగాఁ దన దేశములోని ప్రజలనే స్వలాభముకొఱకాతఁడు పీడించుచుండుననియుఁ బాలెగాండ్రు దుండగములను శ్లాఘించి ప్రోత్సహించుచుండుననియు

దారిదోపిడిగాండ్రు తెచ్చు సొమ్ములలో నుత్తమములైనవి స్వీకరించి వారికి సాహాయ్య మొనర్చు చుండు ననియుఁ బలువురవలన వినియున్నారము. చిరకాలాను గతములై జీర్ణించియున్న దుష్టవాసన లాతని హృదయము నీజన్మలో విడువవు. అసత్యమునకు వెనుకాడఁడు. విశ్వాస ఘాతము యాతని కుగ్గుపాలతోఁ బెట్టినది. సుచంద్రాత్మజా! ఆ నీచుఁడు మనతో నెన్నఁడుఁ గలిసియుండుట కంగీక రింపఁడు. ఇది నిశ్చయము. అట్లని మనము న్యాయ మార్గము ననుసరింపక మానము. అధర్మముచే నుడికిపోవు చున్న భూతధాత్రి తొలకరివానచే వలె దుష్టుల రక్తవర్ష ముచేఁ దడియక సుఫలవంతము కాదు. మోదు కొట్టి, కాల్చి, దున్ని కర్షకుఁడు బీజావాపము చేయదగును గాని దుబ్బులలోఁ జల్లిన విత్తనము లెంత ప్రశస్తము లైనను నిష్ఫలము లగును. దేశకాలము లెంత యాను కూల్యము గలిగియున్నను కృషి సక్రమముగా జరుగనిచో ఫలాశ సన్నగిల్లును.

విష్ణు:—అట్టిదుష్టాత్ములను బావనుల నొనర్చుటకే మహర్షులు కృషిచేయవలయునుఁగదా!

ఆప:—ఔను! ఇవిగో! ధర్మశాసనములు. ఎన్ని యోసంస్క రణములు గావింపఁబడినవి. ఇవియన్నియు నెవరికొఱకు? దేశమును ధర్మాచరణములేక ధర్మప్రతిబంధకులైన వారి నుండి వీనినిగాపాడవలసిన పూచి ఋషులపై లేదా? దుష్టు లను బునీతులను జేయుటకు రెండుమార్గము లున్నవి. సంసర్గాదులవలన సంభవించిన దుష్టత్వము హితబోధచే

మాన్పవచ్చును. నైసర్గికదుష్టత్వము దండనముచేఁగాని చక్కఁబడదు. దోషి రాజదండనము ననుభవించి పునీతుఁ డగుచున్నాఁడు. ఆతతాయులను వధించి లోకమర్యాదను నిలుపఁజాలని రాజాధముఁడు నరకకూపములఁ బడును.

విష్ణు:—అహింస పరమధర్మ మను సూత్రమును మీరెట్లు సమన్వయింతురు?

ఆప:— కుమారా! అహింస పరమధర్మమనుట నిర్వివాదమైన విషయమే. కానిఅహింసయొక్కస్వరూపమునుగు ర్తించుట యనుకొనినంత సులభముకాదు. గోవు తృణమును మేయుట కుత్సహించినట్లే బెబ్బులి ధేనువును హింసింపఁ గుతూహల పడును. భగవంతుఁడు కొమ్మవంచి పూవుగోసి తన్నర్చించు భక్తునిమెచ్చునా? కోయుటకుఁ జేతులాడక భగవంతుని యపారవిలాసముల నందేకాంచి యానందముచే మైమఱచు సుకుమారహృదయుని మెచ్చునా? ఉభయులు దేవునికి సన్నిహితులే! ఉభయులు నిష్కామకర్మాచరణతత్పరులే! మొదటివానిదికర్మయోగము, రెండవవానిదిజ్ఞానయోగము ఎవ్వఁడాత్మసుఖముగోరి పరపీడచేయుచున్నాఁడో వాఁడు హింసాఫలము నొందుచున్నాఁడు. తప్పుచేసిన శిష్యుని గోపించుగురుఁడును, ఒరులకుహానిచేయు దుండగులను గాసి పెట్టు భూపాలుఁడును దోషమణుమాత్రము పొందరు.

విష్ణు:—కర్మయోగముకంటె జ్ఞానయోగ ముత్తమముకాదా?

ఆప:—ఉత్తమమే! అయినప్పుడు దానికే మనము ప్రాధాన్య మేల యొసఁగఁగూడదని నీవు ప్రశ్నింపవచ్చును. అధికారి తారతమ్యమునుబట్టి రెండును సమప్రధానములగుచున్నవి

ఋషి యంతశ్శత్రువులను నిగ్రహించును. రాజర్షి లోకకంటకు లను దునుమాడును. ఉభయులు నహింసావ్రతులే. అధి కారవాంఛకు, భోగాసక్తికి లోనై పరరాజ్యాక్రమణకు సిద్ధ పడు రాజాధములు పాతకులగుచున్నారు. అట్టివారినిగూడఁ బునీతులఁ జేయుటకే రౌరవాది నరకములను భగవంతుఁ డేర్పఱచియున్నాఁడు.

విష్ణు:— మహోపదేశముచేత నను గ్రహింపఁబడితిని. సంశయ ములు తొలఁగినవి.

ఆప:— వత్సా! ఒక్కమాట వినుము. తోటమాలి నీటి బోదెలను ద్రవ్వి యెరువులు వేసి కృతార్థుఁడు కాలేదు. చీడ పట్టినయాకులను దుంపి వేయక మానఁడు. చీడపురుగులను రూపుమాపును. కొన్నిచెట్లవేళ్లను తెగనఱకును. మొగ్గలు తొడుగుటకై కొన్నితీగలను దానే మోడుచేయును. దోహదము చేయుచుఁ బ్రతిబంధకముల నిర్మూలించును. రాజు నట్టివాఁడే.

వజ్ర:— కుమారా! ఆచిత్రములను దిలకింపుము. ఇంద్రునకు గీష్పతియు, శ్రీరామునకు వసిష్ఠుఁడు నెట్లుపదేశించుచు న్నారో యీమహర్షి నీకట్లు ధర్మము నుపదేశించుచున్న వాఁడు. వాసవిని వాసుదేవుఁడట్లు క్షత్రియ ధర్మాచరణకుఁ బురికొల్పుచున్నాఁడు. ఈమహాత్ముని యాదేశ మవశ్యా చరణీయము. ఋషివాక్యమే ధర్మశాస్త్రము.

ఆప:— ఈచిత్రముమాట యేలచెప్పవైతివి? ఇతఁడు సప్తద్వీప విశాలభరము భుజాస్తంభమునఁ బూనియు మహాభక్తుఁ డని పేరువడసిన యంబరీషచక్రవర్తి. కాంతాకనకాదులం

దించుకయు నీహ లేక ప్రజను, దేవుని సమబుద్ధితో నారాధించిన మహాభక్తాగ్రేసరుఁడు. విష్ణుదేవా! పార్థునివలెను శ్రీరామచంద్రునివలెను దుష్టసంహారముచేసి యింద్రునివలె వైభవము నెఱపి యంబరీషునివలె నిర్లిప్తుఁడ వగుము. ఇది నామాటకాదు. ఈశ్వరాదేశము.

విష్ణు:—శిరసావహించితిని. లోకకంటకులను మట్టుపెట్టి సాధుహితముచేయుటకు వాగ్దానము చేయుచున్నాఁడను. మంచిమార్గము నవలంబింపనిచో నిఁక నిశుంభుఁడు జీవింపఁడు. లోకములన్నియు నాతనికి దోడైనను వధించితీరెదను.

అందఱు:. జయము! ఆంధ్రచక్రర్తికి జయము! అభ్యుదయము! ఆంధ్రజాతికి మహాభ్యుదయము! (మరల బుష్పవర్షము)

వజ్ర:—లోకానందకరములైన నీవాక్యములకు భగవంతుఁడు ప్రియమందెననుటకు సూచనగా వాయువుసుఖముగా వీచుచున్నది. కోయిల యెలుఁగెత్తి పాడుచున్నది. గగనము నిర్మలమై నాతితీవ్రమగు ప్రభాకర తేజముచే వెలుఁగుచున్నది.

ఆప:—ఇంద్రునకు వరుణునివలె నీకర్జున దేవుడు తోడై సర్వకార్యములు నిర్వహింప గలఁడు. పార్థునకు వృకోదరుని సాహాయ్యమువలె నీకు వజ్రధరుని బాసటయు శ్లాఘ్యమైనది. ఇఁక గార్యము సిద్ధింపక యేమగును? వీరిని జూడుము! ఈయాశ్రమవాసులలో జాలమంది యాఱితేఱిన రాజపుత్రులున్నారు. (కాలకేతువును జూపి) ఈతఁడు కాళేశ్వరమునకుఁ బ్రభువు. ఈతనికడ నసారమైన సైన్యమున్నది. నిశుంభుఁ డీతని తనయు నపహరించెను. పాపము! ఈతని

రాణి బెంగచేఁ బరమపదించెను. దేశమున నా క్రూర రాక్షసుని దుష్కృత్యములవలనఁ గష్టములకుఁ బాలై యిల్లిందఱు దురపిల్లుచున్నారో? ఇప్పుడు వీరందఱు నీయాశ్రయమును గోరుచుఁ గష్టములు పాపికొనఁ జూచుచున్నారు. వీరికి నీవభయము మీయవలసి యున్నది అని చెప్పెను.

కాలకేతువు వినమ్రుఁడై కంటనీరు పెట్టుకొనుచుఁ జెంత నిలువఁబడెను. దయార్ద్రహృదయుఁడై "రాజా! దుఃఖింపకుము! సర్వేశ్వరుఁడు నిన్ననుగ్రహించి కష్టములనుండి యుద్ధరింపఁ గలఁడు." అని విష్ణుదేవుఁడతని నోదార్చెను. కాలకేతువుఁ "మాపాలిటికి మీరేసర్వేశ్వరులు, గురుదేవుని పాదసాక్షిగా దేశపీడఁదొలఁగించుటకుఁ బ్రాణములను దృణప్రాయముగా నెంచి కదనతీర్థమున మునుఁగ సంసిద్ధుఁడనై యున్నాఁడను. నావలనఁబనిగొనుఁడని పలికెను." "సమయమువచ్చినప్పుడు యథాశక్తిగా నందఱము వీరవిహారము చేయుదముగాక! అంతవఱకు గురూపదేశముల నందుచుఁజిత్తశుద్ధిని సంపాదించు కొనుచుండుఁడు. చిత్తశుద్ధితోఁజేసిన స్వల్పకార్యమును బహుఫలప్రదమగునని విష్ణుదేవుఁడాతనితో నుడివెను. ఆపస్తంబుఁడు తనకు మాధ్యాహ్నిక కృత్యములు దీర్ప వేళయైనందున నందఱికి సెలవొసంగి వజ్రధర విష్ణుదేవులు విశ్రమించుటకుఁ దగు నేర్పాటులు గావింపఁ గాలకేతువును నియోగించెను. గురువర్యు నానతిని వారు ప్రశాంత పావనమగు రమణీయ ప్రదేశమున విశ్రమించిరి. కాలకేతువువారికి సపర్యలొనర్చుచు సమయము చూచుకొని మధ్యమధ్య తన వృత్తాంతమును జెప్పుచు నామూలాగ్రము వారికి వినిపించెను.

# నాల్గవ ప్రకరణము.

మాధ్యాహ్నిక కృత్యములు ముగిసిన పిదప నాపస్తంబుఁడు వజ్రధర విష్ణుదేవుల కతిథి సత్కారము గావించెను. భోజనము లైనపిమ్మట నాశ్రమవాసులందఱు మరలఁ జతుశ్శాలకే చనుదెంచిరి. విష్ణుదేవుని యనుభావము వారి నాశ్చర్యనిమగ్నులఁ గావించెను. లోకోద్ధరణమునకై యవతరించిన శ్రీమహావిష్ణువే యాతఁడని వారెల్లరు నమ్మి యుండిరి. మహర్షి సభామందిరము నలంకరించుట తడవుగా వజ్రధరుఁడు విష్ణుదేవునితో నచటికేతెంచెను. అందఱు నుచితాసనములఁ గూరుచుండిరి. ఆపస్తంబుఁడు తాటియాకుల పుస్తకముల నొక్కొకటిగా శిష్యులందింపఁ జేతఁబుచ్చుకొని ముందుగా బ్రాహ్మణధర్మములను వచించి విపులముగా క్షత్రియ ధర్మముల నుపన్యసించెను. దైవము పౌరుషమునను వాని బలాబలములను వ్యక్తపఱిచెను.

పూర్వసంప్రదాయములను గాలోచితముగా నందు దానొనర్చిన సంస్కరణములను దెలియఁ జెప్పెను. విష్ణుదేవు డాతని సర్వజ్ఞత్వమునకు విస్మితుఁడై "తపశ్శాలులకు సాధ్యము కానిదేముండును? దైవమే వారికి విధేయమగుచున్న" దను కొనెను. అప్పటికి బ్రొద్దువాలఁబడినందున వజ్రధరుఁడు లేచి దోసిలియొగ్గి "సద్గోష్ఠికి భంగముగలిగించి పాపముగట్టుకొను చున్నాఁడను. ఇంకను దారిలోఁ జక్కఁబెట్టుకొనఁదగిన కార్యము లెన్నియో కలవు. ఆశీర్వదించి సెలవొసంగుటకుఁ బ్రార్థించుచున్నా" ననెను. మునీంద్రుఁడు ప్రసంగమును ముగించి

వజ్రధరునివంక జూచుచు 'నేఁడీయాశ్రమమున మాతోఁ గడపి రేపుఁ బ్రయాణముచేయుటకు వీలుపడునేమోయని భావించుచున్నాను' అనెను. గురుసత్తముల యానతియైనచో నెప్పుడు కావలసిన నప్పుడే వచ్చెదము. నేఁటికి సెలవొసంగుదురుగాక! యని వజ్రధరుడు బదులుచెప్పెను. ఆపస్తంబుడట్లైనచోఁ 'కర్తవ్యశేషమును ముగించెదను' అని లోనికేఁబోయి యంత లోనే మరలివచ్చి 'మహాత్ము లగు నతిథులు లభించినపుడు శక్తికొలఁదిఁ బూజింపకుండుట యపచారమగును. పార్థివుఁడు రత్నహారియని పెద్దలందురు. కావున నీరత్నము నీతఁడు పరిగ్రహించుగాక!' యని తనయొద్దనున్న రత్నమును గొన్ని పరిమళించుచున్న పుష్పములతోఁ జేర్చి విష్ణుదేవుని చేత నుంచెను. ప్రీతివిస్ఫారితములైన నేత్రములతో నమ్మణి నవలోకించుచు విష్ణుదేవుఁ 'డార్యా! దీని సోయగము ముదావహమై యున్నది. మహర్షుల యాశ్రమభూమి నిట్టి రత్నములభించుట యనిర్వాచ్యమగు శుభము సూచించుచున్నది. దీనిపూర్వ చరిత్రము వినుటకు కుతూహల ముదయించుచున్నది. వినఁదగునేని సెలవిండని కోరుచున్నా'ననెను. ఆ మాటలువిని మహర్షి "పూర్వ వృత్తాంత మంతఁగాఁ జెప్పవలసినది లేదు. కొందఱు దోపిడిగాండ్రు దారిగొట్టి తెచ్చిన వస్తువులు పంచుకొనుచు నాశ్రమవాసుల కంటఁబడిరి. వారు వారిని జెదరఁగొట్టి దీనిని గ్రహించిరి. ఇది నాయొద్దకువచ్చి స్వల్పకాలమే యైనది. ఉన్నంతకాలము నన్ను గలవరపెట్టుచునేయున్నది. దీనిని నీకుఁ జేర్చుటతో గొప్పబరువు దించికొన్నట్లైనది" అని నుడివెను. వజ్రధరుఁడు కూడ దానిని సావధానముగాఁ బరిశీలించెను. ఏమి యుజ్జ్వలత? యని యాతఁడు నివ్వెఱపడఁజొచ్చెను.

విష్ణు:— మహాత్మా! దీనిని స్వాధీనము చేసికొన్న తస్కరు లే ప్రాంతమున నాశ్రమవాసులకుఁ గానిపించిరో?

ఆప:—గోదావరి పాయలనడుమ సారవంతములైన భూము లుండుటచే ననేకులు జనులు తృణకాష్ఠజలసమృద్ధి చూచి కొని యందందు నివసించుచున్నారు. వారి కైకమత్యము గలిగించి దేశద్రోహుల నెదిరింపఁ బ్రోత్సహించుట కాశ్రమ వాసులు తఱచుగా నాయాగ్రామములకుఁ బోవుచుందురు. ఒకనాఁడట్లు పోయి వచ్చుచుండఁగాఁ గొందఱు సార్థవా హులు పరుగెత్తుచు గుంపుగుంపని యఱచిరఁట. ఆశ్రమ వాసులు వారికి ధైర్యముచెప్పి యా ప్రాంతమువారిని గూడఁగట్టుకొని యా నరకులు చూపిన దారిని బోయి యొకకొండలోయలో వస్తువులఁ బంచికొనుచున్న దొంగ లను జూచిరట.

వజ్ర:—అమ్మకమునకుఁ గొనిపోవుచున్న బేహారులనుండి ఈరత్నము దస్యులచే నపహరింపఁబడి యుండవచ్చును.

విష్ణు:—ఈ రత్న మొక కన్యారత్నమునకు శిరోభూషణమై యుండుననినాయూహ. వినూత్నకాంతులను జిమ్ముచున్నను నాభరణమునందు నవ్యత గోచరింపకున్నది. ఇందలి చిత్ర ములరూపులు కన్యాజనము ధరింపఁదగియుండుటను వ్యక్తీ కరించుచున్నవి. రత్నమే ఫణిఫణాగ్రమునుండియో గ్రహింపఁబడినదిగాని సాధారణముకాదు. ఏ రాజ కుటుంబమో దస్యులపీడ ననుభవించినదనుట నిశ్చయము.

ఈ మాటలను నప్పటికిఁ గాలకేతువు ప్రక్కనుండి సాకాంక్షముగా రత్నమును విలోకించుచుండెను. ఆతని

నేత్రము లశ్రుపూరితములయ్యెను. ఆపస్తంబుఁడు 'కాలకేతూ! ఏల గుడ్డ నీరుగుక్కుకొనుచున్నా'వని యడిగెను. 'ఒకసారి నేనా యాభరణమును జూడఁ గోరుచున్నా' నని యాతఁడు దీనముగా నడిగెను. విష్ణుదేవుఁ డాతనిచేతి కమ్మణిభూషణము నిచ్చెను. కాలకేతువు కనులు దుడుచుకొని రత్నాభరణ మును బరిశీలించి కెవ్వుననఱచి మూర్ఛితుఁడయ్యెను. మహర్షి 'యేమది?' యని తగు నుపచారములు చేయించెను. అందఱు నాశ్చర్యముతోఁ జూచుచుండిరి. చాలసేపటికి మూర్ఛ తెలిసి కాలకేతువు 'ఇంకను సందేహమేమి? ఇదితప్పక నాకుమారిత శిరోరత్నమే' యని మరల మూర్ఛిల్లెను. ఆపస్తంబుఁడు మరల నుపచారములు చేయించుచు, 'మానవహృదయము లెంత దుర్బలములు. ఎంత దోహదము చేసినను నైజప్రకృతిని విడువఁ జాలవుగదా!' యనెను. ఎట్టకేలకుఁ గాలకేతువు తేఱు కొనెను. అతనిని నెమ్మదిగాఁ గూరుచుండఁ బెట్టి ఋషులు ధైర్యము చెప్పుచుండిరి. అతఁడు వజ్రధర విష్ణుదేవులవంకను నాపస్తంబునివంకను వెఱ్ఱిచూపులు చూడసాగెను.

విష్ణు:—మిత్రమా! నీదుఃఖమునకుఁ గారణము విస్పష్టముగా వినఁగోరెదను.

ఆప:— మానవులకు దుఃఖము జన్మముతోఁ బుట్టినది. దానిని నిగ్రహింపక యెవ్వఁడును సుఖపడఁ జాలఁడు. కాలకేతూ! ఇది నీతనయ శిరోరత్నమని యెట్లు నిర్ధారణ చేయగలవు? అయినమాత్ర మిప్పుడేమి పుట్టిమునిఁగిన దని యట్లు వాపోయెదవు? ధైర్యమువహించి నీకుఁదోఁచిన విషయములను గూడ వినిపింపుము.

కాల:—గురువర్యా ! నా యజ్ఞానమును సహింపుము. దుఃఖావేశము నా ధైర్యసారము నగల్చినది. ప్రకృతి దుస్స్వజమగుటచే నేనిట్టి దురవస్థకుఁ బాలైతిని.

వజ్ర:—కానిమ్ము ! ధైర్య మవలంబించి దీనిని గుఱించి నీయాశయమును దెలుపుము.

కాల:—ఆర్యులారా ! ఏమి మనవిచేయుదును ? నేనొకనాఁడు మత్స్యరప్రాంత కాంతారమున మృగయావినోదినై విహరించి యొకచో విశ్రమించితిని. అత్తఱి నొకయోగిపుంగవుఁ డనుగ్రహించుటకో యనునట్లు నాయెదుట ప్రత్యక్షమయ్యెను. విధేయుఁడనై నమస్కరించు నన్నుఁ జూచి 'హో నృపోత్తమా ! నీయెడ నాకు దయ కలిగినది. ఈ యమూల్య రత్నమును గైకొనుము. దీనిని ధరించు కన్యామణి చక్రవర్తిని జెట్ట పట్టఁగలదు. నీకుఁ గూఁతు రున్నది కాదా ?' యనుచు దీనిని నాకొసంగెను. చిత్తమని గ్రహించితిని. ఆ యోగి మఱియు నిట్లెఱింగించెను. 'రాజా! నిన్న స్వప్నములో నాగేంద్రుఁడు ప్రత్యక్షమై దీనిని నాకొసంగెను' అని యింకను నేమో చెప్పఁదలఁచియుఁ జెప్పక తటాలున వెడలిపోయెను. అష్టదళపద్మము లిం దెనిమిది చెక్కఁబడి యున్నవి. సూక్ష్మముగాఁ బరికించిన నాగేంద్రుని వేయి పడగలు నా పద్మముల కాశ్రయములై యుండుట గననగును. దానిని సువర్ణముతోఁ గట్టించినది నేను. నాభార్య ప్రోత్సహింపఁగా మా కులాచారము ననుసరించి యా రూపులుగూడ నేనే చెక్కించితిని. రత్నము దోపిడిగాండ్ర వశమైన దనుటచే నా తనూజ యేస్థితికిఁ

బాలై యెక్కడ నెంతగా వగచుచున్నదో యని హృదయము తఱుగుకొని పోవుటచే నట్లు ధైర్యము విడనాడితిని.

ఆప:—అధైర్యపడి మన మేకార్యము జేయఁగలము? ధృతిసంపన్నులు కష్టముల నెదిరింతురు. వారికష్టములు కొండలవంటివైనను మంచువలె విరిసిపోఁగలవు. నిశుంభుని యింటనుండుట కిష్టములేక నీకూతురు తప్పించుకొని పోవుచు దొంగలచేతఁ జిక్కలేదుకదా?

వజ్ర:—ఒకవేళ నిశుంభునింటనే దొంగతనము జరిగినదేమో?

విష్ణు:—గూఢచారులను బంపి యథార్థము తెలిసికొననదేదియు నిశ్చయింపఁ గూడదు. (సదయముగాఁ జూచుచు) కాలకేతూ! నీకుమారిత జాడలు తీసి యామె యెచ్చటనున్నను రక్షించెదను. విచారము నొందక మహర్షి యుపదేశ ప్రకారము మీరుగూడ నరయుచుండుడు. ఆపస్తంబునితో-మునీంద్రా! మాకు సెలవొసంగుఁడు. అచిరకాలముననే మీరల సందర్శనభాగ్య మబ్బుఁగాక!

ఆపస్తంబుఁడు 'సర్వము శుభపరిణామి యగుఁగాక!' యని వారికి సెలవొసంగెను. వజ్రధర విష్ణుదేవులు ఋషికుమారులచే రక్షింపఁ బడుచుండిన తమ వాహనములను సమీపించిరి. మునిసత్తముని యాజ్ఞగొని కాలకేతువు కొంతదూరము వారిని సాగనంపి వచ్చుటకు బయలుదేఱెను. ముగ్గురును గుఱ్ఱములెక్కి పశ్చిమాభిముఖులై వెడలిరి.

---

# ఐదవ ప్రకరణము

వజ్రధర విష్ణుదేవులు కొంతదూరము పోయినపిమ్మట కాలకేతువునకు సెలవొసంగిరి. ఆతఁడు నమస్కరించి పోబోవు చుండఁగా విష్ణుదేవుఁడు పినతండ్రితో నీతఁడు 'తనకుమారి నామమును జెప్పియుండెనా ?' యనెను. వజ్రధరుఁడు కాలకేతువును 'నీపుత్రిక పేరే'మని యడిగెను. 'వసుంధరాదేవి' యని యాతఁడు బదులు చెప్పెను. 'సరే! ఇక నీవు వెళ్ళవచ్చు'నని వానిని బంపివేసి వజ్రధర విష్ణుదేవులు గుఱ్ఱములను వదలిరి. ఆజవనాశ్వములుగండ్లుదాటుచుఁ గొండలెక్కుచు మార్గమును గబళించునట్లు బరువెత్తసాగెను. కొంతదూరము పోయినపిమ్మట వజ్రధరుఁడు 'వత్సా! యీప్రాంతమున నెల్లిపాలెమను గ్రామమున్నది. అందు గురునాథుఁడను భూస్వామి కలఁడు. కులమునకు శూద్రుఁడైనను గుణముల నగ్రవర్ణములవారికిఁ దీసిపోఁడు. మీతండ్రికి నచ్చినబంటు. మనమాతని గలిసికొని మఱి పోవలయును. తిరుగుదలలో వచ్చెదమని యింతకుముందే వర్తమానమంపినందున మనరాక కాతఁ డెదురుచూచుచుండును. నీ యభిప్రాయమే' మనెను. విష్ణుదేవుఁడు 'తప్పక యట్లు చేయుద' మనఁగా వజ్రధరుఁ డా గ్రామమునకు దారితీసెను. ఊరి పొలిమేర చేరునప్పటికిఁ గొందఱాశ్వికు లెదురువచ్చి వారి ననామయ మడిగి తాము గురునాథుననుచరులైనట్లు విన్నవించిరి. వారితో నుచిత సంభాషణము గావించుచు నా రాజన్యులెల్లిపాలెము చేరిరి. గురునాథుఁ డెదురువచ్చి వారిని సగౌరవముగాఁ దన గృహమునకుఁ దోడ్కొని పోయెను. అనంతర

ముచిత సత్కారములు చేసి యాస్థానమండపమున నాసీనుల గావించి వినయసంపదయతిశయిల్ల గురునాథుడు ప్రక్కనిలు చుండి యిట్లు వాక్రుచ్చెను. "మీరాకచే మా యిల్లు పావన మైనది. ఇల్లేకాదు - ఊరంతయుఁ బునీతమైనది. మిమ్ముఁ జూడఁ గానే సుచంద్రమహారాజును జూచినట్లు మహానందమబ్బినది."

వజ్రి:—గురునాథా! మీపాలెములలోని ప్రజలు సుఖ జీవ నము చేయుచున్నారా? ఆటవికులవలన మీకేమియు బాధలు కలుగుటలేదు కదా?

గురు:—సుఖముగానే బ్రదుకుచున్నారు. దొరగారిపేరు చెప్పు కొన్నప్పటినుండి యడవిమూఁకలు మాజోలికి వచ్చుట మానివేసిరి కాని—

విష్ణు:—కాని యనుచున్నావేమి? ఎచ్చటనైనఁ బ్రజాపీడ సంభవించినదా?

గురు:—మనవారి కెట్టి బాధయుఁ గలుగలేదు. ఈ మధ్య నెవ్వరో బాటసారు లీప్రాంతమునుండి పోవుచు దొంగలచే నడ్డగింపఁబడిరి.

వజ్రి:—వారికేదైన నపాయము సంభవించెనా?

గురు:—అంతగా లేదనవచ్చును. మాకావిషయము తెలియ రాఁగానే కొందఱను గుఱ్ఱములమీఁదఁ బంపితిమి. వారు పోవునప్పటికి దొంగలు పాఱిపోయిరి. దొంగలు బాట సారులను జెదరఁగొట్టి దోచుకొనిరఁట! పాపము వారితోఁ గొందఱు స్త్రీలున్నారు. పురుషులు ప్రాణముల కాసించి పాఱిపోవుటచే దిక్కులేక యడలుచున్న యాఁడువారి

నిచ్చటకుఁ దీసికొనివచ్చిరి. వారికిఁ గావలసిన సదుపాయములు సమకూర్చి దేవరదాసుఁడు సురక్షితముగా నుంచి నాఁడు.

విష్ణు:—ఎంతపనిజరిగినది ? స్త్రీలను విడనాడి పాఱిపోయిన యీపురుషాధములెంతటి పాపాత్ములు. పాఱిపోయి మృత్యువును దప్పించుకొనఁగలరా! అట్టి యపయశస్సుకంటె మృత్యువు భయంకరమైనదా! పాపమా స్త్రీలిపుడెందున్నవారు! వారి దేదేశము! ఎచ్చటికిఁ బోవుచు నీయాపదకు లోనైరో!

గురు:—భయభ్రాంతలై వారేమియుఁ జెప్పకున్నారు. పురుషులెవరైన వెదకుచు వత్తురేమో యని వారిని మాయింటనే యుంచి కాపాడుచున్నాఁడను.

విష్ణు:— మంచిపని చేసితివి. సుచంద్రమహారాజునకుఁ దగిన మిత్రుఁడవు.

గురు:—సురక్షితముగా వారినిండ్లకుఁ బంపికదా యూమాట యనుకొనవలయును.

వజ్ర:—అదటు తగ్గిన పిమ్మట నడిగి యెచ్చటికిబోవ నెంచిన నచ్చటికే పంపవచ్చును. వెంటనే ప్రయాణముచేయుటకు జంకుదురు. ఇంతలో వారిబందుగులును జాడలు తీయుచు రావచ్చును.

గురు:—తమరాకచే వారివిషయమున నాభారము తగ్గినది. మీ రెట్లు నిర్ణయించిన నట్లు చేయఁగలవాఁడను. మఱియొక మనవి.

వజ్ర:—నిస్సంశయముగాఁ జెప్పుము.

గురు:—మీదర్శనము చేసి కృతార్థులు కావలయునని మా పల్లెలవారు మిగులఁ గుతూహల పడుచున్నారు. సెల వెనచో వారిని రావించెదను.

విష్ణు:—అభ్యంతరమేమి? మిత్రుల నందఱి నొకసారి చూచి యానందింప నాహృదయమును గుతూహల పడుచున్నది. ఇప్పుడే యాపని కావింతము.

గురు:—నేఁడు పల్లెవారందఱు గూడుట సాగదు. ఈసాయం కాలమునకు వారందఱకు వార్తనంపెదను. రేపు జాముప్రొద్దెక్కు లోపుగాఁ జేరుకొనఁగలరు.

వజ్ర:—అంతవఱకు మేమిచట వ్యర్థముగా నుండవలయును.

గురు:—వ్యర్థమని మీరు తలంపఁగూడదు. పాలెములో మీ యశము వ్యాపించి యెంతపనియైనఁ జేయఁగలదు. ఏమైనను నామనోరథము నెఱవేర్ప వలయునని వేఁడుచున్నాను.

వజ్ర:—అట్లే కానిమ్ము! రేపైనను సత్వరముగా మమ్ము విడువ వలయును. గురునాథుఁడు వెంటనే తగువారిని బిలిపించి యొక్కొక్కని నొక్కొక్క గ్రామమునకు బంపెను. వారికిఁ జెప్పవలసిన వన్నియుఁ జెప్పెను. వజ్రధర విష్ణు దేవులు విశ్రమించుటకు దగు నేర్పాటులు గావించెను.

గురునాథుఁడు పనిమీఁద వెళ్లిన పిదప వజ్రధరుఁడు "కుమారా! మన పక్షమును వహించియున్న గ్రామాధిపతులు నీదర్శనముచే నూతనోత్సాహభరితులు కాఁగలరు. వారినిబట్టి మఱికొందఱు పాళెగాండ్రుకూడ మనయెడ ననురాగము కల వారు కావచ్చును. ఎప్పుడైన మన మీపని చేయవలసిన దే.'

విష్ణు:—ఔను! వారినందఱిని ప్రత్యేకముగాఁ గలిసికొన నక్కఱలేకుండ గురునాథుఁడు మంచి యేర్పాటుచేసి యున్నాఁడు.

ఇట్లు మాటలాడుకొనుచు వారా గృహమునంటియున్న యుపవనమునఁ బ్రవేశించిరి. అందుఁ గొన్ని ఫలవృక్షములు వరుసగాఁ బెరిఁగియుండెను. మధ్యమధ్య పూవులమొక్కలు పెంచబడుచుండెను. గృహస్థులకునిత్యకృత్యములకుపయోగించు లతావృతములే యందు వారికెక్కువగఁ గానవచ్చెను. నగర వాసులకంటెగ్రామవాసులు సాధువులు, నమాయకులునయినట్లె రాజోపవనవృక్షములకంటె నందలివృక్షము లకృత్రిమశోభతో విరాజిల్లుచుండుట వారుగుర్తించిరి. దోహదము నక్కరలేకయే పుష్పఫల సమృద్ధితోనొప్పుచున్న యా భూరుహములనుజూచు నప్పటికి విష్ణుదేవునిహృదయ మించుక సంచలిత మయ్యెను. ఆపస్తంబుఁ డిచ్చిన రత్నభూషణము నొక్కసారి పైకిఁదీసి సవిమర్శముగా విలోకించెను. దీనినిధరించు కన్యామణి కాల కేతుని తనూజయేయగునా? ఆమెయంతటి యనన్యసామాన్య లావణ్య విలసితయైయుండునా? ఇదితాను జేయించిన భూషణమే యని యా రాజన్యుఁడు నిశ్చయించుచున్నాఁడు. అతఁడు చెప్పినచందముగా నందలి పద్మములయడుగున సహస్రఫణా మండలము గానవచ్చుచున్నది. ఆహా! ఏమివైచిత్ర్యము. దీనిని జూచినప్పటినుండియు నాహృదయము స్నిగ్ధమగుచున్నది అనుకొనెను. వజ్రధరుఁ "డేమి? రత్నభూషణమును జూచు చుంటివి?" అనెను.

విష్ణు:—దీనిసోయగమే నామనస్సును వికలపఱచుచున్నది.

వజ్ర:—వైకల్యమున కవకాశమేమున్నది ?

విష్ణు:—అనర్ఘమైన మణికదా! కోలుపోయినవా రెంతవిచారించుచుందురో ?

వజ్ర:—యథార్థమే. గుడ్డిలో మెల్ల. అది మనచేతఁబడినది.

విష్ణు:—అయిననేమి ?

వజ్ర:—ఏమాత్రమైన జాడ తెలియవచ్చిన నీవు వారికి దీని నందఁజేయవచ్చును.

ఇట్లనుకొనుచుండ వారి కొక కలధ్వని వినవచ్చెను. విష్ణుదేవుఁ డార్యా! కోకిల కూజితమా! యనెను. వజ్రధరుఁడు కాదు. అబలాజన సల్లాపమువలె నున్నదని చెప్పెను. విష్ణుదేవుఁ డైనచో మన మీప్రక్కకుఁ బోవుదమని యట్లుచేయఁ బోగా నీక్రింది సంభాషణ స్పష్టముగా వినవచ్చెను.

"మల్లికా! బావ వచ్చినట్లున్నాఁడు ?"

"చెలీ! అమృతమువంటి మాట చెప్పితివి. ఎక్కడ ?"

"చూడవమ్మా ? అల్లదే పొన్నచెట్టు వంక."

"పద ! పోయి కలిసికొందము"

బిలబిల లాడుచు నలుగు రైదుగురు వనితామణులు వారున్నవంకకు వేగముగా వచ్చిరి. దాపునకువచ్చి యందఱు నిర్ఘాంతపడి వెనుకకుఁ బోవుటకుఁ బ్రయత్నించుచుండఁగా వజ్రధరుఁడు "భయములేదు. మేము పరాయులము కాము. గురునాథుని యాప్తవర్గములోనివారము. మావలన మీకే మైనఁ గావలసినచోఁ జెప్పవచ్చు"ననెను. వారేమి చేయుటకుఁ దోఁపక నిలిచిపోయిరి. చిన్నవారు పెద్దవారి చాటున నొదిగిరి.

అందిరువురు కన్యకలు, ఇరువురు యువతులు, ఒకతె వయసు మరలిన మగువ. వారి నాగరికతను, వేషభాషలను బట్టి యందలి నలుగురు నేమహారాజకుటుంబమునకో చెందిన వారనియు అందఱికంటె బెద్దయై కాననగు స్త్రీ వారిదాసి యనియు సులభముగా గ్రహింపనై యుండెను. కన్యలిరువురు ముగ్ధాజన సాధారణమగు లజ్జకులోనై చెంతనున్న యువతుల నవలంబించి నిలిచిరి. అందొకతె తప్తకాంచన గాత్రి. రెండవది యిందు గౌరాంగి. ఒకతె పద్మపత్రాయతవిలోలవిలోచన. రెండవది స్ఫుటవికసిత నీలోత్పలాక్షి. ఒకతె బింబాధర. ఇంకొకతె పల్లవాధర. ఉదయద్యౌవన యొకతె. ఉదిత యౌవన యింకొకతె. ఇరువురి యపాంగములు తరుణుల చాటునుండి విష్ణుదేవునివైపు ప్రసరించు మనే యుండెను. కాని మొదటి ముద్దియ దృష్టియందు సౌందర్య పిపాసయు, రెండవలతకూన చూపులలో ననుభావగౌరవము వ్యక్తమగు చుండెను.

విష్ణుదేవుడును వారికొక్కసారి విలోకించెను. పరవనితల దిలకించుట సత్పురుష లక్షణముకాదని యతడు దృష్టిని మరల్చెను. దృష్టిని మనసనువర్తింపకుండుట కాతడాశ్చర్య పడెను. అందఱిలోను వయసున జిన్నదియగు బాలామణి సుకుమారరూప మాతని హృదయము నాకర్షించెను. ఇంతటి సౌందర్యము మానవజాతికి లభ్యమా? ఈమె దేవకన్యక కాదుగదా! దమయంతి చక్కదనమునకుమెచ్చి యింద్రాదులు రాయబార మంపుట విని పరిహసించితిని. ఇంద్రాదులకే కాదు- బ్రహ్మాదులకును గనువేదురు జనింపజేయు లావణ్యా తిశయము మానవ భామలకు గలుగవచ్చునను నమ్మక

మిప్పుడు నాకుగలుగుచున్నది. ఈమె వదనారవిందము నింకొక్క సారి తనివితీఱఁ జూచెద నని కోరుచుండియు ధైర్యముతో నేనట్లు చేయఁజాలకున్నాను అని తనలోఁదా ననుకొను చుండెను.

వజ్రధరుని మాటలకు వృద్ధవనిత యిట్లుబదులుచెప్పెను. అయ్యా! మీనాగరకవేషములనుజూచి మాపిల్లలు బందుగు లని భ్రమచెందిరి. క్షమింప వేడెదము.

వజ్ర:—క్షమించుట కేమున్నది. ఈవేళ భ్రమయైనది రేపు ప్రమ కాకూడదా? పశుపక్ష్యాదులే కూడి మనుచుండఁగా మానవు లట్లుచేయుట కాటంక మేముండును? మీరు గురునాథుని యా ప్రవర్గములోని వారేయగుదురా?

వృద్ధ:—మీసౌజన్యము మాకుఁ జనవిచ్చుచున్నది. అయ్యా! మాసమాచార మెఱిగించుటకు, మానుటకు మనసొప్పు కున్నది.

వజ్ర:—కొంతవఱకు బోధపడినది. దారిఁబోవుచు దొంగలచే నడగింపఁబడి భయపడిన కొందఱను గురునాథుఁడు రక్షించినట్లు చెప్పియున్నాఁడు. మీరు వారిలో గొందఱై యుందురు.

వృద్ధ:—ఆర్యా! మీతలంపు సత్యమైనదే.

వజ్ర:—మీరెక్కడికిఁ బోవవలయునో చెప్పినచో దప్పక మిమ్మక్కండ్లకు జేర్చు యత్నము కావించెదము.

వృద్ధవనిత తరుణులవంకఁ జూచెను. వారేమియు మాటాడలేదు. వారి ముఖములు ప్రసన్నములై హృదయ సముచ్ఛ్వాసమును సూచించుచుండెను. ఆమెకును తమ

వృత్తాంతమెఱింగించి వారి సాయమున నూరు చేరుటకుఁ దోడ్పాటు కోరవలెనను నాస జనించెను.

వజ్రి:—ఏమట్లు మొగమొగములు చూచుకొను చున్నారు. ఈతఁడు కాకులేశ్వరుఁడగు విష్ణుదేవుఁడు. ఈతని రక్షణ మున నుండఁగా మీ మీఁద నీఁగయువాలదు. అభ్యంత రము లేనిచో మీవృత్తాంతము సవిస్తరముగాఁ జెప్ప వలయునని యడుగుచున్నాను.

విష్ణుదేవుఁడు వజ్రధరునిప్రసంగమును లోనమెచ్చుకొని 'ఆర్యా! పాప మీయబలల నెంతసేపు నిలువఁబెట్టెదవు. ఈ రమ ణీయప్రదేశమునఁ గూరుచుండి మాటలాడుకొనవచ్చునుగదా!' యనెను. "చెప్పఁదొడఁగినచో మాకథ భారతమగును. ఆల కింపఁ గుతూహల మున్నచోఁ గూరుచుండుటే మంచిది" అందఱు ననుకూల ప్రదేశమును జూచుకొని కూర్చుండిరి. వృద్ధస్త్రీ యిట్లు విన్నవించెను. మహనీయులారా! మీ యను భావము మా మానసముల విశ్వాసమును జనింపఁ జేయుటచేఁ బ్రమాదకరమైననిస్సహాయస్థితిలోనుండి బయటఁబడఁగలుగుదు మను నాస యుదయింప మా నిజస్థితిని మీకు విన్నవించు చున్నదానను. దయదలఁచి మే మిల్లు చేరున ట్లనుగ్రహింపుఁడు. శ్రీశైలము దాపున రత్నసానువను దుర్గము కలదు. దానిని నిశుంభుఁడను రాజేంద్రుఁడు పాలించుచున్నవాఁడు. వీరా మహారాజు బంధువులు.

వజ్రి:—నిశుంభుఁడు మహాశూరుఁడు. మేమాతనిని గుఱించి యింతకుముందు వినియున్నారము. అంతటివాని బంధువు లయ్యు నాటవికుల కేలచిక్కితిరి? ఆ రాజన్యుని పేరు చెప్పినఁ బులులు నీళ్ళు త్రాగవు.

వృద్ధ:—నిక్కమే. మాదురదృష్టమట్లున్నది. కొలఁది కాలము క్రిందట మేము సింహళద్వీపమును జూడఁబోయితిమి. ఈ తరుణి నిశుంభుని తోఁబుట్టువు ఆ దీవినేలు చూలోదరుఁడీమెభర్త. ఈమె కోరికపై మామహారాజు తన తనయామణి నామెను జూడఁబంపెను. వీరు మా నరేంద్రునిసోదరుని భార్యా పుత్రికలు.

వజ్రి:—నిశుంభునకు సోదరుఁడున్నట్టు లిదివఱకు వినియుండ లేదు.

వృద్ధ:—సాక్షాత్తుగా సోదరుఁడు కాకపోయిన వారియిరువురకు నట్టిభావము నిరూఢమైయున్నది. కావుననే మహారాజా శూరుని సర్వసేనాధిపత్యమిచ్చి గౌరవించెను.

వజ్రి:—ఆతని పేరు ?

వృద్ధ:—మహీధరుఁడు. ఈమె యాశూరాగ్రేసరుని తనయ మల్లిక. ఈమె యాతఁరాణీ యశోదాదేవి. సింహళ ద్వీపాధిరాజ్ఞియైన యీామెను యశోధర యందురు. ఈమె తనయన్నగారిని జూచిపోవలయునని స్వదేశమునకు వచ్చుచున్న మాతో నోడనెక్కినది.

వజ్ర:—సరే! ఈ ముగుద నిశుంభతనయ యని తెలిసినది. సింహళమునుండి యింటికి బయలుదేరిపోవుచు నిక్కడ జిక్కుపడితిరన్నమాట.

విష్ణు:—ఆర్యా! నిశుంభుని కౌరససంతతి —

వృద్ధ:—మహాశయులారా! మా మహారాజున కౌరససంతతి లేదు. ఒకప్పుడు కాళేశ్వర ప్రభువుతో నాతనికిఁ గయ్యము కలిగెను. అప్పుడు బందీకృతుఁడైన శత్రువు తన

కుమారితను గానుకగానిచ్చి విముక్తి నొందెను. మా రాణి విశ్వంభరాదేవి గర్భవాసముకంటె నెక్కువగా నీ మెను బెంచెను. మా దురదృష్టముచే నామె కొలఁదికాలము క్రిందటనే దివ మలంకరించినది. కుమారితయం దెంత వాత్సల్యమో యామెకు— "నీబిడ్డ కేలోపము రానీయ" నని మహారాజు చేతిలోఁ జేయివేసిన కాని యామె ప్రాణములు పోలేదు.

ఈ మాటలు చెప్పుచుండఁగా నిశుంభతనయ గంటనీరు పెట్టుకొనఁదొడఁగెను. వృద్ధ స్త్రీ యదిచూచి 'బిడ్డా ! యిటురా ! తల్లీ !' యని దగ్గఱకుఁదీసికొని బుజ్జగించెను. అందఱు నామెను జూచి జాలిపడిరి.

వృద్ధ:— ఈ బిడ్డ నా మహారాజు కడఁ జేర్చునంతవఱకు మాప్రాణములు కుదుటపడవు. పరిపూర్ణానుగ్రహముతో మాకుఁదోడ్పాటు చేయఁ గోరెదము.

విష్ణు:— సింహళమునుండి మీ దేశమునకుఁబోవుట కింత చుట్టుతిరిగి యేల రావలసివచ్చెను ?

వృద్ధ:— బృందావనమున నోడ దిగవలయుననుకొంటిమి. ఆ రేవును బాగుచేయుచున్నందున నావికులు మమ్మింత ర్వేదిలో దింపిరి. అచటి యధికారి మమ్మెంతయో గౌరవించి వలయు సదుపాయములన్నియుఁ జేసెను. బండ్లు కుదుర్చుకొని బయలుదేఱితిమి. సముచితపరివారముతో చూలోదరుని పెద్దకుమారుఁడు మణినాగుఁడు బండ్లు కాపాడుచుండెను. తెల్లవాఱుజామున నిద్రావశులమై యున్నమమ్ము దొంగలడ్డగించిరి. ఆ గంద్రగోళములో నేమి

జరిగినదో తెలియదు. కొందఱు గుఱ్ఱపురౌతులు మమ్ముఁ
దీసికొనివచ్చి యీమందిరమున నుంచిరి. మాగుట్టుమట్టు
తెలిసికొనవలెనని వారెంతయో ప్రయత్నించిరి. ఏమికీడు
మూడునోయని యేమియుఁదెలుపమైతిమి. ఆ భయంకర
దృశ్యము తలంపునకు వచ్చి మా రాకుమారి గుండెలు
కొట్టుకొనుచున్నవి. అమ్మా! యింక భయము లేదు.
మనమింటికి జేరినట్లే!

విష్ణు:- ఇంచుకంతయు భయపడనక్కఱలేదని నిశ్చయముగాఁ
జెప్పుచున్నాను. మీరాజపుత్రికి ధైర్యము చెప్పవచ్చును.
మిమ్ముఁదెచ్చిన యీగ్రామాధికారి యుత్తముఁడు. మాకు
మిత్రుఁడు. రాజధానినుండి సాయుధసైనికుల రావించి
సాయమిచ్చి మిమ్మింటికిఁబంపుట కేర్పాటు చేయించెదను.
నిర్భయముగా నుండుఁడు. మీబంధువుల నందఱ
వెదకించి తేఁ బంచెదను. ఆర్యా! ఆపని యిప్పుడే చేయు
మని గురునాథునితోఁ జెప్పిరమ్మా!

వజ్రధరుఁడు గురునాథుని గలిసికొననేగెను. అచటివారి
హృదయములు వజ్రధరు ననుగమించినవి. ఏదైనఁజల్లని వర్త
మానము వినఁబడునేమోయని వారుతహతహ పడుచుండిరి.
విష్ణుదేవుఁడు రాజపుత్రికను సాభిలాషముగాఁ జూచెను.
ఆతని మాటలవలన జాతకుతూహలమైన రాకొమరియు నా
మారసుందరు నీక్షించెను. ఉభయులదృష్టులు మార్గమధ్యమున
మిళితములై తళుక్కున మెఱసెను. ఉభయుల గండములు
చెమర్చెను. ఈషన్నమ్రములైన స్మేరాననము లర్ధవికసిత
పుండరీకములవలె దర్శనీయములయ్యెను. నేత్రకోణముల లజ్జా

భరము చెక్కిళ్ల మీఁద యరుణరేఖలకు వన్నెగూర్చుచుండెను. అదనుగనిపెట్టి మలయానిలసహాయుఁడై రతీవల్లభుఁడు బాణపరంపరలు గుమ్మరించెనో యనునట్లు మందమారుత కంపితమైన చెంతనున్న బొగడచెట్టునుండి పువ్వులు జలజలరాలెను. అచ్చటివారెవ్వరు నీమనోభవవిలాసముల గుఱించి యానందించినట్లు తోఁచదు. ఒక్క మల్లిక మాత్రము తల్లిచాటునుండి తొంగిచూచుచు నించించుక గ్రహింప గలిగెను. విష్ణుదేవుని హస్త మప్రయత్నముగా మణిభూషణమువంకఁ బ్రసరించెను. దానిని బైకిదీయుచుఁ 'గొందఱు దొంగలు సొమ్ము పంచుకొనుచుండ మాయాప్తులు వారిని బెదరఁగొట్టి కొన్ని వస్తువులు దెచ్చిరట! అందొకటి నాకడకు వచ్చినది. ఇది యీ రాజపుత్రికదై యుండవచ్చు' ననెను. అందఱు దాని నీక్షించి యాశ్చర్య హర్షము లభినయించిరి. వృద్ధవనిత 'దీని కొఱకు బిడ్డ బెంగపెట్టుకొన్న' దనెను. 'మణినిగోలుపోయిన నాగాంగనవలె నీమె యిది లేకచిన్నవోయిన' దని యశోధర పలికెను. 'నిర్భయముగా బావగారి మొగము చూడగలము. త్రిలోకదుర్లభమైన రత్నము కుమారితకు లేకపోయెనని యా రాజేంద్రుఁ డెంతదిగులుపడునోయని మనసారాటపడినది అది లేకుండ దైవము గ్రహించె' నని యశోద తనలో ననుకొనెను. మనవస్తువులన్నియు నొకయెత్తు, ఇదియొకటియు నొకయెత్తు అని మల్లిక తలంచెను. రాజపుత్రి దానిని సప్రత్యభిజ్ఞముగాఁ జూచి 'యిది నా శిరోమణియే! సందేహము లేదు. ఇట్లందుకొను' మని వృద్ధవనితవంకఁ జేయిచాపెను. నీదైన నీవే గ్రహింపుమని మల్లిక సాభిప్రాయముగా ననెను. సాత్వికోదయముచే స్విన్నమగు విష్ణుదేవుని చేతినుండిజాఱి యా రత్నాభరణము రాజపుత్రి చేతఁ

బడెను. 'ఎంతచనవిచ్చిన నట్లు గైకొనుట తగునా?' తల్లీ! యని వృద్ధవనిత యారత్నము నందుకొని పరిశీలించి మరల నామెకే యిచ్చెను. రాజపుత్రి యించుక తెల్లబోయి రత్నభూషణమును గనులకద్దుకొనుచు మల్లికవైపు జరిగెను. 'చెలీ! నాకిరీటము లభించినదని మల్లికతో ననెను. 'ఔను కిరీటము లభించినది. పట్టాభిషేకము తరువాయి' యని యామె జనాంతికముగా వాక్రుచ్చెను. రాజపుత్రి బొమలుచిట్లించి సఖీ! దీనిని సరిగాఁగూర్చవా? యనెను. మల్లిక యలంకరించి నాపనిపూర్తి యైనది. ఇఁక-రాజపుత్రి 'చెప్పఁబోయి యేలమానితి'వని యడిగెను. 'ఏమియు లేదు అలంకృతమైన నీ మొగము నాకేముద్దు వచ్చుచుండగా...'రాజపుత్రి లజ్జావివర్ణమైన ముఖమించుక వంచి 'చెలీ! నీమాటలు నాకర్థమగుట లేదు' అనెను.

ఇంతలో వజ్రధరుఁడు వచ్చి 'కుమారా! గురునాథుఁ డింతకుముందే యాప్రయత్న మొనర్చెనఁట. కాని యాపురుషుల జాడ యేమియుఁ దెలియ రాలేదఁట. రేపు నలువైపుల నుండి జనులు వత్తురు కావున నేమైన విశేషము తెలియఁగల దేమోయని యతఁ డాసించుచున్నాఁ' డని చెప్పెను. విష్ణుదేవుఁడు గురునాథుని యూహ సమంజసముగానే యున్నది. త్వరలోనే వార్త తెలియఁబడ వచ్చును అని పలికి వారితో 'మీరు నిర్విచారముగ నుండుఁడు. మిమ్మిల్లు చేర్చు భారము మాది' యనెను. వజ్రధరుఁడు రాజపుత్రికశిరోభూషణమును జూచి 'యీమణి యీమెదేనా? ఈ బాలామణి నామము వసుంధరాదేవి ఔనా?' ఆ యువిద లాశ్చర్యముతో నించుక యనుమానింపఁదొడఁగిరి. ఎట్లు గ్రహింపగలిగితి రని వృద్ధవనిత యడిగెను. "ఈమె జనకుఁడు కాలకేతువు మాకు

మిత్రుఁడు' అని వజ్రధరుఁడు వచించెను. ఆమాట లా యబలల చెవులకు ములుకులయ్యెను. ముల్లుపుచ్చి కొఱ్ఱుఁడఁచిన ట్లైనదే మన యవస్థ యని వారనుకొనిరి. తాము పూర్తిగా శత్రువుల చేతిలోఁ జిక్కినట్లూహించిరి. అయినను అనుభావ విశేషము, సంభాషణ మాధుర్యము, విశ్వాసమును బురికొల్పుచునే యుండెను. ఏమైన నిఁక వారక్కడ నుండ లేకపోయిరి. ఏమి చేసినను మీదే భారమని చెప్పుచు వృద్ధవనిత లేచెను. అయ్యో! మాకు సెలవొసంగుఁడని వారితో ననెను. వజ్రధరుఁడు మంచి దనెను. ఆస్త్రీలు మందిరాభ్యంతరమున కరిగిరి. పోవునపుడు వసుంధర యవకాశము కల్పించుకొని విష్ణుదేవునివంక సానురాగ నిరీక్షణములఁ బ్రసరింపఁజేసెను. సుచంద్ర కుమారుఁడును దన్మార్గానుగతమగుదృష్టిని బ్రయత్నముమీఁదఁగాని మరలింపఁ జాలకపోయెను. వారేగినపిమ్మట నారాజపుత్రుఁడు పినతండ్రితో 'నార్యా! నీ తుదివాక్యములు వారికి సంకోచ కారణములైన వనుకొందు' ననెను. వజ్రధరుఁడు "కావచ్చును. కాలకేతువు తమకు శత్రువని యెంచియుందురు. అంతమాత్రమున వారు భయపడవలసిన దేమున్నది? కాలకేతువు నెఱిఁగియున్నంత మాత్రమున మనము తమకు హానిచేయుదు మనుకొనుట న్యాయమా? ఒకవేళ స్త్రీస్వభావముచే నట్లు పొరపడినను బిమ్మట యథార్థమును గుర్తింపకపోరు. చేయదలచిన దెట్లును మనము చేయకమానము" అనిపలుకుచు దమకై యెవరో నిరీక్షించుచున్నట్లు గ్రహించి 'కుమారా! గురునాథు ననుచరులు మనకొఱ కెదురుచూచు చున్నట్లున్నారు' అనెను. ఇరువురు తమ విడిదిగదిలోఁ బ్రవేశించి వచ్చిన వారితో యథోచితముగా బ్రసంగింపఁ దొడఁగిరి.

# ఆఱవ ప్రకరణము

ఎఱ్ఱపాలెము చిన్న నలుచదరమైన గ్రామము. నాలు గైదువందలకంటె నెక్కువ యిండ్లుండవు. అవియైన నధికనాగరికతను సూచింపని సాధారణ శృంగారముతో నొప్పుచుండెను. ఊరిచుట్టు విరళములైన చెట్లతోఁగూడిన తోటలున్నవి. వానికవ్వల మెట్టపైరులుపండుపొలములు కనుచూపుమేరవ్యాపించి యుండెను. ఊరికి దాపుగా మంచినీటి చెఱువొకటి కలదు. అందలి నీరే గ్రామవాసులు స్నానపానాదుల కుపయోగింతురు. దానికిఁగొంచెము దవ్వుగా పశువుల యుపయోగార్థము మఱియొక తటాకము కలదు. ప్రతియింటికిముందు వెనుక విశాల ప్రదేశము విడువఁబడి యుండెను. గురునాథుఁడు పెత్తనము వహించినప్పటినుండి గ్రామవాసులకుఁ బాఁడి పంటల లోపము లేకుండెను. గ్రామవాసు లైకమత్యము గలిగి యంతకంటె నెక్కువ జనసంఖ్యగల గ్రామములను గూడఁ దాము చెప్పినట్లు నడచుకొనఁ జేయఁగలుగుచుండిరి. ఊరినడుమ విశాలమైన గ్రామకంఠముకలదు.అందు సుందరమైన యొకచావిడియుండెను. గ్రామస్థు లప్పుడప్పుడందుఁ జేరి గ్రామవిషయములను జర్చించుచుందురు.

నేఁడామందిరము జక్కఁగా నలంకృత మయ్యెను. చుట్టును గల ప్రదేశమున గ్రొత్తతాటియాకుల పందిరి వేయఁబడెను. మామిడిచిగుళ్ళతోఁ దోరణములు గట్టిరి. నేల చదనుచేసి కలయంపి చల్లిరి. మధ్యమధ్య గుత్తులతోడి పూలమాలికలు వ్రేలాడఁ గట్టిరి. ఆ భవనమందొకవైపున రెండున్నత పీఠ

ములు సిద్ధము చేయఁబడి యుండెను. పెద్ద పెద్ద తాటియాకుల చాఁపలు వానికెదుటఁబఱచి సభ్యులు కూర్చుండుట కేర్పాటు గావించిరి.

పీఠముల కిరుప్రక్కల మెత్తని బఱకములు పఱవఁబడి యుండెను. గురునాథుని సేవకు లచ్చటచ్చట నిలిచి వచ్చెడి వారిని యథార్హముగా లోనికిఁ బంపుచుండిరి.

జాముప్రొద్దెక్కినది. నగరముజనముచే క్రిక్కిరిసిపోయెను. ఊరిచుట్టు నున్న తోఁటలలో నశ్వహేషలు, వృషభరావములు సందడించెను. బండ్లచే మార్గము లిఱుకాటము లయ్యెను. పొరుగూళ్ళనుండి వచ్చినవారినందఱను జావడిలోఁ గూర్చుండ బెట్టి గ్రామస్థులు మర్యాద చూపుచుండిరి. అంతయుసిద్ధమైన పిమ్మట గురునాథుఁడు మఱికొందఱు గ్రామణులు ననుగమింప వజ్రధర విష్ణుదేవు లా ప్రదేశమునకు విచ్చేసిరి. ఆ రాజేంద్రుని రాకచే నాసభార్ణవ మొకింత వేలాతిక్రమణ మొనర్చెను. కాని యంతలో మర్యాదకు లోఁబడి నిశ్శబ్దముగ నుండెను. అందఱు విష్ణుదేవుని జూచి తగినతేఁడని సంతసించిరి. అయస్కాంతమువలె నా రాజపుత్రుని నిసర్గ మధుర గంభీరాకృతి ప్రజల చిత్తముల నాకర్షించెను. మహాసభకు నమస్కరించి యా పురుషసింహులు తమకై యేర్పఱుపఁబడిన యాసనము లలంకరించిరి.

మొదట వజ్రధరుఁడులేచి సుచంద్రుని సుగుణములను బ్రజలకెఱిఁగించి యాతఁడు దేశవాసులకుఁగావించిన సదుపాయములను బేర్కొనెను. పిమ్మటగురునాథుఁడు విష్ణుదేవుని బ్రజల కెఱుకపఱచి యాతని యుపదేశామృతమును జెవు

లారంగ్రోలి ధన్యులుకండని ప్రార్థించెను. అనంతరము విష్ణుదేవుఁడు మృదుమధుర భాషణముల సభ్యుల నిట్లుత్సాహపఱచెను.

"మీరందఱు నాయందవ్యాజప్రేమ కనఁబఱచుచు నిక్కడ చేరుటచే నాకత్యంత, సంతోషము కలిగినది. మీలో గొందఱిపరిచయమైన నాకింతకుముందు లేదు. ఒక్కమాటుగా నిందఱి పరిచయము సంపాదింపఁగలిగినందున నాజీవితములో నీదినము సుదినము. మీరందఱు నన్నెంతగాఁ బ్రేమించుచున్నారో అంతకు రెండింతలు స్నేహముతో మిమ్ము నా బ్రిజలుగా భావించుచున్నాఁడను.

ప్రస్తుతము దేశమేస్థితిలో నున్నదో మీకు విశేషించి చెప్పనక్కఱలేదు. ఆటవికులు మార్గస్థులకుఁ జేయుచున్న యిబ్బందులను గళ్ళారఁ జూచుచునేయున్నారు. మీరంద రైకమత్యముకలిగి సంఘీభావముతో మెలఁగుచున్న నాటవికులే కాదు—ప్రపంచమేకమైనను మీకుఁ గించిత్తుహానియుఁ జేయజాలదు. ఈదుస్థితిని దొలఁగించి యాంధ్రదేశమును నిష్కంటకముగాఁ జేయుటకు మీరందఱు నడుముకట్టవలయును. దీక్షవహించి కంకణములు గట్టుకొనవలయును. దేశ సౌభాగ్యము కొఱకు ధనప్రాణములను దృణీకరింపవలయును. ఐకమత్యఫలము మన కనుచూపుమేరలో నున్నది. ఇష్టసాధనము లక్ష్యముగాని యొకరెక్కువ యొకరుతక్కువ యనెడి మనోదౌర్బల్యమునకు లోనుగాక స్వార్థమును బూర్తిగా విసర్జించి పనిచేసినఁగాని యభీప్సితమునెఱవేఱదు. సాధకుఁడు దైవముచేయు అగ్నిపరీక్షలకు నిలఁబడి ఆదర్శప్రాయుఁ డగుచున్నాఁడు. సస్యశ్యా

మలమగు మాతృభూమిని రక్తసిక్తముగాఁజేయుడని మిమ్ము ప్రోత్సాహ పెట్టుటలేదు. దుండగులు మీమీఁదికి వచ్చినప్పుడు ధైర్యస్థైర్యములుకలిగి నిలఁబడుదురేని పాఱుబోతులు పాఱిపోవకమానరు. అంతమాత్రము చేసితిరా గుంపులు మనదేశమును విడిచిపోగలవు. లేదా దుండగీండ్రు సాధుమార్గము నవలంబించి మనతో నేకీభవింతురు. వీఁడుసాధువు, వీఁడసాధువనుటకు బుద్ధి, చేష్టలు కారణముగాని జాతి, మతము హేతువులుగావు. ఒకదేశమున నివసించుచు నొకతావునఁబండిన పైరుభుజించుచు నొకేగమ్యమును జేరవలసిన మానవులందఱు దేశమాతకుఁ బుత్రులేయగుట వారన్యోన్యము పశువులవలెఁ గాటులాడుకొనుట ధర్మముకాదు. పశువులైన నిట్టిపనిచేయవు. ఒకజాతిజంతువులు మందగాఁగూడియు నొకజాతిపక్షులు గుంపుగానుండియు నాత్మరక్షణ జేసికొనుచుండుట మీరనుదినము చూచుచుందురు. వికారచేష్టలుచేయు కోతులుసైతము సంఘముగా వనమ్ములఁ దిరుగాడుచు నితరుల భయపెట్టుచున్నవి. అంతటితోఁ బోవుచున్నవా ? ఎవఁడైన దుష్టుడు వెనుకఁబడిన పిల్లకించుక హానిచేయజూచిన దానికూయివిని గద్దకాఁడు పండ్లిగిలించి గుఱ్ఱునెట్టును. అంతటితో శత్రువు కాళ్ళకుబుద్ధిచెప్పకున్నచో వానరసమూహము వానిని జుట్టుముట్టి మట్టుపెట్టకమానవు. బుద్ధిబలము, శరీరబలము కలవారమయ్యు మనము దొంగలనుటతోడనే భయపడుచున్నాము. నిక్కమాలోచించినచో నధర్మపరులెంతమందియున్నను దుర్బలులే. వారికి మానసికశక్తియుండదు. ధర్మాత్ముఁడధర్మము నెదిరించి ప్రాణములు గోలుపోయియు విజయమునే పొందుచున్నాఁడు.

మనము చేయవలసిన కార్యమును వేఱొకసారి జ్ఞప్తికి దెచ్చుచున్నాను. మనమందఱ మాంధ్రులము. ఆంధ్రులశక్తి సామర్థ్యములు వెల్లడియగుటకు మనమైకమత్యముఁ గలిగి యుండవలెను. ఐకమత్యముచే సాధింపరాని దేదియు నుండదు. మీయం దిమిడియుండిన తేజమును రగులుకొలిపి దేశమున కుపయోగించునట్లు చేయగల నాయకులు మీకుగావలయును. అట్టిపెద్దలు మీలోలేకపోరు. వారికిఁ దక్కినవారు విధేయులై కార్యజాలమును నడుపవలెను. మీనాయకులకు గురునాథుఁడు ప్రతినిధియై మీకష్టసుఖములను మా కెఱిఁగించుచుండును. మీకుఁ గావలసిన సదుపాయముల నేమఱక మేము చేయు చుందుము. మీక్షేమ మేమాక్షేమము; మీసుఖ మేమాసుఖము. మిమ్ము విడిచి మేమెన్నఁడు నానందింపము. అందఱు సోదర భావముతోఁ బరస్పరము ప్రేమించుకొనుచుఁ గష్టముల నెదిరింపుఁడు. సత్యము, ధర్మము దైవమునకుఁ గన్నులు. ఏకన్ను గుడ్డిదైనను వికలత్వ మేర్పడకమానదు. తన్ను వికలునిగఁ జేయఁజూచు మానవుని దేవుఁడు త్యజించును. త్యజించుటతోఁ బోక పరిభవించును. దైవపరాభూతునకు శ్రేయము లడుగంటును. పావనములగు కృష్ణాగౌతమీ నదుల మధ్య నివసించు మీ రసాధుమార్గము నవలంబింపఁ జాలరు. ఆనదీ ప్రవాహములమీఁదనుండి వీచు పవిత్రవాయువులు ధర్మబుద్ధిని బురికొల్పఁగలవు. ధర్మదేవత యనుగ్రహించి యచిరకాలముననే సామ్రాజ్యమును స్థాపింపఁగల శక్తిని మన కొసంగుగాక !

ఇప్పటికే చాలఁ బ్రొద్దెక్కినది. ఇఁక మిమ్ము శ్రమ పెట్టను. గురునాథుఁ డిచ్చునాతిథ్యమును గ్రహించి సుఖముగ

నిండ్లకుఁ జేరుకొనుఁడు. ఐకమత్యమును బెంపొందించుకొనుడు; ఆంధ్రమాతకు జయము."

అందఱు నాంధ్రమాతకు జయమని యఱచిరి. అమాయకులగు గ్రామవాసుల హృదయముల నారాజపుత్రుని యుపదేశము శుద్ధవస్త్రమున నూతన వర్ణమువలె నంటుకొనెను. అత్యుత్సాహముతో 'జయము సార్వభౌమా!' యని యేకగ్రీవముగాఁ బలికిరి. జయనినాదము మిన్నుముట్టెను. అనంతరము గురునాథుని ప్రార్థననుసరించి వారందఱు నియమిత స్థలమునకుఁ బోయియాతిథ్యము స్వీకరించిరి. నగరమంతట విష్ణుదేవుని పొగడ్తలే వినవచ్చెను. యశోదాధులు ప్రజల యుత్సాహమును, రాజభక్తిని గన్నులారఁజూచి విష్ణుదేవుని సుగుణసంపదనగ్గించిరి. కాని తమ విషయమై శ్రద్ధతీసికొనుట మఱచెనని తలంచి యించుక దిగులు చెందిరి. వసుంధరాదేవి రాజపుత్రుఁ డున్నంత కాలము తమ్మగ్రామమున నుంచుమని దైవమును బ్రార్థించుచుండెను. ఆతనిఁ జూడఁగలిగినపుడెల్ల నానందపారవశ్యము నొందుచుండెను. ఆతనికీర్తి చెవులపండువు గావింపఁ బులకితగాత్రియై 'నేనంతటి యదృష్టము నోచిపుట్టితినా ?' యని నిట్టూర్పు పుచ్చుచుండెను.

భోజనము లైనపిమ్మట విష్ణుదేవుఁడు జానపదులకు సెలవొసంగుచు వారి నాయకులతో ముచ్చటించి కొన్ని గ్రామముల నొకకూటముగాను, గొన్నికూటముల నొక మండలముగాను నిర్ణయించి వానికిఁ దగిన యధికారుల నేర్పఱచి, ఆయధికారులందఱికిఁ దగునాలోచనలు చెప్పుటకు, రాజధాని నుండి వచ్చెడియాజ్ఞలను గ్రామముల కందఁజేయుటకు గురు-

నాథుని నియోగించెను. మఱికొందఱ మాటకారులను జీతము లేర్పఱచి కృష్ణాగోదావరీనదుల మధ్యనున్న గ్రామములలోని ప్రజలకుఁ గొండదొరలకు నచ్చచెప్పి కూటములు స్థాపింప నియమించెను. ఇదంతయు నాతఁడు వజ్రధరుని యభిప్రాయము ననుసరించియే చేసెను. వనవాసులనుండి పన్నుబందులు రాఁబట్టుటకు, నవి వారి యుపయోగమునకు వెచ్చించుటకు, లెక్కలు తేల్చిరాజధానికిఁ బంపుటకుఁ దగునుద్యోగులనక్కడి వారినే జనానురాగముఁగల యనుభవజ్ఞులను గురునాథునితో నాలోచించి నిర్ధారణచేసి తక్షణమే వజ్రధరునిచే ననుమతి పత్రములు వ్రాయించి యిచ్చెను. ప్రతిగ్రామమునకు నేదో యొక మేలు జరుగుటకుఁ బ్రతిగ్రామస్థునకు నిది మనదేశము; ఇదిమన సామ్రాజ్యము; ఇది మనజాతి యనెడి యుద్దేశము నాటుకొనుటకు వలయునన్ని కట్టుబాటులు గావించెను. మాటలదియ్యఁదనమునకుఁ, జేఁతల చక్కదనమునకు, నిష్కాపట్యమునకు వశులై యెల్లవారు విష్ణుదేవుని దైవముగా భావించిరి. ఆతని యాజ్ఞల శిరసావహించిరి. ఆరాజేంద్రుని కార్యములపట్ల నించుక యపచారము సంభవించినను మహాదోషము సంభవించుననియు, జాగరూకతతో రాజునుమెప్పించిన దేవుఁడు సంతసించుననియు వారిమానసముల గాఢవిశ్వాసము పాదుకొనెను.

జానపద సందర్శనము ముగించి వజ్రధరవిష్ణుదేవులు ప్రయాణాభిముఖులైరి. వారి తురగములు సిద్ధముచేయఁబడినవి. వారిని సాగనంపివచ్చుటకు గురునాథుఁడు తగువారిని నియోగించెను. వజ్రధరుఁడు గురునాథునితో 'నీయేర్పాటు చాల బాగున్నది. ఇంచుమించుగా సామ్రాజ్యము స్థాపిత

మైనట్టి. మాయెడ నీవుచూపిన యనురాగము నెన్నఁడు మఱవఁజాల' మని ప్రశంసించెను. అతఁడు నిసర్గవినయసంపదకు రాజభక్తివన్నె పెట్ట "మహాత్మా! నేఁజేసిన దేమున్నది. దేవర మహిమాతిశయమే యన్నిటిని సమకూర్చుచున్నది అచిర కాలములోనే మనము సుచంద్ర మహారాజు నభీష్టమును సిద్ధింప జేసి ఋణవిముక్తులము కాఁగలము. విష్ణుదేవసార్వభౌముని కీర్తి యికఁ గొండగుహలలోఁ బ్రతిధ్వనించుచు దుర్గమారణ్యములకు నూతనోత్తేజమును గలిగింపగలదు?" అనెను. విష్ణుదేవుఁ డాతనిభుజము నవరించుచు 'సుగుణధుర్యా! నీవంటి యుత్తములు మాకు సహాయులై యుండ సామ్రాజ్యము స్థాపించు టెంతటిపని. మాతండ్రిగారి మిత్రరత్నమ వగు నిన్నేమని కొనియాడవలయునో నాకుఁ దోఁచుటలేఁ' దనెను.' 'ఆర్యా! కొనియాడుటకు నేనెంతవాఁడను? నాయందేమైన గుణలేశము కానవచ్చినచో నది దేవర పాదసేవాఫలము కాని వేరుకాదు. ఆజ్ఞాపించి పనులు చేయించుకొనఁ దగినవాఁడే కాని గురునాథుఁడు మీ కిన్మూఁడుకాఁ' డని చిఱునవ్వుతో సమాధానమిచ్చెను. వజ్రధరవిష్ణుదేవులు గురునాథుని భక్తితాత్పర్యములకు నిర్భరానందము నొందిరి. పోయివచ్చెదమని చెప్పిరి. గుఱ్ఱము లెక్కఁబోవుచుండఁగాఁ గొన్ని యుపహారములు తెప్పించి గురునాథుఁడు వారికి సమర్పించెను. వారు వానిని స్పృశించి 'నీభక్తియే మాకమూల్యోపహారము. రాజకార్యములను జక్కఁగా నిర్వహించినవారికి మేమొసంగినట్లు పంచిపెట్టు' మనిచెప్పిరి. వారి యాశ్రితవాత్సల్యమును గొనియాడి గురునాథుఁ డందుల కియ్యకొనెను.

విష్ణు:—మనమింకఁ బోవచ్చును. మఱి—

వజ్రి:—ఔను. గురునాథా! మేము వెంటనే రాజధానినుండి సాయుధభటులను బంపెదము. దొంగలచేఁ గొట్టఁబడి భయపడియున్న యీ స్త్రీజనమును జాగ్రత్తగాఁ దన్నగర మున కంపుము. శ్రీశైలప్రాంతమునందలి రత్నసానువు వారి నివాసమఁట. కాలకేతుతనయ సురక్షితయైయున్న దని గౌతమాశ్రమమునున్న మహర్షికి తెలియఁజేయుము.

గురు:—దేవర సెలవిచ్చినట్లు తప్పక చేయుదును.

విష్ణు:—వారితో వచ్చిన పురుషులజాడ యేమియుఁ దెలియ రాలేదు గదా?

గురు:—తెలియఁ బడలేదు. ఇంకను బ్రయత్నించిచూచెదను.

విష్ణు:—సరే! ఆర్యా! మన మొకసారి వారిని బలుకరించి యుత్సాహపఱచిపోవుట యుక్తము కాదా!

వజ్రి:—అట్లే చేయవచ్చును.

గురునాథుడు ముందునడువ వారుభయులు నా స్త్రీ లున్న మందిరమున కరిగిరి. వారిరాక కలరి యశోదాదులు తమవారి వృత్తాంత మేమైన వినవిచ్చెనేమో యని జెవులప్ప గించిరి. "అమ్మా! మీ బంధుగుల కొఱకు దేశమంతయు వెదకించు చుంటిని. ఇంతవఱకు వారిజాడ తెలియరాలేదు. అయినను మీరు విచారింప నక్కరలేదు. మీరు తగిన సంరక్షణలో నున్నారు. మా సార్వభౌముని యాజ్ఞ ప్రకారము సాయుధభటులఁ దోడిచ్చి మిమ్ము మీదుర్గమునకు బంపెదను. మీ బంధుగులు చెల్లాచెదరె యింతకుముందే యిలు చేరి

యుందురు. వారిని గలిసికొని మీరు సుఖింపఁగలరు. ఒకవేళ వారెచటనైన మీకొఱకు వెదకుచున్నచో నేఁడో రేపో యిచటికి రానేవత్తురు. వారు వచ్చినను మీకుఁ దగురక్షణ మొసఁగియే పంపెదను" అని గురునాథుఁడు వారితోఁ బలికెను. అయ్యబల లేమియుననక తలలు వంచిరి. "అయ్యా! మాప్రాణములు మీచేతిలో నున్నవి. నీటముంచినఁ బాలముంచిన మీదేభార" మని వృద్ధవనిత బదులుచెప్పెను. "భయమక్కఱ లేదు. ధైర్యముతో నుండుఁడు. రేపే మీరు మీ నగరమునకు బ్రయాణము చేయవచ్చును" అని వజ్రధరుఁడు వారికి ధైర్యము చెప్పెను. విష్ణుదేవుఁడు వసుంధరాదేవి ముఖారవిందమును దిలకించుచుఁ 'బోయివచ్చెదము, సెలవొసంగుఁడు. శుభసమయములందుస్మరింపుఁ' డనెను. వృద్ధవనిత 'రాజపుత్రా కాదు_ సార్వభౌమా! ఎంతమాట! ఇట్టి యుపకారమొనర్చిన మిమ్ముఁ బ్రాణములుండఁగా మఱవఁ గలమా?' యనెను. యశోదాయశోధరలు 'తెలివితక్కువచే వెనుకఁబడితిమి. అది మేమనవలసిన మాట' యనిరి. వసుంధర యేమియు ననజాలక పోయెను ఆమె తన శిరోరత్నమును సవరించుకొనెను. ఒక్కసారి మల్లికవంకఁ జూచి మెడలోని పుష్పమాలికను బదిలపఱచుకొనెను. విష్ణుదేవుఁడిక నచట నిలువఁజాలక పోయెను. వెనుదిరిగి నెమ్మదిగా నడువసాగెను. వజ్రధరుఁ డతనిని వెంబడించెను. గురునాథుఁ డశ్వముల నటకుఁ దెప్పించెను. వారు గుఱ్ఱములెక్కిరి. గురునాథు ననుచరులు కొందఱు వారి ననుగమించిరి. క్రమక్రమముగా వారు వనరాజిచే నంతర్హితులైరి. గురునాథుఁడు మందిరాభ్యంతరమున కరిగెను. అందఱు వెడలిపోయిన పిమ్మట నయ్యబలలిట్లు మాటలాడుకొనిరి.

వృద్ధ:—కాలకేతుని మిత్రులమనుటచే మనము శత్రువశమున నుంటిమని యదటు కలుగుచున్నను లోకాధికమగు వీరి సౌజన్యసంపద యెడంద కూఱట గూర్చుచున్నది కావున మనము భయపడ నక్కఱ లేదు. "భయముమాట యటుంచుము. దైవము మనల నింకేమిచేయగలఁడు. నిన్నటినుండియు మణినాగుఁడు మనమున్నతావు కనుఁగొన లేకపోయెనా? అతని కేమి కీడుమూఁడెనో యని నామనసు చలించుచున్న" దని యశోధర వచించెను.

యశోద:—గుఱ్ఱపు రౌతులు మనలఁదెచ్చునప్పటికిఁ గుమారుఁడు దొంగలను వెంబడించి తఱుముచుండెను. పరిజను లాతనికి సాహాయ్యమొనర్చుచుండిరి. కావున నాతనికి హాని సంభవించు ననుట కవకాశము లేదు.

మల్లిక:—అట్లుకాదు. కాకులేశ్వరుఁడు తనకీరత్నము లభించిన విధమును వివరించుచు దొంగలు పంచుకొనుచుండ వారిని దమయాప్తులు చెదరఁగొట్టినట్లు వచించెను. అప్పటికి భావమేమై యుండును.?

యశోధర:—అయ్యో! యీదిక్కుమాలిన దొంగలు నాబిడ్డనికి బ్రాణాంతకము తెచ్చిపెట్టి యుండరుగదా! (కన్నీళ్లు విడుచుచు) ఆచందమామ మరల నాకళ్లఁ బడునా? హా! యెట్టి దుర్ముహూర్తమున బయలుదేఱితిమో కదా!

వృద్ధ:—అమ్మా! నీకుమారుఁ డంతటి దుర్బలుఁడా! దొంగల సంఖ్య యధికమగుటచేత మనము మూటముల్లె కోలుపోవలసివచ్చెఁగాని యెదిరించి నిలిచిన తెప్పపాటుకాలములోనే కదా వారు కాళ్లకు బుద్ధిచెప్పవలసిన వారైరి.

వస్తువులకొఱకు సీతనయుఁడు వారిని వెంబడించి యుండును. ఆతనిధాటి కోర్వలేక దొంగలు వస్తువులను విడిచిపెట్టి పోయియుందురు. ఏవైనఁగొన్ని ముచ్చులచేత జిక్కెనేమో! వానినివారు పంచుకొనుచు మఱికొందఱిచే హతమార్పఁ బడి యుందురు. కావున నీకుమారుని కేమియు భయము లేదు.

యశోధర:—అట్లైన వాఁడింత తడవేలచేయును?

యశోద:— దొంగలను ద్రోలివచ్చునప్పటికి మనమచ్చట లేము కదా! మనకై వెదకుచుండును. అరణ్యమార్గము లారయుచున్న మణినాగునకు మనమిచ్చటనున్నట్లు తెలిపి పుణ్యము గట్టుకొనువా రెవరైన నుండవలదా?

మల్లి:—ఒకవేళ నీయడవులలో దారితప్పి యాతఁ డెటులైన పోయియుండెనేమో!

వసుం:—మనమిటురాఁగానే బండ్లవాండ్రు తమదారిని పోయి యుందురు. మణినాగుఁ డచ్చటికి వచ్చి బండ్లు, మనము లేకుండుటచే ధైర్యముచేసి మనమింటిమార్గము పట్టి యుందుమని యూహించి మనలఁ గలిసికొను తలంపుతో త్వరితగతిం జని రత్నసానువును జేరియుండును.

మల్లి:—అట్లుజరిగినచో మహారాజున కీ వృత్తాంత మెఱిఁగించి సైన్యసమేతుఁడై యీప్రదేశమును గాలించి యాటవికుల మట్టుపెట్టి మనలఁ దీసికొనివెళ్లుటకై యీ పాటికి వచ్చుచుండఁడా?

వృద్ధ:—తప్పక వచ్చుచుండును. మీరన్నది సమంజసముగా నున్నది. అదిగో కాకికూసినది. మణినాగుఁడు మనకై

బయలు దేఱి వచ్చుచున్నాఁడు. ఱేపో మాపో మనఁజాడ బట్టి యిచటికి రావచ్చును.

యశోధర:—తథాస్తు. ఇంటికిఁ బోఁగానే నీకుఁ గోరిన బహుమాన మిచ్చెదను.

వృద్ధ:—మీరందఱు చల్లగా నుండవలయుఁ గాని నాకు బహుమానములకుఁ గఱవా? (మల్లికా వసుంధరల వంకఁ జూచుచు) ఎన్ని శుభపరంపరలు కనిపెట్టుకొని యున్నవి? మణినాగుఁడే మాచక్రవర్తియైనచో నారొట్టెనేతిలోఁబడదా?

యశోధర:—ఈగండము గడచి గట్టెక్కనిమ్ము. పిమ్మటఁ జూచుకొందము.

యశోద:—ఆఁడువాఱితలంపు లిట్లేయుండును. చాలులెండు!

వసుంధర:—ఎందుకువచ్చిన యధికసంభాషణము?

మల్లిక:—(తనలో)వసుంధరకు బావమాటహితమగుట కష్టమే. అఘటిత ఘటనాపటిష్ఠమగు దైవమేమి చేయనున్నదో? (ప్రకాశ) ఇంటికి సుఖముగాఁ జేరకుండ నెట్టి గొంతెమ్మ కోరికలు? ఈముసలమ్మ నేమి చేయవలయును?

వృద్ధ:—నీవా? అధికారమున్నచో నేమైనఁ జేయింతువు. కావుననే మాబంగారుతల్లిని గనిపెట్టుకొని యున్నాను.

వారిట్లు సంలాపించుకొనుచుండ గురునాథుని పరిచారికలు కొన్నిఫలములు భక్ష్యములు తెచ్చి వారికి సమర్పించిరి. నిన్నటికంటె నేఁడు వీరిమొగములు తేటగానున్నవని వారనుకొని యావిషయమును తమ యజమానునకుఁ దెలిపిరి. తమయెడ వారికి విశ్వాసము జనించియుండునని గురునాథుఁడూహించి సంతసించెను.

# ఏడవ ప్రకరణము

శ్రీశైలము పురాణప్రసిద్ధిగల క్షేత్రము. ఆప్రాంత కాంతారము లతిగహనములై యుండును. తత్సమీపముననే నిశుంభనివాసమగు రత్నసానుపురముగలదు. నిశుంభుఁడనార్య జాతిలో జనించినవాఁడని యాకాలమునందలి యార్యులు తలంచెడివారు. ఆతని యనుచరులను రాక్షసులని వ్యవహరించెడివారు. ఆతని సింహళద్వీపవాసులతో నాతనికిఁగల సంబంధము దానిని బలపఱచుచుండెను. యథార్థము విచారించినచో నది యార్యానార్యసమ్మేళనకాలము. పలువు రనార్యులార్యుల యాచారముల నవలంబించి వారినాగరకత నలవరచుకొని యార్యులతో సంబంధ బాంధవ్యములు చేయుచు వారిలోఁ గలియుచుండిరి. ఆర్యులు తమ ప్రాబల్యమును వృద్ధి చేసికొనుటకు, దేశమున సుఖనివాసములభించుటకు వారిని తమలోఁగలిపికొని మన్నింపసాగిరి. నిశుంభునిభార్య యార్య జాతిస్త్రీ. ఆమె పెంచిన వసుంధర యార్యక్షత్రియుఁడైన కాలకేతునిపుత్రిక. ఆతని సేనాధిపతి మహీధరుఁడార్యానార్య దంపతులకు జనించినవాఁడు. ఇట్లార్యానార్య రక్తసమ్మేళనము జరుగుచున్నను సముద్రప్రాంతము లందును, నదీతీరములందును బరిశుద్ధార్యసంతతివారగు మహర్షులు, నుత్తమక్షత్రియ జాతివారగు రాజేంద్రులు నివసించుచుఁ గొండలందు నరణ్యములందుఁ జరించుచుఁ దమశాంతికి భంగముగలిగించు ననార్యజాతుల నీసడించుచుండిరి. సుచంద్రుడట్టియు దేశము లేకయాంధ్రదేశమున నివసించువారందఱు నేజాతివారైన నేమతమువా

రైన సమానగౌరవ ప్రతిపత్తులతో నైకమత్యముగలిగి సుఖజీవనము చేయవలయుననియు నందుకు వారందఱు నొక సామ్రాజ్యమున భాగస్వాములు కావలయుననియు సంకల్పించి దిగువ జాతులవారితో మైత్రి నెఱపుచు సదాచారములు సన్మార్గము వారి కలవడఁ జేయుచుఁ గృష్ణాగౌతమీ మధ్యభూభాగమున నొక నూతనోత్తేజమును గలిగించెను. అనేక గ్రామములవారాతని యుపదేశమును తమసత్వరాభివృద్ధికి హేతువని నమ్మి యాతఁడే తమరాజేంద్రుఁడని చెప్పికొనుచుండిరి. సుచంద్రుఁడు గతించినపిమ్మట వజ్రధరుఁడు తన్మార్గమునే యనుసరించి జానపదుల నాదరించుచుండెను. సుచంద్ర తనూజుఁడగు విష్ణుదేవుఁడును బలసమగ్రత గలిగియు నిర్బంధించి జనుల లోఁబఱచుకొనుటకంటె నార్జవముచే వారి చిత్తముల నాకర్షించి స్థాపించిన సామ్రాజ్యము సుస్థిరమై యుండఁగలదని తలంచి ప్రజానురాగమును జూఱగొనుటకే యెల్లవిధములఁ బాటుపడుచుండెను. ఒకరిని ద్వేషించుటయు నొకరిమీఁద దండెత్తుటయు లేకుండుటచేఁ బెక్కుగ్రామముల వారు తమంతఁదామే యాతని యాశ్రయము గోరి వశులగుచు వచ్చిరి. రత్నసాను దుర్గము రాజధానిగా నా ప్రాంతమేలు నిశుంభుఁడు బలవంతుఁడై యార్యజాతులతోఁ గలియక స్వతంత్రుఁడై శత్రుభయంకరుఁడై యుండెను. అందుచే నిశుంభుఁడు సమీపదుర్గముల జయించి కొల్లగొట్టించుచుఁ గొండజాతుల వారిని గ్రామములమీఁదికిఁబంపి వశమొనర్చు కొనుచుండెనని యార్యజాతులవారు తఱచుగాఁ జెప్పికొనసాగిరి. విష్ణుదేవుని భక్తితో గౌరవించువారి సంఖ్య హెచ్చినకొలఁదిని నిశుంభుని ద్వేషించువారి సంఖ్యయు నధికమగుచుండెను. నిశుంభుఁడు

సంగరోత్సాహముగల శూరుఁడు. తనచేయి పైనుండవలయు ననెడి యహంభావముగల మానవంతుఁడు. ధనము, దర్పము, వైభవము నాతనికి బ్రియములు. పరివార రక్షణము ప్రియతమము. దయాసత్యశౌచము లాతని ప్రధానాశయములు కావు, కాని వానిని విడచుట కంతగా నిష్టపడఁడు. కొల్లగొట్టి తెచ్చిన వస్తువుల నన్నిటి రణశూరులకుఁ బంచిపెట్టక తానొక్కఁడు నుపయోగింపఁడు. రాజ్యమును విస్తరింపఁజేయ వలయుననెడి కోరికచే దండయాత్రలు సలుపును. నిష్కారణముగాఁ బ్రజాపీడ కాతఁ డుత్సహింపఁడు. అపకారులను రూపు మాపనాయత్తపడుఁగాని యాశ్రితపోషణమునకు వెనుదీయఁడు. స్త్రీలౌల్యము, కామచారము నాతనియం దంతగాఁ గానరావు.

సైనికులకు సేనానాయకులకు నధికముగా వేతనము లిచ్చుటేకాక సమయము వచ్చినప్పుడెల్ల ననర్ఘ వస్తువులచే బహూకరించి వారి నుత్సాహపఱచుచుండును. ఆకారణమున వారందఱు నాతనియెడ గాఢప్రేమ కలిగియుండిరి. ఇట్లాప్తులచే యోగ్యుఁడని విరోధులచే రాక్షసుని తలంపఁబడు నిశుంభుఁడార్యానార్యగుణసమ్మేళనమున కాశ్రయుఁడై యుండెను.

ఒకనాఁ డాతఁడు కొలువుదీర్చి దేశవాసుల విజ్ఞప్తు లాలకించుచుండెను. ఆతనివదన ముత్సాహ సూచకముగా లేదు. ఆతని మంత్రి ప్రసేనుఁడు నెమ్మదిగాఁ బ్రజలకుఁ జెప్ప వలసినదిచెప్పి రాజానుమతి నెఱిఁగించి పంపుచుండెను. కొంత సేపటి కందఱు కార్యసాఫల్యమును బడసి ప్రీతులై చనిరి. నిశుంభు నాప్తవర్గము, పరిచారకులు మాత్రము మిగిలియుండిరి. అప్పుడు ప్రసేనుఁడు 'రాజా! నేఁడేమో క్రొత్తగా కనబడు

చున్నారు' అనెను. నిశుంభుఁడు మంత్రివంక సాదరముగఁ జూచుచుఁ 'జక్కఁగాఁ గనిపెట్టితివి. నా మనస్సు మనస్సులో లేదు. రాత్రి తెల్లవాఱుజామున నొక పాడుకల గంటిని. అది మనస్సును గలవర పెట్టుచున్న'దని బదులు చెప్పెను. ప్రక్కనే కూరుచున్న మహీధరుఁడు 'స్వప్నమాత్రమునకే మహారాజింత వంతనొందుచుండెనా? హిమాలయము చలించుచున్నది' అనెను. నిశుంభుఁడు సోదరా! స్వప్న వృత్తాంతమును విన్నచో నీవట్లనవు. మన బాలికలు సింహళమునకేగి రెండుమాసము లైనది కాదా?

మహీ:—అగును. రెండుమాసములు గడచినవి. మూఁడవ మాసము జరుగుచున్నది. మొన్ననే క్షేమసమాచారము తెలుపుచు బావగారు జాబు వ్రాసిరి.

నిశుం:—అందుఁ బిల్లలను బంపుదునన్నట్లు వ్రాసెనుగాదా?

మహీ:—ఔను. కొలఁది దినములలో మనవారందరు బయలు దేఱి రాగలరన్నట్లు తెలిపియున్నారు.

నిశుం:—రాత్రి శయనాగారమును జేరునప్పటికి వసుంధర ముద్దుమొగము స్మరణకువచ్చినది. తోడనే మీావదినె యెదుట నిలువఁబడి కన్నీరు దుడిచికొనుచు బిడ్డనింత కాలము విడిచి యుందురని యెన్నఁ డనుకొన్ననైతినని నెను. తమ్ముఁడా! ప్రసేనా! ఇది స్వప్నమని తలంపకుఁడు. జాగ్రదవస్థలో జరిగినదే యీా విశేషము.

ప్రసే:—పుత్రికావాత్సల్య మట్టి చిత్త విభ్రాంతికిఁగారణమైనది. నిజముగా నెన్నఁడు మీారింతకాలము కుమారీమణిని విడిచి యుండలేదు.

మహీ:—మహారాణికిఁ దిద్దయ్యపై నంతటి ప్రేమాతిశయమున్న మాట నిక్కము. ఆబిడ్డ తేజోరూపములో మిమ్ము గానవచ్చినను రావచ్చును. ఎందులకీ సిద్ధాంత రాద్ధాంతములు. సత్వరముగాఁ బంపుఁడని చూలోదర మహీపాలునకు వర్తమాన మంపుదము.

ప్రసే:—అటుచేయుట మంచిదే. మహారాజుహృదయము పుత్రికాముఖావలోకనమునఁగాని స్వస్థపడదు.

నిశుంభు:—స్వప్నవృత్తాంతము నాలకింపుడు. నేను సౌధోపరి భాగమునునుంటినఁట! ప్రక్కను మహాసముద్రము కల్లోలమాలికలచే నాభీలమైయుండెను. అందొక నౌక గిరగిరఁ దిరుగుచుండెను. అందు వసుంధర మల్లిక యశోద యు నొండొరులఁబట్టుకొని ప్రాణభయముచే వణకుచుండిరి. క్షణకాలములో నౌక సముద్రమున మునిగిపోయెను. అమాంతముగా మేడమీఁదనుండి నే నా యకూపార మధ్యమునదుమికితిని. మల్లికావసుంధరలు నూతనాలంకార శోభితలై సముద్రగర్భమున నింద్రవరుణులచే రక్షింపఁ బడుచుండిరి. ఇంతలో నక్రమొకటి నాకాలుపట్టుకొని యీడ్చుకొని పోయినది. ఎక్కడికిఁ బోయితినో తెలియదు. ఎట్లు వచ్చితినో యెఱుఁగ. శ్రీశైలపర్వతమునుండి క్రిందికి దొర్లిపడి మేలుకొంటిని.

మహీ:—భయంకరమైన స్వప్నము. బిడ్డలను సుఖముగా దోడితెచ్చుటకుఁ దగువారిని బంపుట యుత్తమము.

ప్రసే:—సేనాపతులగు మీరుకూడ నట్లు నుడువుచున్నారు? చిత్తమునఁ గుమారికతలంపు గలుగ మమత్వము గాఢ

మగుటచే మహారాజు విపరీతవాసనాప్రపంచమున దిరుగాడెను. ప్రతిదినము నేదో కల వచ్చుచునేయుండును. అన్నియు నందఱకు జ్ఞప్తియందుండవు. ఏవిషయమును గుఱించి మన సాందోళన పడుచుండునో దానినే వాసనాప్రపంచమునఁ గాంచుచుండుదుము. కల కల్లయేకాని యందొక్కటియైన సత్యముండునా? అయినను మనము రాజపుత్రిక క్షేమసమాచారము తెలిసికొనుటకు వేగవంతులను సింహళద్వీపమునకుఁ బంపుదము.

నిశుం:—ఏనచో జాబువ్రాయుము. మహీంధరా! దీనినిగొనిపోయి యచిర కాలమున బిడ్డల కుశలవార్త తేఁగల దిట్టనొకని బంపుము.

వారురాజాజ్ఞను నిర్వర్తించుటకుఁ బ్రయత్నించుచుండిరి. ద్వారపాలకుఁడు వచ్చి జయవాక్యము నుచ్చరించి సింహళము నుండి దేవర బంధువులెవ్వరో వచ్చియున్నారని మనవిచేసెను. అందఱు హర్షముతో శీఘ్రముగాఁ దోడితెమ్మని పలికిరి. వాఁడు మహారాజునకు జయమనిపలికి వెడలిపోయెను. ఇంచుకంతలో మణినాగుఁ డల్ప పరిజనులతో సభామంటపమునకే తెంచెను. ఆతనిజూచి నిశుంభుడు 'ఓహో! మేనల్లుడు మణినాగుఁడే' యనెను. మణినాగుఁడు నెమ్మదిగా సమీపించి నిశుంభునకు నమస్కరించి తదనుమతి నుచితాసనమునఁ గూరుచుండెను. 'అందఱు సుఖముగా నున్నారా? వసుంధరాదులు వచ్చిరా?' యని నిశుంభుఁడాత్రముతో నడిగెను. ఆతనిధోరణిని బట్టి వీరంతకుమున్దే తమ పరిభవ వృత్తాంతమును వినియున్నారని యాతఁడెంచి వినమ్రవదనుఁ డయ్యెను. అందఱకు

నారాటము హెచ్చెను. నిశుంభుఁడు మ్రానుపడి మాటలాడ లేకపోయెను. మహీధరుఁడు 'యశోదా మల్లికలు జీవించి యున్నారా ?' యని ప్రశ్నించెను. మణినాగునిమోము వివర్ణ మయ్యెను. ప్రసేనుఁడిదిచూచి యేదో పుట్టిమునిఁగి యుండ వచ్చుననుకొని 'రాజకుమారా! క్షేమసమాచారము నెఱిఁగింపక యట్లు దీనుఁడవై యున్న మామగారి హృదయమెంత క్షోభించును? జరిగినది జరిగినట్లు చెప్పి కర్తవ్య ముపదేశింప వలయుఁ గాని యిట్లుమౌనము వహించియుండుట భావ్యమా!' యనెను. మణినాగుఁడు మాట తెమల్చుకొని 'వారింటికి జేర లేదా ?' యనెను. మహీధరుఁడు 'అట్లడుగు చున్నావేమి? మీరు వారికి సహాయులరై వచ్చితిరా ?'

మణినా:—వచ్చితిమి. దారిలో—

నిశుంభుని గుండె దడదడ లాడెను. మహీధరుని యొడలు జల్లుమనెను. కల కల్లగాక సత్యమయ్యెనా యని ప్రసేనుఁడును దిగులందెను. రాజపుత్రా! ప్రవహణము సరిగా నోడ్డు చేరినదా? అనుకొన్ననాటికి రేవున దిగితిరా ?

మణినా:—అనుకొన్నట్లు జరుగలేదు. మేమెట్టి దుర్ముహూర్తమున బయలుదేఱితిమో ? బృందావనము రేవున దిగఁదలఁచితిమి. ఆ రేవు సరియైన స్థితిలో లేదని నావికులు మమ్మంతిర్వేదిలో దింపిరి.

ప్రసే:—మీరందఱు సురక్షితముగా దిగితిరా?

మణినా:—సురక్షితముగానే దిగితిమి. అచటి యధికారియు మమ్ముఁ జాల గౌరవించెను.

మహీ:—(ఉచ్ఛ్వసించి) జలగండము గడచి గట్టెక్కితిరిగదా! అంతయు దైవానుగ్రహము. ఇఁక జరిగినది సత్వరముగా నెఱిఁగింపుము.

మణి:—వేగముగా నిలుచేరవలెనని బండ్లుకట్టుకొని మేమరణ్యమార్గముల బయలుదేఱితిమి. కొంత ప్రయాణము చేయునప్పటికి సూర్యాస్తమయమయ్యెను. బండ్లవాండ్రు భయము లేదనిచెప్పినందున రాత్రికూడ ప్రయాణముచేసితిమి. ఒక నిసివేళఁ గొంద ఱాటవికులు మాబండ్ల నడ్డగించిరి. వారు మాకంటె నధికసంఖ్యులుగా నుండిరి. అయినను మేము జంకక వారి నెదిరించితిమి. దొంగలు మామాట ముల్లి దోఁచుకొనిరి. స్త్రీలఁగాపాడుటతో మాప్రయత్నము సరిపోయెను. వారికి హాని కలుగకుండ నొకచోఁజేర్చి దొంగల మీఁదఁదిరుగఁబడితిమి. వారు పలాయనులైరి. మేముకొంత ద్రవ్య వారినిదరిమి కొలఁదివస్తువులను మరల స్వాధీనము చేసికొని యెప్పటిచోటికి వచ్చితిమి. మనవారచటలేరు. బండ్లుకాని బండ్లమనుష్యులుకాని మాకుఁగానరాలేదు. అప్పటికి దెల్లవాఱవచ్చినది. బండ్లు ముందుకు సాగిపోయిన జాడ కానవచ్చెను. ఆప్రమాదకరమైన ప్రదేశముననుండుట కంటె ముందుకుబోవుట మంచిదని తలంచి మాఅమ్మయు నత్తయు ధైర్యము వహించి బండ్లు తోలించుకొని వచ్చి యుందురని మేమిటువచ్చితిమి. వారింటికిఁ జేరియుందురనియే మే మనుకొంటిమి.

ఆవృత్తాంతమును విని నిశుంభుడు దీర్ఘముగా నిశ్వసించెను. యశోధరకూడ బయలుదేరినదా! యని యతిప్రయ

త్నముమీఁదనడిగెను. ఆదేవి మీదర్శనము చేసిపోవలయునని మాతండ్రి యనుమతి వేఁడి మాతో వచ్చినది.

ప్రసే:—ప్రమాదమేమియు సంభవించి యుండదు. యశోదాదేవియు నూహాపోహలు, ధైర్య స్థైర్యములుగల రాణి. ఆప్రాంతమం దేదో గ్రామము చేరుకొని మీరాక కెదురు చూచుచుందురు. మీరిట్లు వచ్చుటచే వారు నిస్సహాయులైరి.

మహే:—తత్క్షణమే కొంతసైన్యము ను దీసికొనిపోయి యాప్రాంతగ్రామములు గాలించి తగులఁబెట్టి బిడ్డలఁ దీసికొని వచ్చెదను.

మణినా:—మీ కెందులకు శ్రమ. కొలఁదిమందిని తోడిచ్చినచో నే నా పని చేయఁజాలనా?

ప్రసే:—గ్రామములమీఁద దండెత్తవలసినంత యేమివచ్చినది. ఎవరో బాటసారులని తలంచి యాటవికులు కొల్లగొని యుందురు. వారొకవేళ మన యేలుబడిలో నివసించువారే యేమో?

నిషం:—మనవారే మనకు హానిచేసి యుందురా? అది యే ప్రాంతమై యుండునో గుర్తింపఁగలరా?

మణి:—కృష్ణాగోదావరుల మధ్యదేశము. ఇంచుక గోదావరికే చేరికయై యుండును.

మహే:—అయినచో నది కాకులేశ్వరుని యేలుబడిలోని దేశము. ఆర్యులమని విఱ్ఱవీఁగు వారి దేశములోనే యిట్టి దుండగములు జరుగుచున్నవి.

నిశుం:—ఏది యెట్లుకానిమ్ము! మదీయాత్మజాత వదనార విందమును నేత్రపర్వముగాఁ జూడక ప్రాణములు భరింప జాల. అదిగో! విశ్వంభర రోదనధ్వని శ్రవణ విదారణమై వినవచ్చుచున్నది. మహీధరా! సైన్యము నాయత్తపఱచుము. స్వయముగానేపోయి కుమారికనరసి కొనివచ్చెదను.

ప్రసే:—దేవర తొందరపడు చున్నారు. ఆజ్ఞామాత్రమున నఖలదేశమును గజగజలాడించు నిశుంభప్రభు వీ స్వల్ప కార్యమునకు బయలుదేఱ వలయునా? అట్లుచేయుట యనుచరు లసమర్థులని యంగీకరించుటకాదా? ఒకటి రెండు దినములు వేచియుండుఁడు. ఎచ్చట నున్నను మీపుత్రికను గాలించి తెచ్చు భారము నాయది.

మణి:—కొలఁది మంది సాయుధ భటులఁ దోడిచ్చిన నేనే యాప్రదేశమునకుఁ బోయి వారిం దోడితెచ్చెద. ఇంత మాత్రమున కేల పెద్దప్రయత్నము?

నిశుం:—సోదరా! ఈతనికిఁ దగు సాహాయ్యమిచ్చి తక్షణమే పంపుము.

అందఱు దానికి సమ్మతించిరి. మహీధరు నాజ్ఞవహించి నూఱుగురాశ్వికులు మణినాగుని వెంబడించిరి. జవనాశ్వము తనకై వచ్చునప్పటికి మణినాగుఁడు ప్రయాణ సన్నద్ధుఁడయ్యెను. మామలకు నమస్కరించి మంత్రిచే ననుమతుఁడై యాతఁడు పయనమై పోయెను.

---

# ఎనిమిదవ ప్రకరణము

కాకుల మాకాలపు నగరరాజములలో నొకటి. అది కృష్ణానదీతీరమునఁ గట్టఁబడియుండెను. తీర్చినవీథులు సూటిగా నుండెను. ఇరువైపుల సౌధరాజము లలంకృతములై యుండెను. నగరమున నొకవైపున రాచనగరు కృష్ణవేణికిఁ జేర్చి నిర్మింపఁబడెను. దానికిఁజుట్టు నెత్తైనప్రాకారము కలదు. దాని నాలుగు వైపుల నాలుగుబురుజు లున్నవి. అందు శత్రువుల నెదుర్కొనుటకుఁ దగుసన్నాహములన్నియుఁ జేయఁబడియుండెను. కోటకు మూఁడువైపుల నగరము విరాజిల్లుచుండెను. ఒక వైపునఁ గృష్ణవేణి మానవ నిర్మితము కాని కందకరాజమై విలసిల్లుచుండెను. విశాలములైన విపణివీథులతోడను రమణీయములగు చంద్రశాలలతోడను, ఎప్పటికప్పుడు చక్కఁజేయఁబడెడి రాచబాటలతోడను, కల్పకములవంటి వృక్షరాజములనొప్పారు నుపవన వాటికలతోడను దర్శనీయమగు నన్నగర మమరావతిని బోలియుండెను. అందఱు సంపన్న గృహస్థులె; అందఱు ముదిత హృదయులె; అందఱు ధర్మాచరణ తత్పరులె; అందఱును న్యాయపథనిరతులె. భోగలాలసులయ్యు నీతిని వీడరు. రణకళాకుశలులయ్యు మదోన్మత్తులుకారు. సుకుమారులయ్యు భీరువులుకారు. వ్యాయామ కర్కశులయ్యు నిర్దయులు కారు. ఇట్టి జనానీకముతో భాసిల్లు నప్పురవరమును వజ్రధరుని సాచివ్యమున విష్ణుదేవుఁ డేలుచుండెను. ఆరాజేంద్రుఁడు తన శయన మందిరమున నిటునటు దిరుగుచు నిట్లనుకొనెను. 'ఈపాటికిఁ బూర్ణభద్రుఁ డెట్టిపాలెమునుండి అయ్యబలలఁ దీసికొని రత్న

సాను నగరమునకు బయలుదేఱి యుండును. మన మొనర్చిన యుపకృతికి మెచ్చి నిశుంభుఁడు మనయెడ స్నేహభావము వహింపకపోడు. మజ్జనకు నిచ్ఛాసంపూర్తి కీతఁడొక యడ్డుకట్ట యని భావించుచుంటిమి. దైవానుగ్రహమున నీతనికి సద్బుద్ధి యుదయించిన వసుమతీతలము రక్తసిక్తముగాకుండ నాంధ్ర సామ్రాజ్యము స్థాపితము కాఁగలదు.'

ఆహా! ఆకోమలి లావణ్యాతిశయము. కార్యభారభుగ్నమగు నా హృదయమున ననురాగమును మొలకలెత్తించు చున్నది. నాయందా విలాసినికి భావోదయ మయ్యెననుటకు సూచన లేకపోలేదు. అయ్యారాళకుంతల చపల చపలముగ నన్నీక్షిం చుచు నీలోత్పలమాలికలఁ గుమ్మరించినది. అనర్ఘమగు నా మణిభూషణము ధరించుట కమ్ముగుదయే తగు. దానినందు కొనునప్పుడా బాలామణి గండములు చెమర్చినవి. ఇదిగో చంద్రబింబము. ఆ సుముఖి ముఖశోభలో దీని సుషమ యెన్నవవంతు. నిర్మలచంద్రికా ప్రసారముచే ధగద్ధగితములగు కృష్ణాతరంగ పరంపరలు నిత్యమువలె నేఁడు నన్నలరింపఁ జాలకున్నవి. ఈ మృదు సురభిళ వాతపోతములు నా గాత్ర తాపము నుడుపఁజాలకున్నవి. ఆ సింహకిశోరమధ్య నింకొక సారిచూచుట ఘటించునా?

ఓహో! నామానస మెంతదూరము పరుగెత్తినది. ఆకన్యకామణి చిత్తమెట్లున్నదో? నిశుంభుని తలంపేమో? రిత్తకోరికలు చేకెత్తనావంటివాడు త్తలపాటునొందుట యుక్తముకాదు.

ఇట్లు తలంచి యా రాజపుత్రుఁడు నిసర్గ ధైర్యగరిమచే జిత్తము పరాయత్తము కాకుండఁ జిక్కఁబట్టి శయనించెను.

అన్యాసంగ వికృతిదర్శనముచే నీర్ష్యవహించినదో యనునట్లు నిద్రాదేవి చిరకాలమునకుఁగాని యాతనిఁ జేరరాదయ్యెను.

రాత్రి గడచినది. తెల్లవాఱినపిమ్మట నిత్యకృత్యములు దీర్చికొని విష్ణుదేవుఁడు రాజకార్య సమీక్ష చేయుచుండ వజ్రధరుఁడాతనికడ కరుగుదెంచెను. 'ఆర్యా! ఏమివిశేష' మని యతఁ డాతని నడిగెను. కృష్ణాతీరమునందలి మఱికొన్ని గ్రామములందలి జనులు మన యుద్యమమునఁ బాల్గొన దలఁచినట్లు వార్తవచ్చినది; నేనచటికిఁబోయి తగినయేర్పాటు చేసివచ్చెద నని వజ్రధరుఁడు తెలిపెను. విష్ణుదేవుఁడు సమ్మతించెను. వజ్రధరుఁడు తగుసన్నాహముతో బయలుదేఱి వెళ్ళెను. అతఁడు వెళ్ళిన కొంతసేపటికిఁ బూర్ణభద్రుఁడువచ్చి ప్రభు సందర్శన మొనర్చెను. ఉచిత మర్యాదలు జరిగిన తరువాత 'రత్నసాను పురమునకు బోయివచ్చితివా?' యని రాజేంద్రుఁడడిగెను.

పూర్ణ:— దేవర సెలవుదీసికొని సాయుధులగు రక్షకభటులతో నెఱ్ఱపాలెమున కేగితిని. గురునాథుని గలిసికొని ప్రభువు నానతి నెఱింగించితిని. అతఁడిట్లు చెప్పెను. పూర్ణభద్రా! నీకు వృథా శ్రమమైనది. రాజేంద్రుఁ డింటికిఁ బోయినరాత్రి నయ్యబలలకు ధైర్యముచెప్పి కావలసిన సదుపాయములు చేయ ననుచరుల నియోగించి వచ్చి శయనించితిని. తెల్లవాఱు నప్పటికి సేవకుఁడొకఁడు వచ్చి యావనితల నెవ్వరో తీసికొనిపోయిరని చెప్పెను. ఆశ్చర్యముతో నేనచటికేగి చూచితిని. మన భృత్యుల కాళ్లు చేతులు బంధింపఁబడి యుండెను. మాటాడకుండ నోటి గుడ్డలు క్రుక్కఁబడెను. వారి యొడళ్లు పరవశములై

యుండెను. బంధవిముక్తి చేయించి యడుగఁగా వారు
చెప్పినదిది: ఒకరాత్రి వేళ సాయుధులైన కొందఱాశ్వికులు
నిశ్శబ్దముగా వచ్చి తమ్ము బంధించి యయ్యబలలఁ దీసికొని
పోయిరఁట. ఆ వచ్చిన పురుషులతో నాస్త్రీలరమరిక లేక
వర్తించిరఁట. దీనినిబట్టి తదీయ బంధువులు వారిని గొని
పోయియుందురని నిశ్చయించుకొంటిని. అయ్యాశ్వికులు
నిశుంభుని సైనికులై యుందురు. వారట్లు దొంగతనముగాఁ
దీసికొనిపోవుటకుఁ గారణ మూహింపఁజాలనైతి. పోనిమ్ము.
మనకు శ్రమతప్పినది. దీన మనకుఁ బోయినదేమున్నది!
వారు తమ నైత్యమును వెల్లడించుకొనిరి. ఎంతచెప్పినను
వారు మనలను విశ్వసింపలేదని వ్యక్తమైనది.

పూర్ణభద్రుని మాటల నాంధ్రనాథుఁ డాశ్చర్యముతో
వినుచుండెను. కొంతసేపటివఱకు నాతనికి నిశ్చితాభిప్రాయ
మేదియుఁ గలుగదయ్యెను. సాయుధభటులు నిశుంభుని సైనికులే
యైయుందురు. వారట్లు చోరకృత్యమునకుఁ బాల్పడవలసినంత
యావశ్యక మేమి సంభవించినది? గురునాథుని భృత్యులను
బాధించుటకు నా స్త్రీలెట్లు సమ్మతించిరి? పాలుపోసిన వారిని
రాల రువ్వుట భావ్యముకాదని వారికిఁ దోఁచదయ్యెనా? ఇది
నిశుంభుని పన్నుగడ యనుట సమంజసముగాఁ దోఁపకున్నది.
ఆతని యనుచరులు కితవులై యీ పని చేసియుందురు. నిజము
తెలిసికొని యాతఁడు సైనికులఁ గోపింపఁగలఁడు. మన మిప్పుడు
యథార్థ మెఱిఁగించుచు నిశుంభునకు జాబువ్రాయుట యుక్త
మేమో? వజ్రధరుఁడు వచ్చినపిమ్మట నాలోచించి తగునట్లు
చేయవచ్చును: పూర్ణభద్రా! నీవు పొమ్ము! వజ్రధరుఁడు
రాఁగానే యీ సంగతి నాతనికి విన్నవించి నన్నుఁ గలిసికొను

మని చెప్పుము అని పలికెను. పూర్ణభద్రుఁడు చిత్తమని వెడలిపోయెను. అతఁ డేగినపిమ్మట నా రాజన్యుఁడు కాఁగల కార్యజాతమును గుఱించి యించుక యోచించెను. ఒకవేళఁ జెప్పుడు మాటలకుఁ బ్రియుఁడై నిశుంభుఁడు విరోధమేపాటిం చిన నాతని వధించి సామ్రాజ్యలక్ష్మితో దత్కన్యారత్నమును గూడ వరించెదఁగాక యని నిశ్చయించుకొనెను. ఆపస్తంబుఁడు కాలకేతువును జేరఁదీసి యాతనియిష్టము సమకూర్ప నున్నాఁడు గదా! నిశుంభవధ యవశ్యము భావ్యమని యా ఋషిసత్తముని యుద్దేశమైనట్లు మొన్ననాతని వచోధోరణి వ్యక్తము చేసినది. పిత్రాదేశము, ఋషిసమ్మతి, ప్రజాభీష్టము, దేశశాంతి సమ కూర్చుటకుఁ జేయఁబడునది కావున నీ యుద్ధము ధర్మయుక్తమై హింసాఫలము నొసఁగదని నాయంతరాత్మ విశ్వసించుచున్నది. సమయము వచ్చినప్పుడు క్షత్రియుఁడు క్షాత్రమునవలంబింపక పోయిన ధర్మచ్యుతుఁ డగును. లోకసంరక్షణమే క్షాత్రమునకు ఫలము.

అధర్మమునుండి ధర్మమును కాపాడుటకే దైవము క్షాత్రమును సృజించియుండును. క్షాత్రములేనినాఁడు లోక పద్ధతి స్ఖాలిత్యమునకు గుఱియగును. ఎవరికి వారే పెద్దలగు దురు. అట్టి దుర్భరస్థితిని రూపుమాపుటకే కదా పిత్రాదులు పంకల్పించినది. గౌతమాశ్రమమునమునివర్యులకుఁ జేసినవాగ్దా నముకూడ విస్మరింపరానిది. మార్దవము సుఖప్రదము, ప్రమాదరహితమనుట సత్యమే. కాని యదియత్యంతమైనచోఁ బరిభవకారణ మగును. కావున నేనిత్తఱిక్షాత్రమునకు వెనుదీ యరాదు. సామాద్యుపాయములు సంపూర్ణముగా వమ్మైన పిమ్మటనే దండమునకుఁ గడంగవచ్చును. ఈ విషయమున భీమ

నాయకుని యభిప్రాయ మెట్లుండునో మరల నొకపరి తెలిసి కొనుటయు నావశ్యకమే. ముందుగా నిశుంభుని చిత్తవృత్తి యెట్లున్నదో గ్రహింపవలయును. సామరస్యమాతని యుద్దేశమైనచో సర్వము ననుకూలమే యగును. తండ్రితరువాతఁ దండ్రియంతవాఁడు వజ్రధరుఁ డేమనునో చూచినే కార్యనిర్ణయము చేయవచ్చు"నని యా రాజేంద్రుఁడు తలంచెను.

వజ్రధరుడు కార్యమును జయప్రదముగా నిర్వహించుకొని సాయంసమయమునకుఁ దిరిగివచ్చెను. పూర్ణభద్రుఁడాతని గలిసికొని ప్రభుని యాజ్ఞచొప్పున సర్వమునివేదించెను. వారిరువురు విష్ణుదేవుని జూడనరిగిరి. విష్ణుదేవుని మొగమించుక తీవ్రతవహించి యుండుట వారుగుర్తించిరి. వజ్రధరుని జూడగానే విష్ణుదేవుఁ డుచితమర్యాదలు నెఱపి ఆర్యా! వెళ్ళినపని యేమైనదని యడిగెను. "ఏమోయెట్లగును? అంతయు మనకు వీలుగానే యున్నది. నీవొక పర్యాయము వారికి దర్శనమిచ్చినచో వారి యనురాగ మినుమడించును" అని వజ్రధరుఁడు వచించెను.

విష్ణు:—పూర్ణభద్రుఁ డెల్లపాలెమువృత్తాంతము నెఱిఁగించెనా ?

వజ్ర:—తెలిపినాఁడు. దుష్టులు తమసహజ వక్రత్వమునే వెల్లడించుకొందురు.

విష్ణు:—ఇప్పుడుమనమావిషయమున నేమిచేయుట యుక్తము.

వజ్ర:—అంత తొందరపడి యేమియుఁజేయ నక్కఱలేదు. ఆ ముష్కరులవలన గురునాథునకెట్టి హానియు జరుగకుండఁ గాపాడవలయును. ఒకవేళ గురునాథుఁడే దొంగలగురువని

యా బుద్ధిహీనులు తలంచి యాటవికులఁ బురికొలిపినచో శాంతజీవనము చేయుచున్న గ్రామవాసు లలజడికిఁ బాల గుదురు.

విష్ణు:—అట్లైనఁ గొంత సైన్యము నెల్లిపాలెము ప్రాంతమున నిలుపుట మంచిది.

వజ్ర:—కాదు. అచ్చటిజనులనే సైనికులనుగా సిద్ధముచేయ వలయును. అప్పుడుకాని దేశము వీర్యవంతముకాదు. పూర్ణభద్రుఁడు కొంతకాల మెల్లిపాలెముననుండి ప్రజలకు శిక్షణ మొసంగును. ఏగ్రామమునకాగ్రామ మాత్మసంరక్షణ మేగాక సామ్రాజ్యరక్షణముగూడఁ జేయఁగలుగును.

విష్ణు:—అయినచో మన మాయుధసామగ్రిని బెంపొందింప వలయును.

వజ్ర:—ఇప్పటికాయుధములు వలసినన్ని యున్నవి. కాని ఇఁకనధికముగానాయుధసంపదను వృద్ధిపొందింప వలయును.

విష్ణు:—పూర్ణభద్రా! ఆర్యుని యభిప్రాయప్రకారము చేయుటకు నీకభ్యంతరమేమైనఁ గలదా?

పూర్ణ:—ఉత్సాహముతో నాపని నిర్వహించెద. దేవరసెలవే తడవు.

విష్ణు:—అయినచో నీవేగి ప్రయాణ ప్రయత్నమొనర్చుకొనుచుండుము.

పూర్ణ:—దేవరవారి చిత్తము.

పూర్ణభద్రుఁడు వెడలిపోయెను. వజ్రధర విష్ణుదేవులు కొంచెముసేపు నిశ్శబ్దముగా నుండిరి. కొంత తడవైన పిమ్మట

విష్ణుదేవుఁడు 'ఆర్యా! తనకుటుంబ మింటికిఁజేరిన పిమ్మట నిశుంభుని ప్రవృత్తి యెట్లుండెనో తెలిసికొనుట యావశ్యకము కాదా?' యనెను. వజ్రధరుఁడు "తెలియుట కేమున్నది! నీరు పల్లములోనికే ప్రవహించున ట్లల్పులబుద్ధి నీచతకే పాల్పడు చుండును. వారొనర్చినకృత్యమే దీనిని వ్యక్తముచేయుచున్నది. మీఁగాళ్ళు వాఁచుచుండ నద్దముతోఁ జూడవలయునా?" యని బదులు చెప్పెను.

విష్ణు:—నిశుంభుని యనుమతి లేకుండఁ దదనుచరు లీ యకృత్య మొనరించి యుండఁగూడదా? గొడవ గాకుండఁ దమవారిని దీసికొనిపోయి రాజసమ్మానము నొంద వారు వాంఛించి యుందురు.

వజ్ర:—కావచ్చును. రాజు వారిట్టి ఘనకృత్య మొనర్చినందులకుఁ దప్పక బహూకరించియే యుండును.

విష్ణు:—ఇది ఘనకృత్యమని నిశుంభుఁడు తలంచునందువా?

వజ్ర:— కుమారా! ఏలతలంపఁడు? దొంగలచే గ్రామములు దోఁచించు రాక్షసునకిది ఘనకార్యముగాఁ దోఁపదా? అంతటితోఁ బోయినమే లే. అతనికోధాగ్నిజ్వాలలెందఱిని జుట్టుముట్టునో చూచెదవుగాక!

వారిట్లు మాట్లాడుకొనుచుండఁగా నెల్లపాలెమునుండి వార్తాహరుఁడు వచ్చెనని దౌవారికుఁడు విన్నవించెను. శీఘ్రముగాఁ బ్రవేశింపనిమ్మని వారు వచించిరి. తత్క్షణమే వార్తాహరుఁడు వచ్చి నమస్కరించి విష్ణుదేవునెదుట లేఖ నుంచెను. దాని నాతఁడు చదువుకొని వజ్రధరుని కిచ్చెను.

వజ్రధరుఁడు సమగ్రముగాఁ జూచి "ఆశ్చర్య మేమున్నది. అనుకొన్నట్లే జరిగిన" దనెను. వార్తాహరునిజూచి "సరే మేము నా ప్రయత్నము మీఁదనే యున్నామని గురునాథు నితోఁ జెప్పుము. అణుమాత్రము సంచలింప నక్కఱలేదని తెలుపుము. నీవు వెంటనే బయలుదేఱి పొమ్ము. నీకంటె ముందుగానే పూర్ణభద్రుఁ డచటికి రాఁగలఁడు" అనిచెప్పెను.

విష్ణు:—ఆర్యా! ఈ జాబును బట్టి నిశుంభుఁడు గురునాథుని గుట్రదారులలో నొకనిగా నెంచియున్నట్లు స్పష్టమగు చున్నదికదా! జరిగినది జరిగినట్లుగాఁ దెలుపుచు నిశుంభు నకు మనమొక జాబువ్రాయుదము. మనము ఋజుమార్గము నవలంబించినను నాతఁడు తనపంథ మార్చుకొనక పోయినచో దుష్కృతఫల మనుభవింపఁగలఁడు.

వజ్ర:—దుష్టులకు నీతిబోధచేయుట కాఁగుచున్నతైలముపై శీతలోదకము చల్లుటవంటిది. అయినను నీమాట యేల త్రోసివేయవలయును? చెడినకాఁపురమునకు ముప్పేమి? జాబు సిద్ధముచేసెదను.

విష్ణు:—అట్లైన పూర్ణభద్రుని బంపవద్దని నా యుద్దేశము కాదు. దీనితెన్నున నిది జరుగవలసినదే.

వజ్ర:—అట్లైనఁ బూర్ణభద్రున కాజ్ఞాపత్రము వ్రాసిపంపుము.

విష్ణుదేవుఁడు సత్వరముగా నొక పత్రమువ్రాసి వార్తా హరునకిచ్చి 'యిది మా సేనానాయకునకిమ్ము! అతఁడు చెప్పి నట్లు చేయు'మని యాతనిఁ బంపివేసెను. వజ్రధరుఁడు నిశుంభు నకు జాబువ్రాసెను. కుమారా! వినుము. ఇంకేమైనఁ జేర్ప వలసినచోఁ జేర్చెదనని యిట్లు చదివెను:

"శ్రీ రత్నసాను దుర్గాధినాథుఁడగు నిశుంభమహారాజు నకుఁ గాకులప్రభువు సుచంద్రకుమారుఁడు సుహృద్భావ పురస్సరముగా వ్రాయు క్షేమసమాచారము. కొలఁది దినముల క్రిందటఁ గార్యాంతరముపై మే మెల్లపాలెము పోయియుంటిమి. అప్పుడు సింహాళమునుండి వచ్చుచు మీయంతఃపురస్త్రీలు దస్యులవలన గాసినొంద నాగ్రామణి వారిని సగౌరవముగా రక్షించుట మేము చూచితిమి. వారిని భద్రముగా నింటికిఁ జేర్చుట కాతఁడు మాసాహాయ్యము వేఁడగాఁ గొందఱసాయుధ భటులను బంపితిమి వారు గురునాథుని గలిసికొనుటకుఁ బూర్వమే మీ యాశ్వికదళ మొకటి వచ్చి కావలివారిని బంధించి దొంగతనముగా మీయంతిపురమునకు దోడ్కొని పోయెనఁట. సురక్షితముగా మీకుటుంబ మిల్లు చేరినందులకు మాసంతోషమును దెలుపుచున్నారము.

మీ సైనికు లపమార్గము నవలంబించినందులకు వారిని మీరు కోపించియుందురని తలంచితిమి. ఇప్పుడు గురు నాథునకుఁ బంపిన సందేశమునుబట్టి వారి యవినీతిని మీరు గ్రహించి యుండ లేదని తెలిసికొని యథార్థస్థితి మీకెఱుక పరచుటకై యీలేఖ వ్రాసితిమి. ప్రజాపీడచేయు నాటవికుల విద్రోహులనుగా భావించుట, వారిని నయమున భయమున సాధు మార్గావలంబుల నొనర్చుట మనకందఱకుఁ గర్తవ్యమే. ఏపాపమెఱుఁగని పైగా నుపకారియైన గురునాథుఁడు ద్రోహు లతోఁజేరి మీపై గత్తికట్టుచున్నాఁ డనుకొనుటయు, శరణు వేఁడు మనుటయు నెట్టి యకార్యమీ ప్రాజ్ఞులగు మీకు వివ రింప నక్కఱ లేదు.

ఆటవికుల మదమడంచి దేశమున శాంతిస్థాపన చేయుటకు మావలె మీరు నిచ్ఛగింతురేని మన మందఱమొక సమితిగాఁ జేరి యాంధ్రదేశ మొకేగూడుగునీడ సుఖించునట్లు చేయవచ్చును. ప్రజాక్షేమమే ప్రధానలక్ష్యముగాఁ గొన్నచో మనకది దుస్సాధ్యముకాదు. ఆ విషయమై ముఖాముఖిని గాని రాయబారుల ముఖమునఁగాని సంప్రతించుట మీకభిమతమేని మేము సిద్ధముగా నున్నారమని ప్రణయపూర్వకముగా హృదయమిచ్చి చెప్పుచున్నాము. దేవుఁడు సద్దేశమునకు తోడ్పడ మొసఁగుఁగాక".

విష్ణుదేవుఁడంతయు సావధాన మనస్కుఁడై యాలకించెను. "అన్ని విషయములను కూలంకషముగా వివరించితివి. ఇఁకనేమియుఁ జేర్పనక్కరలేదు. నిశుంభుఁడు దీనికి సుముఖుఁడుగానిచోఁ దప్పక హతుఁడగును" అనుచు నందుఁ దన హస్తాక్షరిలిఖించెను. "పురుషకారము మనపని. పర్యవసానము దైవాధీనము" అని చెప్పుచు వజ్రధరుఁడు జాబు నందుకొని మడఁచెను. దీనినెవరిచేతఁ బంపుదమని యాంధ్రనాయకు డడిగెను. పూర్ణభద్రుని సోదరుఁడు మణిభద్రుఁడిందులకుఁ దగినవాఁడని వజ్రధరుఁడు వచించెను. అంగీకార సూచకముగా విష్ణుదేవుఁడు తలయూచెను. తత్క్షణమే యతనిఁ రావించి చేయవలసిన దంతయు నెఱిఁగించి 'మణిభద్రా! పోయి కార్యము పండించుకొనిర'మ్మని వజ్రధరుఁడు పలికెను. మణిభద్రుఁడు వజ్రధర విష్ణుదేవులకు నమస్కరించి యుత్తమాశ్వము నధిరోహించి వాయువేగమున రత్నసాను నగరాభిముఖుఁడై యేగెను.

---

# తొమ్మిదవ ప్రకరణము

రత్నసానుపురము రమణీయమైన దుర్గము. అది సర్వ సంపదలచే సమృద్ధమై యుండెను. చుట్టును సాంద్రములైన యరణ్యపంక్తులు కనుచూపు దూరము వ్యాపించి యున్నవి. ఆ కొండదారులలో నేది సరియైనమార్గమో తెలిసికొనుట కష్టము. అపరిచితు లా పురమును బ్రవేశించుటకు తబ్బిబ్బు పడకమానరు. నిర్మాణసౌష్ఠవముకంటెఁ బ్రకృతిశోభ యా నగరమున కెక్కువ వన్నె తెచ్చుచుండెను. రాజసౌధ మున్నత మైన పర్వతశిఖరమున నిర్మితమై యుండెను. తెల్లని సున్నపు బనిచే శోభిల్లు సౌధోపరిభాగము కైలాసనగమును స్మరింపఁ జేయుచుండును. రాజోపచారముల కనువగు సకలవస్తువులు నందు సర్వసిద్ధముచేయఁబడియుండెను. మేలిరకపు మేలికట్లు, చిత్రవిచిత్రములగు జవనికలు, రవము తెపుజాలరులతో నొప్పారు హంసతూలికా తల్పములు, జీవకళ యుట్టిపడునట్లు చెక్కఁ బడిన రత్నపాంచాలికలు, శుక శారికా మరాళముఖరితములగు సువర్ణపంజరములు, శీతలబిందు నిస్యందముగల జలయంత్ర ములు, ప్రత్యగ్ర పుష్పవిరాజమానములగు పూఁజప్పరములు సకలేంద్రియసుఖావహములై యుండెను. ఆసౌధరాజమున నొకగదిలో నిలువుటద్దము నెదుటనిలచి వసుంధర యలంక రించుకొనుచుండెను. ఎంతదిద్దుకొన్న నామెకుఁ దృప్తి జనించుట లేదు. అప్పుడే వికసించిన పూవులు, నీడనీరార్చిన చిగుళ్లు, సువర్ణాభరణములు యథాస్థానముగా నైసేసెను. ఆమె సుందర సుకుమారరూపము వసంత వనదేవతాకుమారికయాకృతి

నధఃకరించి యుండెను. ఒక్కసారి మరల నిలువుటద్దమునెదుట నిలిచి నిదానించుకొనెను. ఆయమ కాత్మసంతృప్తి కలుగలేదు. "అపర్యాప్తము! ఏమికారణము! ఓహో! తెలిసినది." అనుకొని పులుగడిగియుంచిన శిరోభూషణము ధరించెను. ఆరత్న ప్రభ వినిర్మల దర్పణప్రతిఫలితమై సౌధాంతరమున సౌదామినీ రుచుల వెదచల్లెను. వసుంధరాదేవి మరల నాత్మసౌందర్యమును విమర్శించుకొనెను. ముఖాంబుజమున నూతన వికాసము తాండవ మాడుచుండెను. ఆప్రతిరూప మప్పుడే పాతాళమునుండి వెడలివచ్చిన నాగకన్యకవలె మెరసెను. 'నేనా మహాపురుషునకు, ఆసుకుమార మూర్తికి, ఆ మారసుందరునకుఁ దగుదునా?'యని యామెతలంచెను. 'తగుదువు! నిశ్చయముగా తగుదు!' వని నిశ్శబ్దమైన యా సౌధాంతరమున నొక గవాక్షముచాటునుండి సన్నని మెలుంగు వినవచ్చెను. ఆరాజపుత్రి యించుక సంభ్రాంతయై 'యెవరక్కడ' నని తటాలునఁ బోయి పరికించెను. ఎవ్వరును గనఁబడరయ్యెను. గవాక్షసమీపమున వ్రేలాడు పంజరమున డెల్లచిలుక ముదితహృదయమై కనవచ్చెను. దాని కెదురుగానున్న సువర్ణపంజరమున శారిక స్మేరాననయై యుండెను. తానువిన్నది చిలుకపలుకని నిశ్చయించుకొని వసుంధర కుతూహలముతో 'ఏమంటివి? ఎంత ప్రియవాదము! ఎట్టి సమయోచితి? మంచి యుపశ్రుతి. మరల నొకసారి చెప్పు' మనెను. ఆ శుకరాజము విస్ఫారిత నయనములతో గోరువంక వంకఁ దిలకించెను. శారిక వ్రీడావినమ్రవదనయై ముక్కుతో రెక్కలు సవరించుకొనెను. ఇంతలో పదుగులచప్పుడు వినవచ్చెను. ఎవ్వరోయని చూచుచుండఁగనే

మల్లిక యచ్చటికివచ్చి 'సఖీ! ఒంటరిగా నిందేమి చేయుచుంటివి?'

వసుం:—ఈ శుకశారికలతో వినోదించుచున్నదాన.

మల్లి:—నీకోరిక సిద్ధించుఁగాక!

వసుం:—నే నేమి కోరితిని?

మల్లి:—ఊరకే యీశుకశారికలను జూచుచున్నావా? అట్లే నీవును—

వసుం:—నీవేమో క్రొత్తగా మాటలాడుచున్నావు.

మల్లి:—సఖీ! నీవన్నది కాదనను. నామాటలు నీకు క్రొత్తగాఁ దోఁచవచ్చును. కాని యీ వేళ నాకు నీవే పూర్తిగా క్రొత్తగాఁ గనఁబడుచున్నావు! ఏమి యీ విశ్రృంఖల శృంగారము! దీనిని జూచి యానందించుటకు లోన నెవరైన నున్నారా?

వసుం:—మల్లికా! నీ విట్టిమాట లాడవచ్చునా? ప్రాణమని నమ్మిన నీ విట్టి యసందర్భప్రలాపములా?

మల్లి:—(కరస్పర్శ చేయుచు) సోదరీ! నేనేమియు నసంబద్ధముగ ననుటలేదు. ఇచ్చట నెవ్వరు లేరుగదా! నాతో నేల చెప్పవు? నీ మనసులో నెవ్వఁడైన నున్నాఁడా యని యడుగు చున్నాను.

వసుం:—ఎవ్వరుందురు?

మల్లిక:—మీ బావ!

వసుం:—మీ బావ!

మల్లిక:—కాదు. నీకే బావ.

వసుం:—కాదు. నీకే బావ.

మల్లిక:—పరిహాసముల కేమి గాని యొక్కటి యడిగెదను. మర్మమువిడిచి చెప్పెదవా!

వసుం:—అడుగు! చిన్నప్పటినుండి మాయ మర్మము లెఱుఁగని నేను క్రొత్తగా నేఁడు నేర్చుకొందునా?

మల్లి:—చిన్నప్పటిదారి వేఱు. వనలతలకుఁ గాలమురాఁగానే వసంతుఁ డాచార్యక మొనర్చినట్లే వయసు రాఁగానే మదనుఁడు మగువలకు గురుత్వము నిర్వహించు నందురు.

వసుం:—నీ కావిధముగాఁ జేయుచున్నాఁడేమో!

మల్లి:—నేనుమాత్రము నీవంటిదానను గానా? నాకును—

వసుం:—నీ వడుగఁదలఁచిన దేమో అడుగు! నన్ను విసిగింపకు!

మల్లి:—చెప్పెదనంటివే నడిగెదను. వృథా వాగ్వ్యయ మెందులకు?

వసుం:—సఖి! ఏల నన్ను నమ్మవు? నీతోఁగాక మఱియెవ్వరితోఁ జెప్పుదును? నీకంటె నాకాప్తు లెవ్వరున్నారు? తల్లియా? తండ్రియా?

మల్లి:—కన్నీళ్లు దుడుచుకొని వసుంధర కన్నీళ్లు తుడుచుచు దగ్గరఱగాఁ దీసికొని, సోదరీ! నీ వట్లనవద్దు! మహారాజు నీ ముద్దు చెల్లింపక యెన్నఁడు విడువఁడు. నీ విచ్చగింపని పని యొకప్పుడు చేయఁడు. నీ వేవిషయమున నెట్టి సంకోచము నుంచుకొనకుము. ఏది? యెప్పటి చిఱునవ్వుతో నావంకఁ జూడుము. నేను మాతండ్రి కొక్కతెనే కొమార్తెను. నీ యభీష్టమున కడ్డువచ్చు తృణమునైన వజ్రాయుధ

ముతో నటకుసట్లు మాతండ్రితోఁ జెప్పి చేయించెదను; నీ సుఖమునకు భంగము కలిగినచో యావజ్జీవము సన్యాసినినై యుందును.

వసుం:—అక్కా! ఎంతమాటంటివి? నీకు నాయెడ నంత చెలిమి కలదని నే నెఱుఁగనా? ఏదో యడిగెదనంటివి? ఆ మాట మఱచిపోయితివా?

మల్లి:—అడుగుట కేమున్నది? నేఁడు నీ వింతగా శృంగారించుకొనుటకుఁ గారణమేమని యడుగఁదలఁచితిని. నీ కిష్టమైనఁ జెప్పవచ్చును. నిర్బంధము లేదు.

వసుం:—ఈ వేళ నా శిరోరత్నమును బులుకడిగితిని. పోయి లభించినదనెడి యుత్సాహము జనింప దానిని మన్నించుటకై యిట్లు చేసితిని. అంతకంటె నేమియు లేదు.

మల్లి:—దానిని మన్నించుట యనఁగా—

వసుం:—(వ్రీడా వికసిత వదనయై యంగదము లవలోకించుచు) దానిని మన్నించుటే!

మల్లిక:— సఖి! చెప్పకున్నను నాకుఁ దెలిసినది. ఆనాఁడే నాకు గోచరమైనది. శిరోమణినిమన్నించుటయనఁగా దాని నొసంగిన నాయకశిరోమణి నన్నుమాట. ఔనా?

వసుం:— (ఇంచుక సేపు లజ్జావనతవదనయైయుండి) కిరీటము వంటి యీ యాభరణము నొసంగిన యా మహాపురుషుని మన్నించుట తప్పిదమగునా?

మల్లి:— తప్పిద మేమియు లేదు. ఆమహానీయునియెడఁ గృతజ్ఞురాలవై యుండుమనియే నేనును బ్రోత్సహించుచున్నాను.

వసుం:— కృతజ్ఞత గలిగి మనమేమిచేయగలము ?

మల్లి:— చెలీ ! కృతజ్ఞతకుసాటి కృతజ్ఞతయే. అదియమూల్య మైనది. తక్కిన వన్నియు దాని వికారములు; పరిణామములు; పరిపాకములు.

వసుం:—(నెమ్మదిగా) నేనంతటి యదృష్టము నోఁచిపుట్టవద్దా!

మల్లి:—నోఁచియే పుట్టితివి. సందేహము లేదు. నిన్నుఁ జూడఁగానే యారాజకుమారునకు భావోదయమైనట్లు నాకుఁ బొడకట్టినది. అనురాగభరితములైన చూపులు, భావగర్భితములైన మాటలు, స్వేదలవ సమలంకృతములైన యంగకములు నాతలఁపును దృఢపఱచినవి. అవకాశము లేక నేఁటివఱకు నాప్రసక్తి తేనైతిగాని, విధాత మీయిరువురకు దాంపత్యము సంఘటించి యుండెనని నాఁడే నిశ్చయించుకొంటిని. మహానదిని సముద్రముతోఁ జేర్పనిచో విరించి లోకనింద భరింపఁ గలడా ?

వసుం:— అందనిపండ్లకఱ్ఱులు చాచుచుంటినని సంకోచించుచున్నదానను.

మల్లి:— అట్లు సంకోచింపకుము. కోడికూయఁగనే యంధకారము తొలఁగునా ? కొంతతడవునకుఁగాని మార్గము గోచరింపదు.

వసుం:— ఔనుగాని—ఏమమ్మా! మనల నట్లు దయజూచి మన్నించిన గ్రామాధికారి నవమానపఱచి యిట్లు తెచ్చుట నీకు నచ్చినదా?

మల్లి:—ఎవరికిని నచ్చలేదు. అసహాయస్థితిలో నుండుటచే బావనుజూడగానే అత్తకు మాయమ్మకు ప్రాణములు లేచి

వచ్చినవి. గొడవకాకుండ యింటికిఁ జేరుకొనుటే వారు చూచిరి.

వసుం:—అయినను వారితోఁ జెప్పవచ్చిన నేమి ప్రమాదము? నూఱుగురాశ్వికులు తోడున్నవారే? మీ బావ ఎంతటి శూరుఁడు. పైఁగాఁ గావలివారిని బంధించుటయా?

మల్లి:—బావ యీ దేశమునకుఁ గ్రొత్తవాఁడు. పైఁగా నచ్చట జరిగిన సభావృత్తాంతమును మాయత్త యాతని కెఱిఁగించినది. ఏదైన వికటించిన మన కది విదేశము. వారికి స్థానబల ముండును. వేగిటువడిన ప్రాణములగుటచే నెట్లో యిల్లు చేరుకొన్నఁదరువాతఁ జూచుకొనవచ్చునని యత్తయెక్కువ తొందరపెట్టినది. ఆబిడమాట మాయమ్మ త్రోసివేయఁ జాలకపోయెను. అనుభవము చాలకపోవుటచే బావయు దానికి సమ్మతించెను.

వసుం:—మనమెంత సమర్థించుకొన్నను వైవారికది నీచతగా దోఁపకపోదు. అట్లుచేయుట మహారాజు ప్రతిష్ఠకు భంగము కాదా?

మల్లి:—చెలీ! అవి రాజకార్య విషయములు. వారే సమర్థించుకొందురు. మన కేల యీ విచారము?

వసుం:—రాజకీయముగా నేను మాటాడలేదు. నైతికముగాఁ జెప్పితిని. అంతవఱకు మానవమాత్రులకుఁ గావలసినదే కదా!

మల్లి:—రాజనీతి పెక్కువంకరలు గలది. కోవిదులకే తెలియదు. ముగుదలకు మనకు బోధపడునా?

వారిట్లు సంభాషించుచుండ 'మల్లికా?' యని కేకవినఁబడెను.

'అమ్మపిలుచుచున్నట్లున్నది. ఇప్పుడేవచ్చెదనని'మల్లికచెప్పి మెల్లగా వెడలిపోయెను. వసుంధర తనగదిలోఁ బ్రవేశించి యుత్తమాసనమున నాసీనయయ్యెను. ఆమెదృష్టి యథాలాభముగా నెదుటనున్న చిత్రపటములపైఁ బ్రసరించెను. అశోకవృక్షము క్రింద రాక్షసస్త్రీల నడుమ శోకనిమగ్నయయ్యుఁ బాతివ్రత్య మహిమచే నగ్నిశలాకవలె మెఱయుచున్న జానకి కామె సమస్కరించెను. త్రిమూర్తులను శిశువులంజేసియాడించుచున్నయనసూయకామె మ్రొక్కెను. పాంచాలిని బరిభవింపఁ బోయి ప్రభాకర ప్రేషితుఁడైన రాక్షసునిచే గొట్టఁబడిన కీచకునిజూచి మానవతుల నవమానింపఁ బోవు గుణహీను లగచాట్లు పడకుందురా యని యాకోమలి భావించి దరస్మిత మొనర్చెను. ఇంతలో నెదుటబల్లమీఁద నుంచఁబడియున్న వీణ యామె దృష్టి నాకర్షించెను. 'మల్లిక వచ్చువఱకు దీనితోఁ గాలక్షేప మొనర్చెద' నని దానినందుకొని చక్కఁజేసి మనోహరముగా మోహనరాగ మాలాపింపఁ దొడఁగెను. వీణానినాదమిళితమై యా పికవాణి పంచమస్వరము గవాక్షరంధ్రముల వెలువడి మలయసమీరణ తరంగపరంపరలచేఁ బ్రక్కనే యుపవనవిహార మొనర్చుచున్న మణినాగుని శ్రుతిసీమఁ జేర్పఁబడెను. శ్రవణరసాయనమగు నా గానము వీనులవిందుగా వినఁగోరి యాతఁడు వెంటనే యాసౌధరాజ మధిరోహించెను. ఒంటరిగాఁ గూరుచుండి స్వేచ్ఛగాఁ బాడుచున్న యారాజపుత్రి సౌందర్యమునువిలోకించి మణి

నాగుఁడు ముగ్ధుఁడై యించుకసేపు నిశ్చేష్టత వహించెను. 'దేవుఁడునన్నెంత యనుగ్రహించినాఁడు. ఒంటరిగానీమెతో ముచ్చటించి యానందింపవలెనని చిరకాలమునుండి కోరుచున్న నాకోరిక సఫలమగుటకు నేఁడవకాశము కల్పించెను. ఆహా! ఏమిచక్కఁదనము? ఎన్నిపర్యాయములు చూచిన నెప్పటికప్పుడు క్రొత్తగాజూచినట్లు నాహృదయ మున్మేషము గాంచుచుండును. అందును నేఁ డీమె విలక్షణ విలాస భాసురమై కనఁబడుచున్నది. ఒక్కసారిపోయి తనివితీర ముద్దాడెదను. (పోఁ బోయి) ఏమి? నిశుంభనృపాలుఁ డీమెను నాకొఱకు మీఁదుకట్టి యుంచెనని యెటేఁగియుఁ బ్రదీప్తమగు నగ్నిశిఖనువలె స్పృశించుటకు మనసుజంకుచున్నది. అట్లుకాదు. వెనుకనుండిపోయి కన్నులు మూసి పరిహాసించెద. అట్లుచేయుటయు రసభంగముగానే తోఁచుచున్నది. ఆపాట పూర్తియగువఱకు నీమె ముఖాంబుజమును గన్నులారఁ జూచుచు నానందించెద. ఎంతదుర్భరము. ఒక్క నిమిషమైన నిఁక నిలువఁజాల! ఏమైననుసరే! ఒక్కసారి గట్టిగాఁ గౌఁగిలించుకొని సుఖించెద' నని నిశ్చయించుకొని యామెను సమీపించెను. వసుంధర పాటచాలించి 'ఓహో మణినాగుఁడా! రమ్ము! కూర్చుండు'మని యాసనము చూపెను. అట్లుచేసి

మణి:—మాని వేయుదువేమి! పాట వినవలయుననియే వచ్చితిని. పాడు!

వసుం:—ఏదో! తోఁచనపుడు కాలక్షేపము.

మణి:—నీకింతటి గానకౌశలమున్నదని యింతకుముందెఱుగను—

వసుం:—ఎటులఁగవా? సింహళమున నొకనాఁడు మీయమ్మ ముచ్చటపడఁగా నేను, మల్లిక పాడితిమికాదా?

మణి:—ఔను మఱచితిని. ఆవేళ మీరిరువురు పాడుటచేఁ బ్రత్యేకించి నీనేర్పు నాహృదయమున కెక్కలేదు. ఈ వేళ నిన్నుఁజూచిన నీగానము విన్న నాకు మితిలేని యానందము కలుగుచున్నది. కారణము నిరూపింపఁ జాలకున్నాను.

వసుం:—ఏమికారణము కావలయును? నీమనసున బంధుప్రేమ తోఁలఁకాడు చుండును.

మణి:—చక్కఁగా జెప్పితివి. నాకు మొదటినుండియు బంధుగులన్న స్నేహమెక్కువ. నాఁడు దొంగలు కొట్టినప్పుడు మిమ్మెంత చాకచక్యముతోఁగాపాడితిని. మీకేమియుఁ బ్రమాదము లేకుండఁజూచుకొనుచుఁజోరులవీఁచమడచితిని.

వసుం:—(నవ్వాఁపికొనుచు) కాదా మణి. ఔనుఁగాని మహారాజాశ్వికదళము తోడిచ్చెఁగదా? మమ్మట్లు దొంగతనముగాఁ దెచ్చితివేమి?

మణి:—అందులోనే యున్నది రాజనీతి; కిటుకు. దానిని గ్రహించియే మీతండ్రి నాకీ వజ్రపుటుంగరమును బహుమానముగా నిచ్చెను. ఇదిగో చూడుము! (లేచిసమీపింపఁ బోవుచున్నాఁడు.)

వసుం:—(వారించి) బాగుగానున్నది. కూర్చుండుము. తగిన మర్యాద జరిగినది.

మణి:—వసుంధరా! నీనిమిత్తమె నే పడ్డపాటునకు నీవు కృతజ్ఞతచూపవా?

వసుం:—చూపకేమి? మహారాజుతోఁ జెప్పి నీకింకను గొప్ప బహుమాన మిప్పించెదను.

మణి:—ఇంతమాత్రమునకు మహారాజుతోఁ జెప్పవలయునా? ఒక్కసారి నావంక దయతోఁజూచి చిరునవ్వునవ్విన నఁ గృతార్థుఁడ నగుదును.

వసుం:—మణినాగా! ఏల యట్లనుచున్నావు? నేను నవ్వుచునే మాట్లాడుచుంటినిగదా?

మణి:—అయినచో నేది యొక్కసారి యా నగుమొగము ముద్దాడనిమ్ము! (లేచి సమీపింపఁబోవును.)

వసుం:—(అదలించి) ఏమి? ఎన్నఁడు లేని యీ సాహసము. ఎవరితోనో యెఱిఁగి మాటాడుచున్నావా?

మణి:—(ఇంచుక జంకి) ఎఱుఁగ కేమి? నీవు రత్నసానుదుర్గాధీశ్వరుని ముద్దు పట్టివి. నేను సింహళద్వీపాధిపతి పెద్ద కుమారుఁడను. మీతండ్రి నాకు మేనమామ. మన దాంపత్య ముభయుల పెద్దలకు నభిమతము. నీవేల సంశయించెదవు?

వసుం:— మణినాగా! అసందర్భపుమాట లాడకుము. మీయమ్మ గౌరవము నెంచి సైరించితిని. పొమ్ము! ఆవలకుఁ బొమ్ము!

మణి:—రాజపుత్రీ! నీవింత కఠినముగా మాటాడుదువని యెన్నఁడనుకొననైతి. నాపై దయ లేదా?

వసుం:—దయయుండుటచేతనే యిట్లూరకుంటిని. అంతరువు లెఱుఁగక వదరుట నీకు దగునా?

మణి:—అయినచో నామీఁద నీకుఁ బ్రేమ లేదన్న మాట.

వసుం:—నీ వనుకొనుచున్నట్టి యా పాడుప్రేమ లేదని నిశ్చయముగా నమ్ముము.

మణి:—నిశ్చయముగా —

వసుం:—ముమ్మాటికి —

మణి:—సింహళములో సౌధోపరిభాగముతుంగీ సముద్రమును జూచుచున్నప్పుడు 'బావా! నీవాసముద్రుఁడవు; మేమా తరంగముల' మని మల్లిక చెప్పినమాటలు జ్ఞప్తియందున్నవా?

వసుం:—లేకేమి? మనస్సు మోహదూషితమై యున్నందున నిర్మలమైన ప్రేమస్వరూపము నీకు గోచరము కాదు. పరిశుద్ధమైన బంధుప్రేమ నీయెడ నాకిప్పుడు నున్నది.

మణి:—ముఖముమీఁదఁ గఠినోక్తులాడుట ప్రేమలక్షణమా!

వసు:—ప్రేమస్వరూపము నీకు గోచరింపదని తెలిపితినిగాదా? మూఢాత్ములు మోహమే ప్రేమయని భ్రమింతురు. మోహము సవ్యాజము. ప్రేమ నిర్వ్యాజము. మోహము సకారణము. ప్రేమ నిష్కారణము. మోహము భ్రాంతి విలసితము. ప్రేమ జ్ఞానవిలసితము. మోహము దుఃఖ హేతువు. ప్రేమ యానంద హేతువు మణినాగా! నీవు మోహము నవలంబించి చెప్పుచున్నావు. నేను ప్రేమ నవలంబించి చెప్పుచున్నాను. కావున నిటనుండి నెమ్మదిగా వెడలిపొమ్ము!

మణి:—అంత సందిగ్ధముగా వచించెద వెందులకు? ఇచట నెవ్వరు లేరుకదా! నీమీఁద నాకుఁ బ్రేమ యున్నది. ఇది

సమయముకాదని నీ యాశయమా? అట్లైనచో నిది సమయమే! మనము మాటలధోరణిని గ్రహింపఁజాలమైతిమి. చూడుమెంత ప్రొద్దుపోయినదో? రత్నదీపములు తేజః పుంజముల నీనుచున్నవి. వలరాజు మేనమామ అల్లదె చందమామ నీముఖమున కోడికావలయు జెట్లచాటునుండి నెమ్మదిగా లేచుచున్నాఁడు. ప్రేయసీ! ఇంక నన్నల యింపకుము. ఒక్కసారి నీముఖ చంద్రబింబమును—

వసుం:—(తనలో) వీనికి వెఱ్ఱి తలకెక్కినది. నామాటల కపారముకల్పించుకొని యున్మత్తప్రలాపము చేయుచున్నాఁడు. (ప్రకాశము) రాజపుత్రుఁడవగు నీ వనుచితవాక్యము లాడఁగూడదు. నామాటవిని నెమ్మదిగా వెడలిపొమ్ము!

మణి:—పోనిమ్ము! ఒక్కమాటకు సమాధాన మిమ్ము! దానితోఁ దృప్తిపొందెదను. నన్ను నీవు వరింతువా?

వసుం:—ఎన్నటికి వరింపను.

మణి:—మీతండ్రి నాకిచ్చి వివాహము చేయుట కంగీకరించినచో—

వసుం:—ప్రాణత్యాగము చేసెదనని ఖండితముగాఁ దెలిపెదను.

మణినాగుఁడు తెల్లపోయెను. ఒడలు జల్లుమనెను. బుసకొట్టుచున్న ఫణాధరకన్యకవలె యామె వానికంటికి భయంకరమై కానిపించెను. తన్నణుమాత్రము నామె ప్రేమించుటలేదని నిశ్చయించుకొనెను. కొంతసేపటికి మాట తెమల్చుకొని అంత నిర్దయవహించుటకు నేఁజేసిన యపరాధమేమి? యని యడిగెను.

వసుం:—నాకుఁ దెలియదు. దైవము నడుగుము.

**మణి:**—నీకుఁ దెలిసినంత చెప్పఁగూడదా ?

**వసుం:**—మణినాగా ! ప్రేమ యతిపవిత్రమైనది. మోహాము వంటిదిగాదు. ఎవరి కెవరిమీఁద ననురాగము జనించునో యెవ్వ రెఱుఁగుదురు ? అది దైవరహస్యము. దమయంతి యింద్రాదులను తృణీకరించి నిషధేశ్వరుని వరించినది. ప్రేమ మోహామువలెఁ జంచలము, కృత్రిమము కాదు. చాపల్యము, ప్రలోభము దానిని సమీపింపఁ జాలవు. కావుననే పెద్దలు తారామైత్రిక మందురు. అది వలదన్న నుడుగదు; వలయునన్నఁ గలుగదు. నీ వీ సత్యమును గ్రహించి చిత్తనైర్మల్యముఁ బొందుము. నిర్మలచిత్తులకు దోషము లంటవు. దోషదూషితముగాని దృష్టికిఁ బ్రపంచమునం దంతట ప్రేమ, శాంతి గోచరించుచుండును. మలినమైన యద్దమునఁ దోఁచు ప్రతిబింబము మలినమై కానవచ్చునట్లు మోహాదుష్టచిత్తులగు వారికిఁ బ్రేమ భోగేచ్ఛగాఁ గనఁబడును.

**మణి:**—వసుంధరా ! ఇంతవఱకు నిన్నొప్పింప వలయునని యోర్చితిని. ఇఁక నిమిషమైనను సహింపఁజాలను. నిన్నర్థించువాఁడు సింహళద్వీపాధినాథుని తనయుఁడు; రత్నసానుపురాధీశుని మేనల్లుఁడు; కాఁగల సార్వభౌముఁడునని గ్రహింపజాలవైతివి. అతివినయ మవజ్ఞాకారణమని చెప్పుదురు. నాసామర్థ్యము నిప్పుడైన గ్రహించి యాదరింపుము. నీ వనుమతి చేయకున్నను బలాత్కారముననైన నాయభీష్టమును నెఱవేర్చుకొనక మానను. నన్నుఁగాదని నీకుఁదోడ్పడువాఁ డిందొక్కఁడును లేఁడు.

వసుం:—ఏమంటివి? ఉత్తమక్షత్రియజాతికన్యక నవమానించుటకు నీవెంతటివాఁడవు? పల్లెటూరికాఁపు పరివారమును బంధించుట యనుకొనుచున్నాఁడవు కాఁబోలును. (చివాలునలేచి యాసనమును వెనుకకుఁద్రోయుచు వీణాదండమును బట్టుకొని) నీవిప్పుడే యీయావరణముదాఁటి పోవేని తలపగులఁగొట్టెదను. ఛీ! నీచుఁడా!

ఆమె రౌద్రాకారమునుజూచి మణినాగుఁడు చకితుఁడయ్యెను. ఆసమయముననే పంజరములోని చిలుక జయము! జయము! అని గంభీర నినాదమున నఱచెను. అదివిని రాజపుత్రి "అదిగో! యీకీరము మాతండ్రి రాక సూచించుచున్నది. ఇప్పుడే దుష్టవర్తనకుఁ దగినఫల మనుభవించెదవుగాక!" యని నుడివెను. మణినాగుఁడు మఱిమాటాడలేదు. వెనుకకుఁ జూడక మాఱుదారిని వడివడిగా మేడదిగి పోయెను.

వసుంధర వీణాదండమును గ్రిందఁ బాఱవైచెను. నిశ్వాసధూసరితమైన యామెయధరోష్ఠమింకను గంపించుచునే యుండెను. జేవురించిన మొగము ప్రసన్నత వహింపలేదు. ఉబ్బిన కనుఱెప్పలు ప్రకృతినొందలేదు. ఒకింతసేపు శయ్యపైఁబడి యిటునటు పొరలెను. భోజనమునకుఁ బిలువవచ్చిన మల్లిక నామె చూడనేలేదు. మల్లికయు నా వికృతాకారమును గనుఁగొని భీతిజనింప నొక్కింతతడవు నిశ్చేష్టయై నిలిచెను. మొదట మదనావేదనయని తలంచెను. కానియదియింత భీషణమగునా? యని సంశయించెను. నెమ్మదిగా దగ్గఱఁజేరి యామెశరీరమును స్పృశించెను. వసుంధర 'ఎవ'రని తీవ్రస్వరముతో వాక్రుచ్చెను.

మల్లిక:—నేను.

వసుం:—ఇప్పుడే వచ్చెదనని చెప్పి యింతజాగు చేసితివా ?

మల్లిక:—ఏమి యిట్లున్నావు ?

వసుంధర కనుగొలుకుల నుండి బాష్పబిందువులు స్రవించెను. మొగము సంకుచితమయ్యెను. మల్లిక దగ్గఱఁగూరు చుండి దీనికంతకు నామహాపురుషుఁడేనా కారకుడనిమందముగా బలికెను. వసుంధర దిగ్గనలేచికూరుచుండి "మహాత్ములు పరుల నెప్పుడు పీడింపరు. ఆస్మరణ తెచ్చి నాకించుక సుఖము కలిగించితివి. ఆ ప్రసన్నమూర్తిని దలఁచికొన్న నా కానందమే కాని యన్యమేలకలుగును ? నీవేగినపిమ్మట నా నీచుఁడు-అమ్రుచ్చు వచ్చి నోటికిరాని దుర్భాషలాడెను. దానిచే మనసువికలమైనది. ఇంకను స్వస్థముకాలేదు" అనెను.

మల్లిక:—ఎవరు ? బావా ?

వసుం:—ఛీ! నీవుకూడ వాని నట్లనుట నా కవమానకరము గానే తోఁచుచున్నది. వాని తలంపు తేకుము. నా యొడ లుడికి పోవుచున్నది.

మల్లిక:—సరే! మహారాజుతోఁ జెప్పి వానికిఁ దగినశాస్తి చేయింతము. ప్రొద్దు పోవుచున్నది. లెమ్ము ! భోజనము చేయుదము.

వసుం:—సఖి! నాకీపూఁట భోజనము రుచింపదు. నీవు పోయి కానిమ్ము!

మల్లి:—నేనట్లు చేయఁజాలను. ఈ సంగతి యెఱిఁగిన మహారాజును భుజింపఁడు.

వసు:—మాతండ్రి యింకను భుజింపలేదా ?

మల్లి:—లేదు. ఏదో రాజకార్యముల తొందరచే నాలస్యము చేసెను. చెలీ! నీకొక ప్రియ మెఱిఁగించుచున్నాను. కాకులమునుండి జాబుగొని యెవరో వచ్చిరఁట.

వసుం:—పరిహాసముచాలును లెమ్ము!

మల్లిక:—పరిహాసముకాదు. యథార్థమే. నామాట నమ్మవేని మహారాజునే యడిగి తెలిసికొందువుగాని రమ్ము!

వసుం:—ఏదీ! చేతిలోఁ జేయి వేయుము.

మల్లిక:—(అట్లుచేయుచు) నిజమేనమ్మా!

వసుంధర నెమ్మదిగా శయ్య నవరోహించెను. ఇద్దఱు సలీలముగా మేడమెట్లు దిగిరి.

---

# పదియవ ప్రకరణము

మణిభద్రుఁడు శీఘ్రప్రయాణ మొనరించి రత్నసాను దుర్గముచేరెను. ఆతనిరాక నగరమందలి రాజకీయవేత్తలలో నూతన సంచలనమును గలిగించెను. నిశుంభుఁడు సర్వస్వతంత్రుఁడై శ్రీశైలప్రాంతము నేలుచుండెను. మన్నె లనేకు లాతని చెప్పుచేతలలో వర్తించుచుండిరి. సామంతులనుమన్నించుటలో నిశుంభుఁడు నిపుణుఁడు. వారి పరిపాలనమున నాతఁడు కలుగఁ జేసికొనఁడు. ఇతరులతో వారికి గలుగు సంఘర్షణములలోఁ దాను సాహాయ్యమొనర్చి ప్రతిఫలమపేక్షింపఁడు. న్యాయమో అన్యాయమో జయము సాధించుటయే ఆతని యభిమతము. ఆకారణముచే నాతని సామంతు లించుమించుగా నవినీతి

పరులేమై యుండిరి. ఎట్టిపాలెముదాపునఁ దమవారికి జరిగిన పరాభవమున కాతఁ డాగ్రహావిష్టుఁడయ్యెను. విద్రోహులతోఁ జేరి తనమీఁదఁ దిరుగుబాటు చేయుచున్నాఁడని తలంచి గురునాథునకు మందలింపుఁగమ్మ వ్రాసి పంపెను. వజ్రధర విష్ణుదేవు లక్కడకు వచ్చి వారికి దుర్బోధచేసిరని మణినాగుఁడు చెప్పినది విశ్వసించియుండెను. గురునాథుఁడు భయపడి వజ్రధరునిద్వారా క్షమార్పణపత్రము పంపియుండునని, మణిభద్రుని యాగమనమున కంతకంటెఁ బ్రయోజనముండదని యాతఁ డూహించెను. కావుననే మణిభద్రునియథార్థ్వముగా గౌరవింప నియోగించి 'నేఁడు ప్రొద్దుపోయినది; రేపు సావకాశముగా మాటలాడవచ్చు'నని యాతనికిఁ జెప్పించెను. మహీధరుని సామంతులఁ గలిసికొని వారివారి గ్రామములలోని జనులలో నుత్సాహమును బ్రేరేపించి తమశాసనము నెల్లవారు శిరసా వహించునట్లు కట్టుదిట్టము చేసిరమ్మని పంపియుండెను. దేశములో నెక్కడనేమి జరుగుచున్నదో, తన్ను గుఱించి ప్రజాభిప్రాయమెట్లున్నదో తెలిసికొని యెప్పటికప్పుడు నివేదించుటకు గూఢచారుల నేర్పాటుచేయుమని ప్రసేనునికి ముదల యొసంగెను. ప్రసేనుఁ డాంధ్రదేశమంతటఁ దిరిగి విశేషములు తెచ్చుటకు వేగవంతులగు వేగరుల నియోగించెను.

నాఁడు నిశుంభుఁడు సుఖముగాభుజించి ప్రాసాదోపరిభాగమున నుత్తమాసనమునఁ గూరుచుండి చెంత నుచితాసనములఁ గూరుచున్న మల్లికా వసుంధరలతో నిష్టసంభాషణము చేయుచుండెను. చంద్రికాప్రకాశముచే విశ్వము వికసించియుండెను. మలయ సమీరణుఁడు పురోపవనముల సేకరించిన సుగంధము నారాజేంద్రునకుఁ గానుకవెట్టుచుండెను. మల్లిక

యే వేవో ప్రశ్నించుచుండెను. రాజన్నిటికి సమాధానము చెప్పుచుండెను. వసుంధర యాలకించుచు మధ్య మధ్య సంక్షేపముగా నడగుటయుఁ జెప్పుటయుఁ జేయుచుండెను. నిశుంభుఁడామె వైఖరి యుత్సాహ సూచకముగా లేకుండుట గ్రహించి ఏమమ్మా! నీవెప్పటివలె నాచెవులలో నమృతము చిలుకకున్నావు?

వసుం:—తలవంచుకొని యూరకుండెను.

మల్లి:—ఒకటి యడుగవలయునని యామె యుద్దేశించినది. అడుగవచ్చునో కూడదోయని తటమటించుచున్నట్లున్నది.

నిశుం:—తటమట యెందులకు? అడుగుట కభ్యంతరమేమున్నది? చెప్పవచ్చునేని చెప్పెదను. అక్కఱలేనిచో వలదందును. అభినివేశమేల?

మల్లి:—అభినివేశము లేదు. కౌతుకభంగమగునేమో యని సంకోచము.

నిశుం:—బిడ్డా! మీకుతూహలము భగ్నమగుట నాకు సుఖావహమా?

మల్లి:—వసుంధరవంకఁ జూచి యామెచేఁ బ్రేరితయై, కాకులమునుండి వార్తాహరుఁడు వచ్చెనఁట! నిజమేనా?

నిశుం:—(ఇరువురి మొగములు సవిమర్శముగఁ జూచి) సత్యమే. వ్యవహారములలోఁ బాల్గొనఁ గుతూహలము జనించెనా?

మల్లిక:—వ్యవహారము కొఱకుఁగాదు. మొన్న కాకులేశ్వరుని మంత్రిమాటల సందర్భములోఁ గాలకేతువు తమ మిత్రుఁడని చెప్పెను. ఆమాటవిని మాయమ్మ యులికిపడి

నది. తరువాతనడుగఁగా నీమె కాలకేతు పుత్రికయగుట
నెఱిఁగించినది. ఆ కాలకేతు వెట్లుండునోయని యీమె
చూడఁగోరుచున్నది. ఆతనికి నట్టియుత్సాహముండవచ్చును
గదా? ఆసందర్భమైన వార్త యేమైన తెలియనగునా
యని—

నిశుం:—అట్టహాసముచేసి, ఎలుకను బట్టుటకుఁ గొండ త్రవ్వ
వలయునా? కాలకేతువును రమ్మన్న నామాట కళ్ళకద్దు
కొనిరాఁడా? (వసుంధర చుబుకమును దువ్వుచు) తల్లీ!
కన్నతండ్రిని జూడఁ గోర్కి జనించెనా? రేపు వర్తమాన
మంపి రావించెదను. ఆ కఠినుఁడు నాఁటినుండి నీమాటయే
తలపెట్టఁడయ్యెను. పాపము! అనఁగూడదు. ఆతఁడును
భార్యావియోగముచే వికలుఁడయ్యెను.

వసుం:—ఇప్పటి సమాచారము దేనినిగుఱించి యని మహా
రాజుతలంపు.

నిశుం:—ఇది వేఱువిషయము. మొన్నజరిగిన దానినిగుఱించి
యీ పాళెగానికిఁ గొంచెము గాటుగాఁ గమ్మ వ్రాసితిని.
దానిపర్యవసాన మిదియై యుండునని యూహించు
చున్నాను. క్షమింపవేఁడికోలు కావచ్చును.

వసుం:—తండ్రీ! పాళెగాని యపరాధ మేమున్నది! మమ్మతఁ
డెంతో మన్నించియుండెనే!

నిశుం:—బిడ్డా! దొంగలగురువు లట్లేయుందురు. తేనెపూసిన
కత్తులు, పయోముఖ విషకుంభములు. మీరచ్చట నుండఁ
గానే యొకకుట్ర యేర్పాటు చేయఁబడెనఁట! మీ రే
మెఱుఁగుదురు?

వసుం:—స్వల్పబుద్ధితో గ్రహించినదానిని జెప్పుచున్నాను. ఆగ్రామణియేమి - ఆ ప్రజలేమి - వారి ప్రభువేమి నిష్కపట స్నేహభావముతో మమ్మాదరించిరి. అట్టివారితోఁ జెప్ప కుండ వారిపరివారకుల బంధించి మ్రుచ్చులవలె వచ్చుట నాకవమానకరముగాఁ దోఁచినది.

నిశుం:—ఏమంటివి ? మిమ్ముఁదీసికొని వచ్చుటకు వారు సమ్మ తింపక యుద్ధసన్నద్ధులు కాలేదా ? అశ్వికదళమువారి నెదిరించి పోరలేదా ! మణినాగుఁడు వారినిజయించి మిమ్ము రక్షించి తెచ్చినట్లు చెప్పినాఁడు !

వసుం:—అభాగ్యులు నీచెవిలో విషముపోసినారు.

నిశుం:—ఏమి ? మల్లికా ! అంతయు బూటకమేనా ?

మల్లి:—అట్లు జరుగలేదు. వారిని వంచించివచ్చితిమి. అది యంతయు యశోధరాదేవి ప్రోత్సాహము.

నిశుం:—మణినాగుఁ డేమయ్యెను ?

మల్లి:—ఆతఁ డీ దేశమునకుఁ గ్రొత్తవాఁడుకావునఁ దల్లిమాట జవదాఁటలేకపోయెను.

నిశుం:—అశ్వదళాధికారి యీదేశ మెఱుఁగఁడా ? ఎంతయవ మానకరము ! శత్రువు లెల్లిదము చేయరా ? సరే !

రేపు విచారణ జరిపెదను. పొద్దుపోయినది. పోయి పరుండుఁడు. మల్లికా వసుంధరలు పరుండబోయిరి. మల్లిక మరలవచ్చి మణినాగుఁడు వసుంధరయెడఁ గావించిన నపచారమునుమాత్రము నిశుంభునకు రహస్యముగాఁదెలిపి యామె క్రుద్ధయై యున్నదనియుఁ జెప్పెను. నిశుంభుఁడు "ఛీ

మూర్ఖుఁడెంతపని చేసినాఁడు ? మల్లికా ! నీవు వసుంధరను గనిపెట్టియుండుము. నిమిషమైనను విడువకు''మని చెప్పి పంపెను. నిశుంభునకుఁ గార్యతంత్రము తలక్రిందులైనట్లు తోఁచెను. ఆతఁడు చాలసేపు కార్యాలోచనము చేసెను. ఆవల తోఁబుట్టువు; ఈవల పుత్రిక; ఎవరిని గ్రహించుటకు సాహసింపలేకపోయెను. 'మూర్ఖుఁడెంత తొందరపడినాఁడు. స్త్రీల హృదయములు కుసుమముకంటెఁ గోమలములు, వజ్రముకంటెఁ గఠోరములు నని యెఱుంగక పశువువలె బ్రవర్తించినాఁడు. నాతనయ నవమానపఱచుట నన్నవమానఁబఱచుట కాదా? ఎట్టియసత్యము. తానెంతో శ్రమపడి శత్రువుల జయించినట్లు చెప్పెను. ఇట్టిద్రోహులను నమ్మి రాజకార్యములు నడపినఁ బరాభవము తప్పదు. ఏమైననిది కుటుంబకలహమునకు సమయముకాదు. చూలోదరుని మొగమైనఁ జూడవలదా? యశోధరతోఁ జెప్పి ప్రస్తుతము చీవాట్లు పెట్టించెదఁగాక ?' యని తలంచుచు శయనాగారమును జేరెను.

మఱునాఁ డుదయమున సముచిత పరివారముతోఁ గొలువుకూటము నలంకరించి నిశుంభుఁడు మణిభద్రుని రావించెను. మణిభద్రుఁ డుచిత మర్యాదలు నిర్వర్తించి 'మహారాజ! ఇది మా ప్రభువర్యుఁడు స్నేహపూర్వకముగాఁ దమ కందఁజేయుమన్న లేఖ' యని దాని నాతని యెదుటఁ బెట్టెను. రాజానుమతినిఁ బ్రసేనుఁడు ముందుగా జదువుకొని మహారాజ! చదువుచున్నాను వినుఁడని విస్పష్టముగాఁ జదివి వినిపించెను. అవ్యగ్రహృదయుఁడై నిశుంభుఁ డాలకించెను. ఇంకేమైనఁ జెప్పుమనెనా ? యని మణిభద్రునడిగెను.

'ప్రజాక్షేమమును గోరి దేవరయొసంగిన యభిప్రాయమును దివ్యసందేశముగా గ్రహింతుమని మాఱేఁడు తెలుపు, మనియె' నని మణిభద్రుఁడు విన్నవించెను. 'మేమాలోచించుకొని శీఘ్రముగానే సమాధాన మిచ్చెదము. నీవుబసలో నుండుము' అని నిశుంభుఁడు వచించెను. మణిభద్రుఁడు చిత్త మని తనవిడిది చేరెను. నిశుంభు నానతిని బ్రసేనుఁ డావశ్యకులుగానివారి నందఱ సెలవిచ్చి పంపివేసెను. పిమ్మట వారిట్లు సంభాషించిరి.

నిశుం:—ప్రసేనా ! మఱియొకసారి జాబు చదువుము.

ప్రసే:—(చదివి) గౌరవమున కేమియు లోపములేదు. విషయము సత్యదూరము. అతివినయము శంకింపఁదగియున్నది.

నిశుం:—విషయము విభాగించి చర్చింతము.

నిశుంభుని మాటవిని ప్రసేనుఁ డచ్చెరువందెను. జాబు వినఁగానే నేయిపోసిన హుతాశనునివలె బగ్గున మండవలసిన నిశుంభుడు శాంతుఁడై యించుకేనియు వికృతినొందక విషయ చర్చకుఁ బాల్గొనుట కేమికారణమని యతఁడు గాఢముగ నోచింపసాగెను. ఎంతపరికించిన నేమియు బోధపడదయ్యెను. రాజాభిప్రాయ మెఱుఁగక తానేమిచెప్పుటకు సాహసింపఁజాలక పోయెను.

నిశుం:—ప్రసేనా ! మహీంధరుఁ డింకను రాలేదా ?

ప్రసే:—మహారాజా ! వచ్చినట్లులేదు: అతఁడు రాకుండ మనము చర్చించినఁ బ్రయోజన మేముండును.

నిశుం:—చర్చించుటకేమి ? నిర్ణయమాతఁడు వచ్చిన పిమ్మటనే చేయవచ్చును. మణినాగుఁ డెచ్చట ?

ప్రసే:—అతని యభిప్రాయము వినవలసినదే! ఇప్పుడే పిలిపించెదను.

ప్రసేనుఁడొక సేవకుని బిలిచి నీవుపోయి మణినాగుని సగౌరవముగాఁ దోడ్కొనిరమ్మని నియోగించెను. వాఁడు రాజమంత్రులకు నమస్కరించి వెడలిపోయి కొంతసేపటికి వచ్చి దేవా! వారు శరీర మస్వస్థముగానుండుటచే నేఁడు రాజ సందర్శనము చేయఁజాలనని సెలవిచ్చిరని తెలిపెను.

నిశుం:—అలాగుననా? మొన్న మణినాగునితో నెల్లపాలెము పోయిన యాశ్వికనాయకుని బిలిపింపుము.

ప్రసేనుఁ డట్లు చేసెను. వాఁడువచ్చి జయము మహారాజ! యని వినయవిధేయతలు మెఱయ నిలువఁబడెను.

నిశుం:—మొన్న మామేనల్లునికిఁ దోడుగాఁబోయి రాజ కుటుంబమును గాపాడి తెచ్చిన యాశ్వికసేన కధికారివి నీవేనా?

అశ్వదళాధిపతి:—చిత్తము మహారాజా! నేనే.

ప్రసే:—అప్పుడు ప్రభువొసంగిన బహుమానము నీకడ నున్నదా!

అశ్వ:—ఇదిగో! బంగారుపిడిగల యీ ఖడ్గము మహారాజు గారాసందర్భమున బహూకరించినదే. అమాత్యులవారు చూడవచ్చును.

ప్రసే:—చూచి నిశుంభునకుఁ గనఁబఱచి తిరిగి యిచ్చివేసెను.

నిశుం:—రాజకుటుంబమును దెచ్చు సందర్భమున మీకు నన్నగర వాసులకు ఘర్షణ జరిగినది కాదా?

అశ్వ:—ఘర్షణ యనుచున్నారా? పెద్ద సంగ్రామము జరిగినది. ఆ గ్రామాధికారి సెలవుపొంది గ్రామస్థులు బల్లెములు, నీటెలు మొదలగు సాధనములతో మమ్మెదిరించిరి. మణినాగకుమారుఁడు విక్రమసంపద సొంపుమీఱ వారి నుక్కడగించెను. నేను వారికి బాసటయైతిని ఆశ్వికు లందఱు ప్రాణములకుఁ దెగించి పోరాడిరి.

నిశుం:—అప్పుడు స్త్రీలు మీతో నున్నారా?

అశ్వ:—చిత్తము ప్రభూ! మాతోడనే వారున్నారు. వారి సంరక్షణము ముఖ్యముగా నాపని యని కుమారప్రభువు సెలవిచ్చినందున జాగరూకుఁడనై యుంటిని.

నిశుం:—అమాత్యవరా! జాబులోని మొదటి భాగమును జదువుము.

ప్రసే:—చదువును.

నిశుంభుఁడు:—ఇప్పుడేమి చెప్పెదవు?

అశ్వ:—మహారాజా! ఇది కేవలమసత్యకల్పనము. శత్రువులు మాయెడ నేలికకు క్రోధము పుట్టించి భేదతంత్రము నడప యత్నించుచున్నారు.

నిశుం:—ఓయీ! నిన్నడుగుచున్నది చండశాసనుఁ డగు నిశుంభుఁడని యెఱింగి చెప్పుచున్నావా? ఇందలిసత్యము మాకుఁదెలియవచ్చినది. ఇప్పుడైన నిక్కమెఱింగించి ప్రాణములఁ గాపాడుకొనుము. (అని గద్దించి పలికెను.)

అశ్వ:—(భయముతో) దేవా! ఏమి మనవిచేయుదును? (సంశయించును.)

ప్రసే:—(ఆశ్చర్యముతో తనలో) ఈజాబును మహారాజింత విశ్వసించుటకుఁ గారణమేమైయుండును. దీనికిఁ గొంత పూర్వరంగ ముండితీఱును. దాని తెలిసికొనకయ నేనేమి చెప్పినను బ్రమాదమే! (ప్రకాశ) ఆశ్వికవరా! ఏలయట్లు సంశయించెదవు? యథార్థ మెఱింగింపుము. ఏలిక యెదుట మాటాడుట యనఁగా దేవునియెదుటఁ జెప్పుటయని తెలి యదా?

అశ్వ:—(ఖిన్నుఁడై యధోముఖుఁడై యుండును)

ప్రసే:—పిచ్చివాఁడా! జరిగినది జరిగినట్లు చెప్పుము. అప్పుడు నీవు నిర్దోషివగుదువు.

అశ్వ:—అమాత్యవర్యా! నేనుమహాపాపాత్ముఁడను; ద్రోహిని; అబద్ధములుచెప్పి మహారాజును మోసముచేసి పారితోషి కము పడసితిని.

నిశుం:—అట్లేల చేయవలసివచ్చెను?

అశ్వ:—మహాప్రభూ! అది కుమారరాజుగారి యాజ్ఞ.

నిశుం:—మీకును గ్రామస్థులకు నెట్టి ఘర్షణ జరుగలేదు.

అశ్వ:— లేదు. మహాప్రభూ!

నిశు:—ఈ జాబులోని విషయము సత్యము.

అశ్వ:—సత్యమేకాని కాకులమునుండి సాయుధభటులు వచ్చి రో లేదో మాకుఁ దెలియదు. రాజకుటుంబమునకుఁ గావలి వారికిఁ దక్క మారాక పోకలెవ్వరికిఁ దెలియవు.

ప్రసే:—(తనలో) సిగ్గు సిగ్గు! మహారాజు మేనల్లుఁడే చోర వృత్తికిఁ గడంగెనా? (ప్రకాశము) ఓయీ! శూరుఁడవయ్యు

నకార్యమును గావించి మాకందఱకుఁ దలవంపు తెచ్చిపెట్టితివి? ఇట్టిపనులవలన విరోధులకు లోకువకామా?

అశ్వ:—మహాప్రభూ! బుద్ధి గడ్డి తిన్నది. ఇఁకనెన్నఁడు నిట్టి యకృత్యము చేయను. మొదటితప్పిదముగా క్షమింపవేఁడుకొనుచున్నాను.

నిశుం:—క్షమించితిమి! ముందు బుద్ధిగలిగి ప్రవర్తింపుము. రాజును మోసగింపరాదని గ్రహింపుము. పొమ్ము!

అశ్వ:—అనుగ్రహింపఁబడితిని. (వంగి వంగి మ్రొక్కి వెడలి పోయెను.)

నిశుం:—ప్రసేనా! నీవాశ్చర్య పడనక్కఱలేదు. రాత్రి నిద్రలో నాకు దేవి ప్రత్యక్షమై సర్వము నెఱిఁగించినది. తదనుకూలముగాఁ గార్యతంత్రమునఁ గొన్ని మార్పులు జరుగగలవు. జాగరూకుఁడవై కృత్యములు నిర్వహించు చుండుము. మనకన్నులను జెవులను నమ్మరాని దినములని తెలిసికొనుము.

నిశుంభుని స్వప్నములను గుఱించి ప్రసేనుఁడింతకుముందెఱుంగును. రాజకుటుంబ మాపదనొందినప్పుడు తదనుకూలమైన కలఁ గాంచియుండెను. ఆకారణమున నిశుంభుని వాక్యములు యథార్థములని ప్రసేనుఁడు నమ్మెను. దేవరకు గొప్ప యాత్మశక్తి కలదు. కావుననే భావిట్లుస్వప్నరూపమున విశదమగు చుండునని పొగడెను. ముందేమి చేయవలయునో యూహింపజాలక రాజుముఖమువంకఁ జూచుచు నతనియాజ్ఞకై యెదురుచూచుచుండెను. కొంతతడవు సభాస్థలి నిశ్శబ్దముగ నుండెను.

ప్రసే:—అమాత్యపుంగవా! రెండవ విషయమును గుఱించి నీవేమి చెప్పెదువు?

నిశుం:—ఇందు రెండవ విషయము గురునాథుని సంగతి. అతఁడు నిర్దోషియని రూఢియైనందున క్షంతవ్యుఁడే కాని హంతవ్యుఁడు కాఁడు.

నిశుం:—ఆతని కేమైన । వ్రాసిపంపవలయునందువా?

ప్రసే:—వేఱుగా నేమియు నక్కఱలేదని నాయుద్దేశము. దీనికి సమాధానము వ్రాయుచునందు గురునాథుని క్షమించితిమని తెలిపినఁజాలును.

నిశుం:—సత్యము గ్రహించిన పిమ్మట గురునాథునకు కృతజ్ఞత తెలుపవలసియే యున్నది. ఏదైన నీవన్నట్లు దీని సమాధానముతో జత పఱుపవచ్చు. తరువాత విషయమును గుఱించి చెప్పుము.

ప్రసే:—ఇది ముఖ్యమైన విషయము. మహీధరుఁడు వచ్చిన పిమ్మటఁ గలిసి యాలోచించుట యుత్తమమని తోచుచున్నది. మీఁద దేవర చిత్తము.

నిశుం:—నిర్ణయ మాతఁడు వచ్చిన పిమ్మటనే చేయుదము. దానిని విమర్శించి మంచిచెడ్డలు పరికించికొనుటకభ్యంతర మేముండును? రాజకార్యములను గుఱించి యెంతయాలోచించిన నంత మంచిది. క్రమక్రమముగాఁ గాని యందలి సూక్ష్మాంశములు స్ఫురించుచుండవు. వారేమనికోరిరి?

ప్రసే:—మహారాజా! ఆంధ్రదేశము నేకచ్ఛత్రాధిపత్యముగా నేలవలయునని —

నిశుం:—ప్రసేనా! మరల విమర్శింపుము. ఏకచ్ఛత్రాధిపత్యము వహింపఁగలవా రెవరు?

ప్రసే:—ఆవిషయమిందుఁ గప్పదాఁటుగానున్నది. 'మనమందఱమొక సమితిగాఁ జేరి యాంధ్రదేశ మొకే గొడుగునీడ సుఖించునట్లు చేయవచ్చును' అని యిందు వ్రాయఁబడియున్నది.

నిశుం:—మఱి యొకనిని జక్రవర్తిగాఁ జేసి వానికిఁ జేతులు జోడించుటకు నిశుంభుఁ డెన్నఁ డంగీకరింపఁడని వారికిఁ దెలియదా? సుచంద్రునినాటినుండి యీవిషయము నలుఁగుచునే యున్నది. సమితిగాఁ జేరుట యననేమి?

ప్రసే:—సంఘముగాఁ జేరి కార్యనిశ్చయము చేసికొందమని వారి యాశయమైయుండు.

నిశుం:—మంచిది. అట్లే కానిమ్ము. అప్పుడా సంఘములో బలవంతుఁడు ప్రధానుఁడు కాఁడా? అతనినే చక్రవర్తిగా నిర్ణయింపరా? ముందు వాక్యములోఁ బ్రజాక్షేమమే పరమలక్ష్య మనుటలో నాకొక యంతరార్థము గోచరించుచున్నది.

ప్రసే:—దేవరబుద్ధికపార్థము స్ఫురింపదు. వివరింపఁగోరెదను.

నిశుం:—వారు స్వతంత్రముగా సామ్రాజ్యము స్థాపింపదలఁచి విఫలమనోరథులైరి. నిశుంభుఁడు వారికిఁ గొండకంటె బెద్దయడ్డంకియయ్యెను. ఆకారణముచే వారిప్పుడు ప్రజాక్షేమమే ప్రధానాశయమను నెపమున మనమైత్రి సంపాదించుకొన జూచుచున్నారు. మన యనంతరము చక్రవర్తి

త్వము తమకు లభింపఁగలదని యాశించు చున్నారు. రాయబారిద్వారా మనమూవిషయ మెఱుకపరిచినను జాలు నని వేఁడుచున్నారు. చూడు! ఈ యర్థమును మనమున నుంచుకొని వేఱొకపరి జాబు చదివిచూడుము.

ప్రసే:—(అట్లుచేసి) దేవర సెలవిచ్చినది కాదని నిర్ధారణచేయు టకుఁ బ్రబలాధారములు లేవు. కాని—మఱెవ్వరును గాదు వజ్రధరుడు దీనిని స్వయముగా లిఖించెను అతఁడు మేధావి. బృహస్పతిని మించినవాఁడు. తొందరపడి యుద్యోగ్యూరఁ గూడదు. దేవర యిదివఱకే సార్వభౌములు. అనేకులు సామంతులు మీశాసనము శిరమునఁ దాల్చుచున్నారు. ఈ యొడంబడికవలన నిప్పుడు మన కెక్కుడు లాభము గలుగునని యాస జనించుట లేదు. అయినను మహీంధర విభుఁడు కూడ మీయభిప్రాయముతో నేకీభవించిన నట్లే చేయుదము. ఆతండు వచ్చునందాఁక సందేశహారుడిచ్చటనే యుండగలడు.

నిశుం:—అమాత్యవర్యా! నీ యాలోచన చక్కనిది. అయిన నేనొక్కమాట చెప్పుచున్నాను. పగగొని వీరు మన నేమియుఁ జేయలేరు. తమంతటఁ దాము లోఁబడుదురా మనకేమి సేగి? ఆంధ్రదేశమునఁ గల్లోలములు తగ్గును. చక్కని సామ్రాజ్య మేర్పడును. ఆంధ్రసామ్రాజ్య స్థాపకుఁడని కలకాలము జనులు చెప్పుకొందురు. వజ్రధ రాదులు నీయాలోచనను గన్నులకద్దుకొను చుందురు. కాని నాఁడు నిమిషమాత్రమున నిగ్రహింపఁగలము.

ప్రసే:—దేవర కుతూహలమున కడ్డుకలిగించు చున్నానని భావింపఁజనదు. సర్వవిధముల మనకిది శ్రేయోదాయకము

కాదు. వారు మనకు వశులైయుండుట కెన్నఁడు నంగీక
రింపరు. ఆ విషయమిందు ధ్వనించు చున్నది. ఇప్పుడు
సంఘముగాఁ జేరనంగీకరించిన వారెవరు? వారిలో నెవ
రెంతటి వారు? మన ప్రాభవమును బాటించు వారెంద
రున్నారు? ఇవేమియుఁ దెలియకుండ మన మొక నిర్ణ
యము కావించితిమేని యాశాభంగము నొందవలసిన
వారమగుదుము; ఇల్లలుకఁగానే పండుగ కాదు. బుటుక్కు
మనఁగానే గాలమునకుఁ దగిలినదనుకొనుట వెఱ్ఱితనము.
సావకాశముగాఁ బరికించిన దేవరకుఁ దెలియకపోదు.

విశ్వం:—(ఇంచుక యోచించి) అట్లైననిప్పుడొకటి చేయుదము.
మీ జాబు నిండు మనంబుతోఁ బఠించితిమనియు, ముఖా
ముఖిని బ్రసంగింపక కొన్ని సందియములు వీడవనియు, నన్ని
విషయములు సమగ్రముగా మాటలాడఁగల రాయబారిని
బంపినచో మీ సూచనల విమర్శింతుమనియు నీసందేశహారు
నకుఁ జెప్పిపంపుదము. దానిపై వజ్రధరుఁడో మఱియొకఁ
డంతటిసమర్థుఁడో మనవీటికి రాఁగలఁడు. ఇంతలో మహీధరు
డును నింటికిఁ జేరగలఁడు; లేదా శీఘ్రముగాఁ బనిముగించుకొని
రమ్మని వర్తమాన మంపుదము. అప్పుడు కార్యనిర్ణయము
మనకు సుకరమగును. వ్యర్థముగా జేంపు నడపుట నా కభి
మతము కాదు.

ప్రసే:—అట్లు చేయవచ్చును. అందుమనకేమియుఁ గొఱగామి
కానరాదు.

విశ్వం:—అయినచో సందేశహారుని బిలిపించి చెప్పుము!

ప్రసే:—మహారాజా! నోటిమాటలకన్న వ్రాసిపంపుట యుక్త
మము. పండితమానులగు దూతలు తమపైత్యమును జోడిం
తురు. రాజకార్యములపట్ల నట్టియవకాశము నొసంగరాదు.

నిశుం:—అటులేని జాబువ్రాయుము.

ప్రసేనుఁడు సావధానముగా లేఖపూర్తిచేసెను. రాజాను
మతిని దానిపై ముద్రవైచెను. మణిభద్రుని బిలిపించి లేఖనిచ్చెను.
ఇది మీ ప్రభునికందఁజేయుము. మహారాజుగారునిర్మలాంతఃకరణ
ముతో దేశక్షేమమును గోరుచున్నారని తెలుపుము. శ్రమ
యుడుగునంతదనుక విశ్రమించి నీవేగవచ్చును అనిచెప్పెను.
మణిభద్రుఁడు రాజమంత్రులకు నమస్కరించి తనబసకేగి
యశ్వము నధిరోహించి నిజనగరాభిముఖుఁడై చనియెను. అతఁ
డేగినపిమ్మట నిశుంభుఁడు ప్రసేనునిజూచి "యమాత్యాగ్రణీ!
ఇంకొక స్వల్పకార్యము మిగిలియున్నది. దానినిగూడముగింత"
మనెను. దేవరసెలవిచ్చుటే తడవని ప్రసేనుఁడనెను. నిశుంభుఁడు
కాలకేతునికడకొక శీఘ్రగామినిబంపవలయును. వసుంధర కన్న
తండ్రినిజూడఁ గుతూహలపడుచున్నది. ఆమెకోరికను మన్నిం
చుట నాకుఁదప్పనిసరి యనెను. ప్రసేనుఁడట్లేచేయవచ్చును.
కానియతఁడు మనయెడ విరోధభావము గలిగియుండునేమో
యనెను. నిశుంభుఁ 'డేనాటిమాట! అట్టియుద్దేశమాతనికున్నచో
నింతకాలముదాఁగునా? పాపమాతఁడును నావలెనే భార్యా
వియోగముచే దుఃఖతుఁడయ్యెనఁట! ఆతనికిమనము చేసిన దేమి
యంతపగపూనుటకు? వానిరాజ్యము వానికేయిచ్చితిమి.
బిడ్డను బిడ్డగాఁగొని మనిచితిమి. కన్నకూఁతును జూడరమ్మను
చుంటిమికాని చేఁదు మేయమంటిమా! సందేహపడ నక్కఱ

లేదు. మన వర్తమానమును గళ్ళకద్దుకొని పరుగెత్తుకొని వచ్చును. జాబువ్రాసి పంపుము'' అని యానతిచ్చెను. ప్రసేనుఁడట్లే చేసెదనని కమ్మవ్రాసి రాజునెదుటఁ బెట్టెను. నిశుంభుఁడు పరిశీలించి 'చాలు! బాగుగానే యున్నది. తగువానిచేఁ గాశీశ్వరము బంపుమని' చెప్పి నాటికిఁ గొలువుచాలించి గృహాభ్యంతరమున కేగెను. ప్రసేనుఁడును గార్యశేషములు ముగించుకొని యింటికిఁబోయి స్వకృత్యములందుఁ బ్రవృత్తుఁడయ్యెను. మల్లికావసుంధరలు లోనికిరాఁగానే నిశుంభునకు మ్రొక్కి నిలిచిరి. ఆతనిముఖము వికాసభాసురమై యుండెను. దానిని లక్షించి కాకులమునుండి వచ్చినసందేశము సంతోషదాయకమేయని తలంచి వారును బ్రీతినొందిరి. కాని యది యేవిషయమునకుఁ జెందినదో తెలిసికొనవలయునని కుతూహలపడుచుండిరి. తండ్రి తనంతటఁ దానేచెప్పునని వారియభిప్రాయము. కాని యట్లుజరుగలేదు. అడుగుటకు వారును సంశయించిరి. ఇంతలో భోజనమున కాహ్వానమువచ్చెను. భోజనానంతరముగాని తండ్రి యీప్రసంగము చేయుదలఁచి యుండలేదని నిశ్చయించుకొని వారు సౌధోపరిభాగమునకుఁ బోయిరి. నిశుంభుని హృదయమునఁ గార్యాలోచనమే యతివేగముగా జరుగుచుండెను. భోజనమునకుఁ బిలుపు వచ్చినదనుమాట నాతఁడు విస్మరించెను. ఎంతసేపటికిని రాకుండుటచే యశోధర మరల బిలువవచ్చెను. ఆమెనుజూడగానే మణినాగునిమాట స్మరణకు వచ్చి సోదరీ! మణినాగుఁడెట్లున్నాఁడు? అనియడిగెను. ఏదో బాధపడుచున్నట్లు పండుకొన్నాఁడు అనియామె చెప్పెను. 'అదిరోగముకాదు. దొంగజబ్బు! అని' నిశుంభుఁడు జేవురించిన మొగముతోననెను. యశోధర 'అన్నా! ఏమట్లనుచున్నా' వని

దగ్గఱకు వచ్చెను. నిశుంభుఁ డాతని యపరాధములను యశో ధరకెఱింగించి చీవాట్లుపెట్టుమని చెప్పెను. ఆమెయు లజ్జించు కొని 'అన్నా! మొదటితప్పునాది' అనెను. 'ఎవరిదైననేమి? నాతో నిజముచెప్పవలదా? సైనికుల కసత్యమునేర్పుట ప్రమాద కరముకాదా?' యనెను. యశోధర యిఁక మాటాడలేక పోయెను. 'వానిపక్షమున నేనువేఁడుచున్నాను. క్షమింపుము. మనసులోఁ గల్మషముంచుకొనకు' మని ప్రార్థించెను. క్షమింప కెవ్వరిని శిక్షింతును? ఇందన్యులెవ్వరు?—అనుచు భోజన శాలకేగెను. యశోధరయు వెంటనేగి యాతని ప్రసన్నుని జేయ నన్నివిధములఁ బ్రయత్నించుచుండెను.

# పదునొకండవ ప్రకరణము

పూర్ణభద్రుఁడు గురునాథుని గలిసికొని యంతకు ముందు వజ్రధర విష్ణుదేవులచ్చట నేర్పఱచిన కూటములను, మండలములను బర్యవేక్ష గావించెను. ప్రతిమండలమున నొక యోధకేంద్రము నేర్పాటుచేసి యుత్సాహముగల యువజనుల యోధవారముగాఁ జేర్చి వారికి సైనికశిక్ష యొసంగెను. ఒక్కొక్క కేంద్రమునకుఁ గావలసిన సాధనసామగ్రిని రాజ ధానినుండి తెప్పించి యవి యుపయోగించు విధానమును వారికి బోధించెను. ఆశ్వికులను బదాతులను వేలువేలుగా రణవిద్యా విశారదులఁ గావించెను. అతని రాకచే నా ప్రదే శము వినూత్న తేజోవంతమై యాటవికులకే కాక దురాక్ర మణ తత్పరులగు రాజులకుఁగూడ భయంకరమై కానవచ్చెను.

ఈ సమాచారమును శిష్యులవలన నెఱిఁగి యాపస్తంబ మహర్షి పూర్ణభద్రున కాహ్వానమంపెను. పూర్ణభద్రుఁ డావిష యమును బ్రభువునకుఁ దెలియఁబఱచి వారి యనుమతినొంది మహర్షిని సందర్శింపనేగెను.

ఆపస్తంబుఁ డాశ్రమవాసుల నాతనికిఁ జూపి కాలకే తుఁడు వారి కొసగిన శిక్షణమును బరిశీలింపఁ గోరెను. పైకిఁ గాషాయ వస్త్రములు గడ్డములు జడలు ధరించి కనఁబడు చున్నను మునిశిష్యులందఱు రణోత్సాహము గలిగియుండిరి. కాలకేతువు వారి కాయుధవిద్య గఱపెను. పూర్ణభద్రుఁడు వారి విద్యాకౌశలమును బరీక్షించి పెక్కు మెలఁకువలను వారికి బోధించెను. వ్యూహరచనా కౌశలముల నెఱింగించెను. మెఱికలవంటి కొందఱఁ గుమారవీరుల నేఱి యాపస్తంబు ననుమతినొంది యెఱ్ఱపాలెము ప్రాంతపు మండల కేంద్రస్థాన ముల వసించి ప్రతిదినము నచ్చటి యోధవ్రాతముచే సాధన చేయించునట్లు నియమించెను.

కొండలెక్కుట, క్రిందినుండి మీఁదివారితోఁ బోరా డుట యలవఱచుటకు సైనికపంక్తులను బర్వతప్రాంతములకుఁ గొనిపోయి వంతువరుస నభ్యాసమొసఁగెను. వారి గమనా గమనముల విలోకించి యాటవికులు భయభ్రాంతులై పూర్ణ భద్రుని శరణుచొచ్చిరి. వారి కభయమిచ్చి వారినిగూడ సన్మా ర్గావలంబుల నొనర్చుచు నీఁటెపోరాటమున నిపుణులఁ గావింపఁ దొడఁగెను. కొలఁది కాలములోనే గౌతమీ పశ్చిమతీర మందలి పెక్కు గ్రామములు సైనికశిబిరములుగా సిద్ధము లయ్యెను.

వజ్రధరుఁడు నియమించిన మాటకారులు తెలుచుగా బోధించుటచే గుంపులవాండ్రు దొంగతనమునుమాని కృష్యాది వృత్తుల నవలంబించి జీవింపసాగిరి. దురాచారములు క్రమముగావీడి సుఖజీవనమున కలవడఁజొచ్చిరి. పూర్ణభద్రుని ప్రచారముతో మాఱుమూలల దాఁగియున్న దోఁపిడిగాండ్రు కొందఱు డాగువాఱిన దెందములతో దేశమువిడిచి పాఱిపోయిరి. మిగిలినవారు గ్రామములు, పల్లెలు చేరి స్థిరనివాసము లేర్పఱచుకొని యచ్చటివారితోఁ గలిసిమెలసి బ్రతుకుచుండిరి. వారి సాహాయ్యమునఁ బూర్ణభద్రుననుయాయులు దస్యునివాసముల నెఱిఁగి యరణ్యములనుండి వారిని బయటికి రావించి నయమున భయమున లోఁబఱచికొనిరి.

వజ్రధర నియుక్తులగు నుద్యోగులు బాటలు వేయించియు, జెఱువులు త్రవ్వించియు, వాఁగుల నేర్పఱచియుఁ బ్రజలసౌఖ్యమును వృద్ధిచేసిరి. అటవుల ఛేదించియు, భూముల జదునుచేయించియు విరివిగాఁ బంటలు పండించుటకు నీళ్లు కల్పించిరి. అనతికాలములోనే గౌతమీతీరము సుభిక్షమై నిష్కంటకమై వీర్యవంతమై యైకమత్యముగలిగి శోభిల్లసాగెను. పూర్ణభద్రుఁడిట్లు సామ్రాజ్యమున కంకురారోపణ మొనర్చి హృష్టహృదయుఁడై రాజధానికరిగి తానొనర్చిన కృత్యమును బ్రభుమంత్రులకుఁ బూసగ్రుచ్చినట్లు నివేదించెను. అతనిరాజభక్తికిఁ గార్యదక్షతకుమెచ్చి విష్ణుదేవుఁడు మృదుపరివ్యంగముచే సైన్యాధ్యక్షుని బహూకరించెను.

వజ్రధరుఁడింతకుముందే కృష్ణాతీరమునందలి పెక్కుగ్రామములలోఁ గట్టడ గావించియుండెను. అచ్చటిప్రజలయుత్సాహ

సంపదనుగూడఁ గొంత వర్ణించి నిశుంభునకు సందేశమంపిన సమాచారమును బూర్ణభద్రున కెఱిఁగించెను.

వజ్ర:—కుమారా ! యిప్పటికి కృష్ణాగౌతమీమధ్య దేశమంతయు నిష్కంటకమై నీయాజ్ఞకులోనైయున్నది. ఇంచుమించుగా సామ్రాజ్యము స్థాపితమైనట్లే. అంతయు మీతండ్రి చలువ యని సంతోషించుచున్నాను.

విష్ణుదేవుఁడు:—భక్తినమ్రుడై మీ యుభయుల తోడ్పాటు నాధారముగాఁ గొని పితృాదేశము నెఱవేర్చి కృతార్థుఁడఁ గాఁగోరు చున్నాఁడ.

పూర్ణ:—మహారాజసుచంద్రుని యనుభావమే మిమ్ము సింహపీఠము నెక్కింపఁగలదు. దేవర యుదార గుణసంపదకు సింహాసనమెంత ? త్రైలోక్యాధిపత్యము నత్యల్పమనియే నాయూహ. సాటిలేనిశౌర్య ధైర్యములు, వానికిఁ దీసిపోని దయాదాక్షిణ్యములు, నన్నిటినిమించిన నిసర్గసౌహార్ద్ర మధుర సంభాషణముగల మనచక్రవర్తి తప్పక మహావిష్ణు వంశ సంభూతుడనుభావము జానపద చిత్తముల నిరూఢమైయుండుట నెడనెడఁ గాంచి విస్మయావిష్టుఁడ నైతిని. బాల్యముననే యింతటి ప్రజానురాగ మార్జించిన నరపాలు నింతకుముందుఁ గనివిని యెఱుంగము.

విష్ణుదేవుఁడు:—పూర్ణభద్రా! నాజీవితము కొంతవఱకుఁ జరితార్థమైనదని భావించుచున్నవాఁడ. నే నాసించునది ప్రజానురాగమే కాని సామ్రాజ్యభోగముకాదు. ఏరాజు రాజ్యమునఁ బ్రజలు సుఖింతురో వానిది ధన్యజీవనము గాని క్షణవినశ్వర మగు విభవానుభవమా మానవునికి జీవిత

సాఫల్యమొసఁగునది? ఎన్నివేల సంవత్సరములు గడచినవి. ప్రజలిప్పటికిని రామరాజ్యమని, శ్రీరామ రక్షయని చెప్పుచున్నారు. అట్లనుట కమ్మహానీయుని ప్రజా వాత్సల్యము కారణముకాని, భోగలాలస హేతువు కాదుగదా!

వజ్రధరుఁడు:—దైవ మనుగ్రహించెనేని యాంధ్రసామ్రాజ్యము దాక్షిణాత్యులకు మేలుబంతి కాఁగలదు. నీ ప్రశస్తియుఁ బౌరాణికనుతిపాత్రము కావలయునని కోరుచున్నారము. ఆపస్తంబాది మహర్షు లాశీర్వదించుచున్నారు. ఒక్కటి చెప్పవలసియున్నది. శ్రీరాముని మనస్సుకంటె నీమనస్సు మెత్తనిది. ఎంత చెప్పిన నిశుంభవధ కుత్సహింపకున్నాఁడవు. యజ్ఞమునఁ బశువిశసనము వేదసమ్మతము. మనము తలపెట్టినది మహాయజ్ఞము. నిశుంభరాక్షసుఁడీ క్రతువునఁ బశువు కావలయును. సంపూర్ణోత్సాహముతో దీక్ష వహించి యీక్రతువున యాజమాన్యము వహింపుము. మేమందఱము ఋత్విక్కుల మగుదుము.

విష్ణు:—(చిఱునవ్వుతో) ఆర్యా! ఆవశ్యకమైనచో నిశుంభుని సపరివారముగా సంహరించెదనని యింతకు ముందే ప్రతిజ్ఞ చేసితినిగాదా? మన మంపిన సందేశమున కాతఁడను కూలుఁడైనచో—

వజ్ర:—వాని స్వభావము నెఱుఁగక యట్లనుచున్నావు. నాకిసుమంతయు నాశాలేశము లేదు. ఆగర్వితుఁడు — ఆబలశాలి — ఆ రాక్షసుఁడు— సాధుమార్గమవలంబించు ననుకొనుట పులి గోవగు ననుకొనుటే కాని వేఱుకాదు.

వాఁడొకవేళ మెత్తని మాటలాడినను విశ్వసింపరాదు. వాని సామ్రాజ్యకాంక్షకుఁ బరిమితిలేదు.

పూర్ణ:—తానే చక్రవర్తిత్వము వహింప నాశపడునని మీ యభిప్రాయమా ?

వజ్ర:—నాయభిప్రాయమే కాదు. ప్రాజ్ఞులందఱు నట్లే తలంచుచున్నారు. మహర్షి యాపస్తంబుఁడు నిశుంభవధకుఁ గంకణ బంధము గావింపుమని చెప్పలేదా? భీమనాయకుఁడు నిశుంభ రాక్షసుఁడు తెగటాఱనిదే దేశక్షోభముపశమిల్లదని కంఠోక్తిగాఁ జెప్పియుండలేదా ?

విష్ణు:—నిశుంభునకు సామ్రాజ్య కాంక్షయున్నచో రాజ్యభోగములాతనికే యర్పించి నేను బ్రజాసేవ యొనర్చెదను. ప్రజాసౌఖ్యమే పరమలక్ష్యముగాఁగల నాకీ దుర్భరభార వహన క్లేశము తొలగుటయు, సావధానముగాఁ బ్రజాసౌఖ్యము సమకూర్ప నవకాశము గలుగుటయు సంతోషదాయకములు గావా ?

వజ్ర:—(నవ్వి) శరీరము లేక ధర్మాచరణ మెట్లుసాధ్యముకాదో క్షత్రియునకుసామ్రాజ్యము లేక ప్రజాసేవయు నట్లే సాధ్యము కాదు. ప్రతివృక్షము తన ఋతు కాలమునఁ గొలఁదిగానో, ఘనముగనో ఫలము లిచ్చుచునే యుండును. కల్పవృక్షమాశ్రితులకు మనోరథఫలము లిచ్చును. సద్బుద్ధిగల మానవమాత్రుఁడు తనశక్తికొలఁది బరోపకార మొనర్చుచుండును. కులమును, జాతిని, దేశమును సముద్ధరించి సేవ యొనర్చుటకు సమ్రాట్టుకాక యితరుఁడు పనికి రాఁడు.

ఆధ్యాత్మిక సేవచేయు మతకర్తలకుఁ గూడ సమ్రాట్టు తోడ్పడనిచో మతస్థాపనము కొనసాగదు.

పూర్ణ:—సామ్రాజ్యకాంక్ష కలదని నిశుంభుని సింహాసన మెక్కించుట ధర్మ మగునా? ఆఁకట వాపోవు చున్నదని పైతృకము కుక్కకుఁ బెట్టవచ్చునా? కాకసామ్రాజ్య మెవ్వరిది? ప్రజలది! ప్రజలు తమ కభిమతుఁడగు వాఁడు సింహాసన మెక్కి పాలించుట కంగీకరింతురు కాని యధికార వాంఛ, భోగలాలస మిక్కుటమై ననయుచున్నాఁడని యనర్హుని దయదలంచి ప్రాణములమీఁదికిఁ దెచ్చికొందురా? ఎవ్వఁడు సామ్రాజ్యము ప్రజలదని గ్రహించునో వాఁడు దానికై ప్రాఁకులాడఁడు. ప్రాఁకులాడువాఁడు నిప్పున నొక కాలు, చందనమున నొక కాలు నుంచి నిలువఁగలుగునా? నిలువఁ జాలనివాఁడు పదవినే కళంకితము గావించును.

విష్ణు:—(ఆదరముతో) పూర్ణభద్రా! నీవన్నదితథ్యము. తథ్యమే కాదు ప్రియమును. సింహాసనము బాహ్యచిహ్నము. సత్యమైనసామ్రాజ్యము మానవ హృదయములందే యుండును. ఆసింహాసన మధిష్ఠింపగలవాఁడే ధన్యుడు. మూఢులు భోగతృష్ణచే బాహ్య పరికరములఁ గాంచి మురిసిపోవుదురు. వలదన్నను దానే యధికారపదవిం గోరి ప్రజాహితమున కవరోధ మొనరించినచో నింశుభునేకాదు—వానికెవ్వఁడు తోడై వచ్చినను సంహరించి ప్రజాభీష్టము సిద్ధింపఁజేసెదనని త్రికరణ శుద్ధిగాఁ జెప్పు చున్నాఁడను.

ఆ మాట లనునప్పుడు విష్ణుదేవునియాస్య మించుక జేవురించెను. నేత్రకోణములఁ గోకనదచ్ఛాయ యంకురించెను. అప్రయత్నముగా దృష్టి కరవాలముపై వ్రాలెను.

వజ్ర:—(హర్షించుచుఁ దనలో) ఉత్సాహానుభావములు నేఁటి కీతనియందు గోచరించినవి. ఇంక స్థాయియై భావము రసత్వము నొందఁగలదు. (ప్రకాశము) కుమారా! సుచంద్రుని దివ్యజ్యోతి తళుక్కుమని మెఱసినట్లైనది. గ్రహించితివా?

విష్ణు:—గ్రహించితిని. సమయము కాఁగానే యాన్ధ్ర్యాము దేనను వ్యర్థ ప్రగల్భములు నాకభిమతములు గావు.

పూర్ణ:—దేవరకే కాదు. దేవరసేవకులకుఁ గూడఁ బ్రగల్భములిష్టములుగావు. అసలాంధ్రులే కార్యరంగమునఁ బ్రవేశించు నంతవఱకు నివురుగప్పిన నిప్పులు. తీవ్రవాదము వారి కభిమతముకాదు. అది వారిజాతికిఁ బ్రత్యేకలక్షణము.

విష్ణు:—భీమేశ్వరుఁడు మనతో నేకీభవించియున్నాఁడు. కాలకేతువు కార్యార్థియై యనుసరించుచున్నాఁడు. నిశుంభుని మాట తేలిపోఁగానే ద్రాక్షారామకాళేశ్వరములఁ గలిపికొని శ్రీశైలము మీఁదుగా సువర్ణప్రాకారమునిర్మించి యాంధ్రరాజ్యము స్వర్గరాజ్యమని, యాంధ్రు లాదర్శపురుషులని, యాంధ్రదేశము వజ్రభూమియని దశదిశల పేరుమ్రోఁగునట్లు చేయగల వాఁడనని కూడ మీకు మాట యిచ్చుచున్నాను.

వజ్ర:—(హర్షాతిశయముతోఁ గౌఁగిలించికొని) కుమారా! నీనోటినుండి వినవలసినమాటవిని ధన్యుండనైతిని. చూడు చూడు! ఆంధ్రమాత ప్రీతి విస్ఫారిత నయనములతో నానంద బాష్పములు విడుచుచున్నది.

పూర్ణ:—దేవరతలంచినచో నిదిఎంతటిపని!

వారిట్లు సంభాషించుచుండ మణిభద్రుఁడు ముందుగాఁ దనరాక నెఱిఁగించి యనుమతినొంది సమీపించి యుచితరీతిని ముగ్గురకు నమస్కరించెను. వారు వాని నాదరించి నిశుంభుఁడు మనజాబునాదరించెనా? విశేష మేమియనియడిగిరి. మణిభద్రుఁడు వ్యతిరేకము లేకుండుటయే గొప్పవిశేషము. ఆతఁడుచితరీతిని నన్నాదరించి యీజాబు వ్రాయించి యిచ్చెను. మన లేఖను గుఱించి వారు మాటాడుకొనునప్పుడు నన్ను వెడిదికిఁ బంపి వేసిరి. బయలు దేఱి వచ్చుచుండఁ బ్రసేనుఁడు' మా మహారాజు గారు నిర్మలాంతఃకరణముతోఁ బ్రజాసౌఖ్యమును వాంఛించు చున్నారని మీ ప్రభువర్యుని కెఱిఁగింపుమని చెప్పెను.' అని తెల్పి జాబు వజ్రధరుని కందిచ్చెను. ఆతఁడుదానిని జదివికొని యిది యొక విధమైన యంతరాయమనుచు విష్ణుదేవుని కొసగెను. విష్ణుదేవుఁడు సావధానముగా జదివికొని నీవుకూడవిలోకింపుమని పూర్ణభద్రునకొసంగెను. పూర్ణభద్రుఁడు చదివికొని 'యేమిది? నిశుంభునికింతటి సామరస్యముగలుగుట చిత్రముగానున్నది. ఇది విశ్వసనీయమేనా ?

వజ్ర:—కాదని దానివాలకమే చెప్పుచున్నది.

విష్ణు:—మన మసందిగ్ధముగా నేమియువ్రాయలేదు. ముఖాముఖిని మాటలాడినఁగాని సందేహములు తొలఁగవనుటకు హేతువేమి ?

పూర్ణ:—అన్ని విషయములు నిష్కర్షగా మాటలాడఁగల రాయబారిని బంపుమనుటచే వారొక నిర్ణయముచేసికొని రని తోఁచుచున్నది.

వజ్ర:—వారి యుద్దేశము "మీరు సామ్రాజ్యభారము వహించుటకు మేమంగీకరించితిమని విస్పష్టముగాఁ దెలుపుచు రాయబారినంపుమని.

పూర్ణ:—అసంభవము. దురాశ దుఃఖముఁజేటు.

విష్ణు:— (ఇంచుకయోచించి) ఆర్యా! ఏమైనఁ గానిమ్ము. ఆరంభింపకేపోవలయు; ఆరంభించినఁ గడముట్టఁ జూడక నడుమవిడుచుట బుద్ధిమంతుల లక్షణముకాదు. ఈ విషయమును మనమొకరమే నిర్ణయించుట తగదు. సత్వరముగా నేయర్థము మహానీయుఁడగు నాపస్తంబునకు, విక్రమధురీణుఁడగు భీమనాయకునకు నెఱిఁగించి వారి యుద్దేశములు విశ్వాసపాత్రులచేఁ దెలుపవలసినదిగాఁ గోరుచు విజ్ఞాపనమంపుము. వారి యాశయములు దెలిసికొన్నపిమ్మట మనము కార్యనిర్ణయ మొనరింతము.

వజ్ర:—అట్లేచేయుదము. మనమందఱ మొక సమితిగాఁ జేరి దేశక్షేమమునుగూర్చి సమాలోచన చేయుదమని చెప్పిన దానికి వారంగీకరించినట్లు తోఁపదు.

పూర్ణ:—అందుఁ దప్పేమున్నది? వారు తమ యుద్దేశము లెఱిఁగింపవచ్చును. సమంజసములైనచో వాని నందఱు గ్రహింతురు కాని విడుతురా?

విష్ణు:—సరే! ఏమైననగుఁగాక! కట్టైవంపు ప్రొయ్యితీర్పగలదు.

వజ్రధరుఁడు జాబులువ్రాసి విష్ణుదేవున కిచ్చెను. వానిని బరిశీలించి యతఁడు వానిపైఁ దనహస్తాక్షరిలిఖించెను. వేగవంతుఁడగు నొక యాశ్వికభటునిచే దీనిని బంపుమని సేనాని కిచ్చెను. పూర్ణభద్రుఁ డడఁకువతో నందుకొని నమస్కరించి

వెడలిపోయెను. అనంతరము మణిభద్రునకుఁ దగిన బహుమాన మీయవలసినదిగాఁ గోశాధ్యక్షునకుఁ జీటివ్రాసి వాని నాతని కడకంపి వజ్రధర విష్ణుదేవు లభ్యంతర గృహమున కేగిరి. కొంతసేపైన పిమ్మట విష్ణుదేవు డేకాంతముగఁ గూరుచుండి మణిభద్రుని రావించి యాతనితో నిట్లు ప్రసంగించెను.

విష్ణు:—మణిభద్రా! రత్నసానుదుర్గమున నీవింకేమైన విశేష ములు గనుగొంటివా?

మణి:—ఒక యాశ్వికుఁడు ఖిన్నుడై పోవుచు మణినాగునిఁ దిట్టుచుండెను. ఆదరపూర్వకముగా నడుగ వాఁడిట్లు చెప్పెను. 'రాజుమేనల్లుఁడు మణినాగుఁ డంతఃపుర స్త్రీలను దెచ్చునపుడు పాళెగాండ్రతో యుద్ధము చేసితిమని చెప్పు మనెను. మేమట్లే చెప్పితిమి. అది యసత్యమని యెట్లో రాజునకుఁ దెలిసినది. దయగల వాఁడగుటచే నన్ను క్షమి యించి విడిచిపుచ్చెను. ఇట్టినీచుని రాజదుహిత చేపట్టునా? అయ్యో! మీరెవ్వరో యెఱుఁగ. గోడలకుఁ జెవు లుండును. రాజకుటుంబమును గుఱించి మనము ప్రసం గింపఁ గూడదు. నిశుంభుఁడు చండశాసనుఁడు' ఇట్లు చెప్పి వాఁడు తనదారిని బోయెను.

విష్ణు:—అనుచరుల ప్రవృత్తిని విచారించెనన్నమాట. అంత వఱకు సంతోషదాయకమే. ఆవిషయమైనేమియు వ్రాయఁ డయ్యెను. అనుతాపము నెఱఁగించుట సత్పురుషలక్షణ మని తెలియఁజాలక అహంభావమునకు వశులై లోపమును గ్రహించియుఁ గొందఱు పొరపడితిమని యొప్పుకొనరు.

మణి:—ఇంకొక సమాచారము. దేవరకది—

విష్ణు:—సంశయింపక వచింపుము. నీకంటె నాకాప్తుఁడెవడు?
మణి:—దేవరకది చెప్పవచ్చునో కూడదో! ప్రియమో? అప్రియమో?

విష్ణు:—రాజు ప్రియమైన నప్రియమైన హితులవలన నెల్ల విషయములు దెలిసికొనవలయును. తామెఱింగినది తెలుపని భృత్యులు రాజద్రోహులగుదురు.

మణి:—రాజాంతఃపురమునుండి యొకచేటిక నాకడకువచ్చి ప్రియపూర్వకముగాఁ దమకుశలమడిగియెన్నో ప్రశ్నించినది. దానినిబట్టి రాజదుహిత మిమ్ముఁ బ్రేమించియున్నదనినాకుఁ దోచినది.

విష్ణు:—ఇది యప్రియమని యేలశంకించితివి?

మణి:—దేవరయుత్తమ క్షత్రియవంశసంభూతులు. నిశుంభుఁడు రాక్షసుఁడు. తత్కన్యాపరిగ్రహణమునకు దేవరచిత్తమొడఁబడదని తలంచితిని. ఒకవేళ గుణమునే ప్రధానముగాఁగొని దేవరయంగీకరించినను వజ్రధరుఁడు నాపస్తంబాదులగు పెద్దలు జాతిసాంకర్యము నేవగింతు రనుకొంటిని.

విష్ణు:—పెద్దలు గర్హించు కృత్యమెన్నఁడు నాకు రుచింపదు. నామనస్సునకు హితవైనది ధర్మబద్ధమనియే నానమ్మకము.

మణి:—దేవరసెలవిచ్చినది సత్యము. మహర్షులు చెప్పినదెల్లు ధర్మశాస్త్రమో మహాపురుషుల నడవడియు నట్లేసదాచార మగుచున్నది. ఉభయులు జితేంద్రియులు. ఉభయులు లోకానుగ్రహ తత్పరులు.

విష్ణు:—చేటిక యేమని ప్రశ్నించినది?

మణి:—భద్రముఖా! నీవొనర్చినది హంసదౌత్యమా, నల దౌత్యమా యని చమత్కారముగా నడిగినది. మొదట నమ్మాటల యర్థము గ్రహింపజాలనైతిని. పదపడి నేను సందేశహారుఁడనని యెఱిఁగించితిని.

విష్ణు:—సంభాషణము సరసముగానేయున్నది. పిమ్మట—

మణి:—పిమ్మటనామె నీవుచిలుకవా? కోఁతివా యని మరల ప్రశ్నించినది. నేనుచిలుకనుగాను – కోఁతినిగాను–పావురమును నంటిని. ఇంతలో నాహ్వానము వచ్చినందునఁ గొలువు కూటమున కేగితిని. తిరిగివచ్చునప్పటి కామె యచ్చట లేదు. వెళ్ళినపని పూర్తియైనందున జాగుసేయక బయలుదేఱి వచ్చితిని.

విష్ణు:—మణిభద్రా! మనజాబు విలోకించిన పిమ్మట నిశుంభుని చిత్తవృత్తి నేమైన గ్రహింపఁ గలిగితివా? ఆకారచేష్టాదులవలనఁ బరేంగితము సూచితము కాకమానదు.

మణి:—వారు సంభాషించు కొనునప్పుడు నన్నావలకుఁ బంపివైచినందున నెక్కువగా గ్రహించుట కవకాశము లేక పోయెను. ప్రసేనుఁడు జాబు చదువుచుండఁగా నిశుంభుఁడు స్తిమిత గంభీరమైన దృష్టితో నాలకించెను. అతని ముఖమున దుర్వికారము లేవియుఁ బొడకట్టవయ్యెను. దర్పము, రాజసము మాత్రము లలాటమున నెలకొని యున్నవి. ఆతఁడు సుముఖముగా నున్నట్లే నాకుఁ దోఁచినది.

విష్ణు:—కానిమ్ము. ఈ విషయముల నింకను రహస్యముగానే యుంచుము. పోయిరమ్ము. మణిభద్రుఁడు సెలవు తీసికొనెను. అతఁడేగిన పిమ్మట విష్ణుదేవుఁ డించుకసేపు పర

ధ్యానముగా నుండెను. రాజపుత్రి మనసున ననురాగ లతిక యుదయించిన మాట నిక్కము. అదియింకను బల్లవితావస్థయందే యున్నది. నిశుంభుఁడు తనయను మణినాగుని కిచ్చు తలంపున నుండవచ్చును. క్షత్రియకుల సంజాతయగు వసుంధర వానియెడఁ బ్రేమానుబంధము కలిగి యుండఁజాలదు. క్లిష్టపరిస్థితు లెన్నో యా పేశలగాత్రి నెదుర్కొనఁగలవు. దైవసంకల్పమే వానినన్నిఁటి దొలఁగించి మార్గమును జక్కఁ జేయఁగలదు. విషయలౌల్యమునకు నేనిత్తఱి తావీయరాదు. ప్రేమ పవిత్రమైన దేయైన నొకప్పుడు చిత్తస్థైర్యమును జెడఁగొట్టును. అవ్యవస్థిత చిత్తులు సావధానముగఁ గార్యతంత్రము నడువఁజాలరు. సుచంద్ర మహారాజు నాటిన యీ కల్పవృక్షము వజ్రధరుని దోహదముచేఁ బెరిఁగినదై భీమేశ్వరుని స్నేహమునఁ బల్లవితమై యూపస్తంబుని కరుణచేఁ గోరకితమై విలసిల్లుచున్నది. నా ప్రమాదమువలన నది చీడవాఱినచోఁ జిరకాలమునుండి ప్రజలాసించుచున్న ఫలానుభూతి విలంబితము కాఁగలదు ప్రజావాంఛితము నాటంకపఱచు సౌఖ్యముతో నాకుఁ బనిలేదు. బుద్ధిమంతుఁడు ప్రధానోద్దేశము నేమఱక యితర ఫలముల సాధించుటయుఁ దప్పుగాదు. తోఁటమాలి ఫలముకొఱకు వృక్షమును బెంచును. శాఖోపశాఖల విస్తరిల్లిన యా తరురాజము ఫలములనే కాక చల్లనినీడను గూడ నొసంగిన ననుభవించుట నిషిద్ధమగునా? ఈ సత్కార్యమునకు నిశుంభుఁడు తోడ్పడనిచో కంటక తరుస్కంధమునఁ దగిలియున్న సన్నజాజి తీఁగను

నవయకుండఁ దప్పింపవలసిన బాధ్యత తోఁటమాలికి లేదా?

కొంతతడవిట్లు వితర్కించుకొని యా ధీరోదాత్తుఁడు క్రమముగా నియత కార్యాచరణ పరతంత్రుఁడయ్యెను.

## పండ్రెండవ ప్రకరణము

నిశుంభుఁడు రాజసౌధమున సుఖాసీనుఁడై యుండెను. మల్లికావసుంధరలు ప్రక్కలఁ గూరుచుండిరి. కాలకేతువును దోడితెచ్చుటకుఁ బోయిన పురుషుఁడు తిరిగివచ్చి కాళేశ్వరమునఁ గాలకేతువు లేఁడనియుఁ గొంతకాలముక్రిందట నాతఁడు మతిభ్రమణముచెంది, యెటకోపోయెననియు ముఖ్యమంత్రి రాజు నన్వేషింపఁదగు వారిని నియోగించి రాష్ట్రమున నల్లరులు లేకుండఁ జూచుచుండెననియు నెఱింగించెను. ఆతనిస్థితికి నిశుంభుఁడుజాలిపడెను. వసుంధర యించుక వగచెను. మల్లిక యామెనూరడించెను. 'తల్లీ! నీకువగవఁబని లేదు. నీ కేలోపమునురానీయను. మీయమ్మతోఁ జెప్పినట్లే నాతో నీవన్ని విషయములు సంకోచింపక చెప్పుచుండుము. ఎంతదుర్ఘటమైననీముద్దుచెల్లించి తీఱెదను. నిత్య వికస్వరమగు నీముఖపద్మమున విషాదరేఖలు ఱెకెత్తనీయకుము; వానిని నేఁజూడఁజాల'నని నిశుంభుఁడు దుహితృముఖారవిందమును బైకెత్తి మూర్ధాఘ్రాణ మొనర్చెను. మల్లికయు 'సోదరీ! దైవకృతమున కెవ్వరేమి చేయఁగలరు? మహారాజట్లు చెప్పుచుండఁగా నీకుఁ గొఱఁత యేముండును?

తల్లియుఁదండ్రియుఁ దానై మహారాజే నీయభీష్టమును నెఱవేర్ప గలడు' అనియామెముఖమును దుకిచికుంతలములు సవరించెను.

వసుంధర:— మల్లికా ! మహారాజుకంటె బంధువు నాకెవరు గలరు ? తల్లి లేకున్నను దానే తల్లియుఁదండ్రియునై నన్నుఁ బోషించు చున్నాఁడు. కాని ఆదయానిధి—ఆప్రేమమూర్తి మా యమ్మ విశ్వంభరాదేవిని దలఁచుకొన్నప్పుడు నా ధైర్యము చెదరకుండుట లేదు. తమంతటఁ దామే కన్ను లశ్రుపూరితము లగుచుండును. చేయిపెట్టి కలఁచినట్లు కడుపులోఁ జెప్పరాని బాధకలుగును. మనసునైకల్యము నొందును.

ఇట్లు చెప్పుచునామె గద్గదకంఠయై మాటాడ లేకపోయెను. నిశుంభుఁడు దగ్గఱగాఁ దీసికొని యామెకు ధైర్యము చెప్పుచు మొగము వెనుకకుఁ ద్రిప్పి బాష్పము లపనయించుకొనెను. మల్లికయు బాష్పనిరోధ మొనర్చుచు 'మహారాజా! నీవట్టినచో నీమె బెంగటిల్లదా?' యని ప్రశ్నముమీఁద వచించెను. కొంతసేపందఱు నిశ్శబ్దముగానుండిరి. ఎట్టకేలకు ధైర్యమవలంబించి నిశుంభుఁడు "బిడ్డా! కాలకేతు వెక్కడనైన జీవించి యున్నచో వెదకించి పిలిపింతును. నీవు ధైర్యముతో నుండుము. వగవకు మనెను.

వసుం:—తండ్రీ! ఆతనిగుఱించి నాకంత వంత లేదు. అందఱు తండ్రితండ్రి యన్న గాఁబోలు ననుకొంటిని. ఆతని మొగము నే నెఱుఁగుదునా? నా మొగ మాతఁడెఱుగునా ; ఊహ వచ్చినప్పటి నుండియు నీవే తండ్రివని నమ్మియుండుటచే నాకు నీయెడలనే పితృభావ మమరియున్నది. దైవసంకల్ప

మున్నచో నొకసారిచూచుట సంప్రాప్తమగును. లేకున్న లేకేపోవును. నీవు శ్రమపడవద్దు.

నిషుం:—(వాత్సల్యముతోఁ జూచుచు) నాయెడ నీకెట్టి పితృభావమున్నదో నేనెఱుఁగుదును. తల్లిచాటున మనుటచే నాకుఁగల దుహితృవాత్సల్యము నీవు గ్రహించకపోవచ్చును. బిడ్డా! నాకు నీతోడిదేలోకము.

వసుం:—తండ్రీ! ఆమాట నేనెఱుఁగకపోలేదు. మల్లికతో నెప్పుడు చెప్పుచునే యుందును.

మల్లి:—ఔను. మహారాజా! నామీఁద నీమె యొక బాకీ పెట్టినది. కాకులమునుండివచ్చిన వార్తయేమో వినవచ్చునేని యీమె కుతూహలము దీర్పఁగోరుచున్నాను.

నిషుం:—(తనలో) ఎట్టిపాలెమున వీరాతని జూచినట్లున్నారు. దైవమునన్ను విషమపరిస్థితిలోఁ బెట్టి పరీక్షింపనున్నాఁడు కాఁబోలు. (ప్రకాశము) కాకులమునుసుచంద్రుఁడను నార్యక్షత్రియుఁడు పరిపాలించు చుండెడివాఁడు. చక్రవర్తి కావలయునని యాతనికిఁ గొంతెమ్మకోర్కి జనించినది. దానితో వాఁడుమట్టమయ్యెను. ఆతనితమ్ముఁడు వజ్రధరుఁడనువాఁడన్నకొడుకును సామ్రాట్టునొనర్ప వలయునని ప్రయత్నించుచున్నట్లు వింటిమి. కుఱ్ఱవాఁడు యోగ్యుఁడనియే భావింపవచ్చును. ఆతెఁడుతనసామర్థ్యమును గ్రహించి మనలఁగూడఁ గట్టుకొనక యప్పని నెఱవేఱదని మనతోరాయబారములు సాగింపఁగోరుచున్నాఁడు. ప్రజాక్షేమమని నెపముపెట్టుకొని యాంధ్రదేశమునందలి రాజుల నొకసంఘముగాఁ గూర్పఁగోరుచున్నట్లు తెలిపియున్నాఁడు.

వసుం:—న్యాయదృష్టితోఁ బరికించిన నది సదుద్దేశముగానే తోఁచుచున్నది.

నిశుం:—విపరీతదృష్టితో నేలచూడవలయును? నేనందుకే సామరస్యము వ్యక్తమగునట్లు ప్రతిసందేశమంపితిని. మన వారిలోఁ గొందఱకది యాశ్చర్యజనకమైనది.

మల్లి:—మీరంపిన ప్రతిసందేశమంత నివ్వెరపాటునకు మూలమయ్యెనా?

నిశుం:—శత్రువులయెడ మార్దవము వహించుటకు వారు నిర్ఘాంతపడిరి.

వసుం:—వారుమనకు శత్రువులా? ఇంతకుముందు వారికి మనకుఁ బోరాటము జరిగియుండెనా?

నిశుం:—పోరాటము జరిగియుండలేదు. వారి సంకల్పమునకు నేను బ్రతిబంధకుఁడనని వారియూహ. ఇతరులవలె నణఁగి మణఁగి చేతులొగ్గి యుండువాఁడను గాకపోవుటచే వారటభిప్రాయపడి యుందురు.

వసుం:—అంతమాత్రమున విరోధులనుకొనుట యెంత యవివేకము.

మల్లి:—రాజులకుఁ గార్యానుకూలముగా శత్రుత్వ మిత్రత్వములు తలక్రిందు లగుచుండును. మహారాజా! మీరంపిన ప్రతిసందేశమేమి?

నిశుం:—మీజాబు నిండుమనంబుతోఁ బరికించితిమి. ముఖాముఖి సంప్రతించుకొని యొక నిర్ణయము చేసికొందమని వర్తమానించితిని.

వసుం:—(సంతోషముతో) మల్లికా! మహారాజెంత విశాల హృదయుఁడు!

మల్లి:—దీనికిఁ దప్పక వారంగీకరించి స్వయముగానో సమర్థుల ముఖమునో సంప్రదింతురు.

వసుం:— దీనితో దేశమండలి యల్లరులన్నియు నిర్మూలము లగును కాదా! తండ్రీ!

విశం:—కొన సాగినచో నట్లేయగును. నావంటి వాని కుటుం బమే తెక్కలికాండ్ర వలన నలజడి పడఁగా సామాన్యు లేవిధముగా బాధపడు చున్నారో!

వసుం:— దేశక్షేమమును గోరినదైన నీపని కొనసాగున ట్లనుగ్రహింపుమని నిన్నుఁ గోరుచున్న దాన. ఆలోచించిన కొలఁది నందలి మహోత్కృష్టత గోచరించుచున్నది.

విశం:—అనుగ్రహించుట కిది యనుకొనినంత సులభ సాధ్యము కాదు. వజ్రధరుఁడు తిన్ననివాఁడు కాఁడు. మన ప్రాభవమున కాతఁ డచ్చగింపఁడేమోయని—

వసుం:—ఇందుఁ బ్రాభవమునకే మున్నది? అందఱు సంఘ ముగాఁ జేరి యైకమత్యముతో దేశసౌభాగ్యమును బెం పొందింతమనికదా వారు కోరిరి.

విశం:—మాటమట్టు కట్లేయుండును. సంఘమునం దందఱు నెంత యైకమత్యముతో నుండఁ దలఁచినను విభిన్నాభి ప్రాయము లుప్పతిల్లక మానవు. ఎవరికివారే వాని నన్నిటి నాచరణలోఁ బెట్టఁ గడఁగిన సంఘము నిర్జీవమగును. ఎవరికివారే తమ మాట చెల్లించుకొనుటకుఁ బ్రయత్నిం

తురు. అప్పుడు కక్షలు బయలుదేఱును. అవి విద్వేష కారణము లగును. కావున సంఘము న్యాయబద్ధమై నడచుట కొకని యధికారమునకుఁ దక్కిన వారు లొంగి తీఱవలయును. అనఁగా నామాట వారో వారి మాటనేనో శిరసావహించు చుండవలయును. ఇంత బ్రతుకు బ్రతికి యొకకుఱ్ఱవాని పాదమూలమునఁ జంకలలోఁ జేతులు ముడుచుకొని నిశుంభుఁడు నిలువఁ జాలఁ డన్నది జగద్విదితమే కద! వారి మాటయేమో మఱి!

మల్లి:—(ఆశ్చర్య హాసములతో) సోదరీ! తెలిసినదా రాజనీతియొక్క జిగిబిగి ఎట్లుండునో!

వసుం:—(కొంచె మాలోచించి) నాకంత దుర్ఘటముగాఁ గానవచ్చుట లేదు. ఏమందురా? ఎప్పుడో ఏదోవిషయమున నభిప్రాయములు భేదింప వచ్చునని ముందుగానే మూలచ్ఛేదము చేయుట పాఁడికాదు. తన మాటకే చెల్లుబడి కావలయునన్న దురభిమాన మెందు కుండవలయును? హితము ధర్మసహితమునైన నయ్యదెవ్వరుచెప్పినను గ్రాహ్యమే. వయసుకాదు—జ్ఞానము ప్రధానము. బాలుఁడు చెప్పినను సుభాషితము స్వీకారార్హమే. నెల పొడుపునాటి చంద్రుఁడు బాలుఁడయ్యు వరిష్ఠుఁడగుటచే నెల్లవారు తలలొగ్గి మ్రొక్కుచుందురు.

నిశుం:—బిడ్డా! నీమాటలలోఁ బూర్వాపర వైషమ్యము చూపుచున్నావు. జ్ఞానమేకాని వయసు ప్రధానముకాదు. మంచిదే! అనుభవముమీదఁగాని జ్ఞానము లభ్యముకాదు. ఒకవేళ శాస్త్రాభ్యాసాదులవలన లభించుననుకొందము.

అదినిష్ణాత ఘనవచ్చునా? వయసు చెల్లనివానికనుభవమెట్లు నిష్పన్నమగును. కావుననే కాఁగి చల్లారిన పాలందురు. అనఁగా వయస్సు గడచినవాఁడు, శాస్త్రము లభ్యసించిన వాడు, లోకపరిపాటి నెఱింగినవాఁడు, వృద్ధుడు, వానిమాట తమ కప్పటికి సమ్మతముకాకున్నను హితవని యార్యు లాదరింతురు. ఇంకొకటి తనమాట చెల్లవలయుననుట దురభిమానము కాదు. తేజస్వి లక్షణము. తేజశ్శాలి పరాభిభవము సహింపఁడు. పరోత్కర్ష కోర్వఁడు. పరప్రశంస వినఁనోల్లఁడు. ఇవన్నియు దుర్గుణములగునేని మాత్ర మవలక్షణమే యగును. మఱియొకటి, ఏ కార్యము నైనఁజక్కఁగా యోచించి ప్రారంభించుట నీతి విదుల లక్షణము. సంభవింపఁగల యనర్థముల నుద్ఘాటించి పరిహారముల నరయుటయే యోచన. అనుకూల్యమువలె వైషమ్యము తటాలున స్ఫురింపదు. కీడెంచి మేలెంచవలయు ననుమాట నీవును వినియుందువు. అనాలోచితముగా భుజము లెగురవేయుట కంటె నాలోచించి తలయొగ్గుట మంచిది. విమర్శ మాత్రమున మూలము విచ్ఛిన్నమగుచో నది యట్లు జరుగవలసినదే. అట్టి దుర్బల మూలమెప్పుడు నిర్వాహకము కాదు.

మల్లి:—ఆశాజనకముగాని కార్యమున రాయబార మేమిటికి?

నిశుం:—మహీంధరుఁడు పాళెములఁబరిశీలించివచ్చు తలంపుతో నేగియుండెను. ఆతనితో నాలోచింపక కార్యనిర్ణయము చేయనిచ్ఛగింప నైతిని. ఇంక మీరేకుఁడు. నేఁ గొలువు కూటమునకుఁబోవు వేళ యైనది. ప్రసేనుఁడు నాకై యెదురు చూచుచుండును.

ఇట్లు చెప్పి నిశుంభుఁడు కొలువుకూటమున కేగెను. అతఁ డనుకొనినట్లే ప్రసేనుఁడు రా జాగమనము నిరీక్షించు చుండెను. రాజాస్థానము నలంకరింపఁగానే గూఢచారులవలనఁ దెలియవచ్చిన ముఖ్యసమాచారముల వినిపించెను. ఆప స్తంబా శ్రమమునందలి విశేషములు, గురునాథుని యాజమాన్యమున నెట్టిపాలెము ప్రాంతమున సైనికశిక్షణము, సముద్రతీరమునందలి రేవుస్థలముల నొనర్పఁబడుచున్న కట్టుబాటులు సర్వము వివరించెను. నిశుంభుఁడంతయు విని 'వారు దేశమును బలపఱచుచు మనఁను రాయబార నెపమున జోకొట్టఁ జూచుచుండ లేదుగదా!' యని యడిగెను. ప్రసేనుఁడు నేనట్లే తలంచుచున్నాఁడను. ఇతరుల యాథార్థ్యము నంగీకరించు నంతటి వెట్టివాఁడా వజ్రధరుడు? ఇంత దనుక మనతో మాటలాడుటకే వారికి శక్తిచాలదయ్యెను. ఇప్పుడు కొంత బలము చేకూర్చుకొనుటచే రాయబారము జరుపుటకు ధైర్యము కలిగినది. ఇఁక మన మాదమఱచి యుండకూడదు. వారి వాలకము చంకదుడ్డు, శరణార్థి యన్నట్లున్నదని వచించెను. నిశుంభుఁడించుక యాలోచించి 'ప్రసేనా! నావిక్రమ సంపద వారెఱుంగకపోరు. తగరువచ్చి క్రొండను డీకొనునేని తల పగిలి చచ్చును. కాక మహీధరుఁడు సామంతులఁ గలిసికొన నేగెనుగదా! అతఁడు వారి నుత్సాహపఱచి వచ్చును. మనకు గావలసినంత సైన్య మున్నది. కోశబల మపరిక్షీణము. పురుష కారముచేఁ గ్రొత్తగా మనము సాధింపవలసిన దేమున్నదో చెప్పుమనెను. ప్రసేనుడు "మహారాజా! మనకు లోప మున్నదని నేననుటలేదు. శత్రువుల మాయావాగురలోఁ బడ రాదని మనవిచేయుచున్నాను. ఎంత బలవంతులైనఁ బ్రమాద

పడియున్నచో విరోధులు తిరస్కరింతురు. అరాతి బలముకంటె మనబల మధికముగా నున్నను బ్రస్తుత మపర్యాప్త మనియే నేఁదలంచుచున్నాఁడను. ఆయుధసంపదయుఁగొఱవడి యున్నదని వచించెను.

ఆసమయమున మహీధరుఁడు వచ్చి ప్రభువునకు నమస్కరించెను. నిశంభుఁడాతనిఁగుశలమడిగి దేశమునందుఁ జూచిన విశేషముల నెఱిఁగింపుమని కోరెను. తాను సామంతులతో మాటలాడి వచ్చిన వివరములు రాజుమంత్రులకుఁ దెలిపి మహీధరుఁడిట్లు చెప్పెను: "మహారాజా! సామంతులుమనపట్ల బద్ధానురాగులై యున్నవారు. సెలవైనచోఁ బ్రళయాగ్నిలోనైన నుఱుక సంసిద్ధులమైయున్నామని చెప్పిరి. జనపదములందలి ప్రజానీకమునఁ గొంత వైపరీత్యము గాన వచ్చినది. వజ్రధరుఁడు దుర్బోధచేసి వారికి మనమీఁద విద్వేషమును జనింపఁజేయుటచేఁ గొండఱాటవికుల స్వేచ్ఛావిహారములకు భంగము కలిగినదఁట. కొందఱు గుంపులు గుంపులుగా లేచివచ్చి మనదేశమున నివాసము లేర్పఱచు కొనుచున్నారు. ఏమైనను దొంగతనము విస్తారముగా జరుగుచుండుటచే దేశవాసులకు స్తిమితము లేకయున్నది. మనము శీఘ్రముగా దీనికిఁదగుచికిత్స చేయనిచోఁ బల్లెలు మనకు స్వాధీనము లైయుండవు. ఇప్పటికే కొన్ని స్వయంపోషకములై పొగరెక్కి మన యధికారమును ధిక్కరింపఁ జూచు చున్నవి."

నిశుం:—అధికారము ధిక్కరింపఁ జూచు చున్నవా? అట్టివానిని నేలమట్టముచేయుదుమని నొక్కిచెప్పకపోయితివా? ముందుగా నాగ్రామములు కొల్లగొట్టింపుము. అంతటితోఁ బాగరణఁగును.

ప్రసే:—ప్రభూ ! తొందరపడి యేకార్యమును జేయవలదు. ఎవరి బలము నాశ్రయించుకొని వారిట్లు గర్వించుచున్నారో తెలిసికొని దానికిఁ బ్రతీకారము చేయుట యుక్తము. అట్లు కానిచో వ్యయప్రయాసము లధికమగును.

మహీ:—ఎవ్వరు వారికిఁ దోడ్పడుచున్నట్లు లేదు. కాని కొంతదూరమున విరోధుల యేలుబడిలోని గ్రామముల నివసించువారప్పు డప్పుడు వచ్చియేదో దుర్బోధచేయుచున్నారని యాచూకి తెలియవచ్చినది.

నిశుం:—అట్టివారిని బట్టి యేలబంధింపవైతివి?

మహీ:— అందుకుఁ దగిన కట్టడ యేర్పఱచి వచ్చితిని. ఇఁక మీఁదట నట్టి వారెవ్వరైన మనగ్రామాదులలో నడుగిడిన వెంటనే బద్ధులై రాజధానికిఁ బంపఁబడఁగలరు.

ప్రసే:— మంచిపనిచేసితివి. తస్కరులఁ బట్టుకొనుటకుఁ గూడ నొకమార్గ ముపదేశించితివా?

మహీ:—కొందఱు సైనికు లాయాగ్రామముల సంచరించుచు ననుమానముగలవారి యాస్తులు పరిశీలించి భయపెట్టుచుండునట్లుగాఁ జెప్పివచ్చితిని.

ప్రసే:— చాలు! ఇట్లుకొన్నిదినములు నడచినచో నల్లరితగ్గిపోవును.

నిశుం:— నీవు చెప్పఁదలఁచినదంతయుఁ బూర్తియైనదా? ప్రసేనా! యిచ్చటిసమాచారమును గూడ మహీధరునకెఱిఁగింపుము.

మహీ:— ఇచ్చటనేమి విశేషము జరిగినది ?

ప్రసే:— సేనాధ్యక్షా ! కాకులము నేలు విష్ణుదేవుఁడు మనకొక జాబువ్రాసిపంపినాఁడు. ఇదిగో దీనిని సావధానముగాఁ జదివి కొనుము.

మహీ:—(చదివికొని) మహారాజా! ఈవైపరీత్యమునకుఁ గారణ మేమైయుండును ?

నిశుం:— వైపరీత్యమం దేమున్నది ?

మహీ:—మూఁడేండ్లముక్కపచ్చలారని వాఁడిట్లుజాబువ్రాయ సాహసించుటే మొదటివైపరీత్యము. సంఘముగాఁ జేర వలయునఁట! తనతోనాతఁడు సమానప్రతిపత్తి గోరుట కంటె వేఱువైపరీత్య మేమున్నది ? విధేయతనెఱిఁగించెడి యక్షరమొక్కటియు నాకిందుఁ గానరాకున్నది.

నిశుం:—(నవ్వి) అనుభవము చాలని వాఁడగుటచే నట్లున్నది. దాని నంతగా నేబరిగణింపలేదు. విషయమునకే ప్రాధాన్య మిచ్చితిని.

ప్రసే:—ఈజాబు విషయమున మహారాజు చిత్తవృత్తి వింత గానే నాకును బొడగట్టినది. రాణిగారు స్వప్నములోఁ గన బడి కర్తవ్యముపదేశించిరనియు, దదనుకూలముగా, గార్య తంత్రమున మార్పు జరుగుననియు, ప్రభువు సెలవిచ్చుటచే మాటాడలేక పోయితిని.

నిశుం:—ఆమాట సత్యమే ! కాకులేశ్వరునితో మన కేదో అనిర్వాచ్యసంఘటన జరుగనైయున్నట్లు నాయంతరాత్మకు బొడకట్టునట్లు దేవి చేసినది.

మహీ:—అట్టి యుద్బోధదృష్టితోఁ బరికించిన నీలేఖయందు సామరస్యమే గోచరించును.

నిశుం:—ఐహికముగా గూడ నే జెప్పిన దాలకింపుము. వారొనర్ప బూనినది ప్రజాహితమని కదా దీనివలన వ్యక్తమగుచున్నది. దానికి మనము వ్యతిరేకులము కాము. ఇక సంఘమునం దెవరిచేయి పయినుండవలయుననునదే ప్రశ్న. వారు దాని నిదమిత్థమని నిర్ధరించు కొనక రాయబారములు నడుప యత్నింపరు. వారే కాదు నిశుంభుని గుఱించి యించు కంత విన్నవారెవ్వరు నాతడన్యులకు వశవర్తియై యుండు నని సంభావించి యుండరు. అది విస్పష్టము చేయుమనియే కదా మన ప్రతి సందేశము. రెండు మూడు దినములలో నదియుఁ దెలిపోగలదు.

మహి:—ప్రతి సందేశముగూడఁ బంపఁబడినదా?

ప్రసే:—నీవువచ్చునంతకు నిరీక్షింపుమని కోరితిని. కాని యట్లు జరుగలేదు.

నిశుం:—మించిపోయిన దేమున్నదిప్పుడు. నిస్సందేహముగా ముఖాముఖి మాటలాడగల రాయబారిని బంపుమంటిమి. ఆతఁడు వచ్చెడులోపుగా మనము విమర్శించుకొని సావకాశముగాఁ గార్యనిర్ణయము చేసికొనవచ్చును.

మహి:—నిర్ణయమున కేమున్నది? ఖడ్గము ధరించుటా? పాఱవేయుటా? ఒక్కటే మాట!

ప్రసే:—సేనాధిపతి చెప్పవలసినమాట చెప్పితివి. రాణిగారి యభీష్టమును మన్నింపవైతివి.

నిశుం:—మన యధికారమును వారు గౌరవింతురేని కత్తికిఁ బనిలేదు. అందుకేమాత్రము ప్రతివిరోధము తటస్థించినను శస్త్రధారాతీర్థావగాహనమున కందఱు సంసిద్ధులము కావ

లసినదే. ఇందు సందేహము లేదు. తమ్ముడా! తినఁబోవుచు రుచి యడుగనేల? నేడో రేపో రాయబారి రాఁగలఁడు. ఒక్కమాటతో సంశయవిచ్ఛేదము కాఁగలదు.

మహీ:—చాలదినములైనది. భుజాకండూతి నపనయించుకొనఁ నొక్కయవకాశ మొసఁగవలయునని మహారాజును గోరుచున్నవాఁడ.

నిశుం:—ఉత్సాహ జనకములైన నీ మాటలకు మేను బులకరించుచున్నది. కేలు కరవాలుపై వ్రాలుచున్నది. కాలు ముందంజ వేయుచున్నది.

ప్రసే:—మహారాజుగారు ప్రకృతికిఁ దగినట్లు సంభాషించుచున్నారు. రాణిగారి సందేశమును మఱచియుందురు.

నిశుం:—ప్రసేనా! అవశ్యం భావి నెవ్వఁడు తప్పింపఁజాలఁడు. క్షాత్రమునకుఁ గొఱంత వాటిల్లనంతవఱకే మాట దబ్బఱ కాకుండఁ జూడఁగలము. పిమ్మట నెవరికి వారే యమునా తీరే...

మహీ:—మనమిప్పు డెవరికేమి మాటయిచ్చితిమి? రాయబారి నంపుమనుట తత్ప్రణాళిక నంగీకరింతు మనుటకాదు. దానిని విమర్శించుటకు, మార్చుటకుఁ, ద్రోసిపుచ్చుటకు మనకు సర్వాధికారమున్నది.

నిశుం:—సందేహమేమి? అంగీకారముకానిచోఁ బాతాళమున బాతి వేయుదము.

ప్రసే:—అకుంఠిత వీర్యవిరాజితమగు మనప్రతిష్ఠ కావంతయు భంగకరముగాని యొడంబడికయైనచో మేలే! కాని నాఁడంగీకరించుట కెవ్వరిష్టపడుదురు?

నిశుం:—మహీంధరా ! వేయేల ? ఆయుధసంపద నభివృద్ధి చేయుము. కరి తురగాది పరికరముల సిద్ధముచేయుము. ఆజ్ఞలకు నాహ్వానములకు నెదురుచూచు చుండవలసినదిగా సామంతులకు లేఖలు వ్రాయుము. ఆయుధవిద్యా ప్రదర్శనములు జరిపి సైనికుల యుత్సాహము పురికొలుపుము. సర్వసన్నాహముతో నుండుము. ఇట్లు చెప్పుచుంటినని కార్యవిఘాతమునకే కడంగుదునని యెంచకుము. ఇది తుది సాధనమని మఱువవలదు.

ఇట్లాదేశించి నిశుంభుఁడు కొలువు చాలించెను. అందఱు నుత్సాహపూరితులై యిండ్లకుఁబోయిరి.

# పదమూడవ ప్రకరణము

విష్ణుదేవుఁ డాస్థాన మండపమున నాప్తులతో రాజ కార్యములు ముచ్చటించు చుండెను. వజ్రధరుఁడు పూర్ణ భద్రుడు నిరుప్రక్కల నాసీనులై యుండిరి. అర్జునదేవుఁడు కాలకేతువునెదుట నుచితాసనములఁ గూరుచుండిరి. మణి భద్రుఁడు కొంచెము దూరమునుండి లోనికెవ్వరు రాకుండ గాంచుచుండెను.

విష్ణు:—రాజా ! మహనీయుఁడైన యాపస్తంబుఁ డేమియాదేశించెను ? మనకందఱకు నమ్మహాత్ముని యుపదేశము శిర సావహింపఁ దగినది.

కాల:—"సార్వభౌమా ! నిశుంభ రాక్షసునితో రాయబారము జరుపుచున్నాఁడవని విని యానందించితిని. సర్వవిధముల

దేశక్షేమమే మన యభీష్టము. దాని నిర్వాహణమునకై మనమెట్టి మార్గమునైన నవలంబింపవచ్చును. ఇదే దారి యను పట్టుదల యెుకప్పుడు కూడదు. మనము త్రొక్కుచున్న బాట న్యాయబద్ధమై యుండునట్లు చూచుకొనుచుండవలయును. అపమార్గమున నార్జించిన స్వర్గమును సౌఖ్యదాయకము కానేరదు. అవినీతులపొత్తు, పాముల చెలిమివంటిది. ఎంత జాగరూకత వహించినను తుదకు దుష్టమేయై పరిణమించును. అడియాసలకు లోనై కార్య విలంబము చేయుట నీవంటి నీతివిదునకు సమంజసము కాదు. అయినను బ్రారంభించి తుదముట్టఁ జూడక విడువ రాదు. నిష్పక్షపాతముగను, కూలంకషముగను జేయు టార్యసంప్రదాయము. ప్రజాభిమతమును బాటింపుము. ప్రజాభిప్రాయమును గుర్తింపని సామ్రాజ్యము చిరస్థాయి కాఁజాలదు. దీనినెఱింగి యప్రమత్తుఁడవై వజ్రధరుని యంగీకృతిని బడసి సమాలోచనము జరుపుము. అర్జున దేవుఁడు నిత్యము సహాయుఁడగుగాక ! అని యూపస్తంబ మహర్షివర్యుఁడు మీా కెఱిఁగింపు మనియె.

విష్ణు:—(లేచి నమస్కరించి) మహాత్ముని యాదేశమునకు హృదయమునఁ బ్రధానస్థానము నొసంగితిని. (కూర్చుండి) కాలకేతూ ! మహాత్ము డింకేమైనఁ జెప్పుమనెనా ?

కాల:—లేదు. ఇదియంతయు విలంబ హేతువని మహర్షి యాశయము.

విష్ణు:—సందేశమే దానిని వ్యక్తపఱచుచున్నది. నిశుంభుఁడు మనతోఁ గలిసియుండడని మహర్షి దృఢనిశ్చయము.

వజ్ర:—ఒక్క మహర్షియే కాదు మనలోఁ జాలమంది యట్లే తలంచుచున్నవారు.

విష్ణు:—వారు స్థితప్రజ్ఞులు. ఐనను రాజనీతిని గౌరవించుట మనవిధి. రాయబారము విఫలము కాకుండనే సంగ్రామము ప్రవర్తిల్లలేదు.

వజ్ర—విఫలమగు మార్గముమీఁదనే రాయబారము జరుగవలయును.

విష్ణు:—అది యుత్తమ లక్షణముకాదు. నిష్పక్షపాతముగను, కూలంకషముగను నిర్వహించు టార్యసంప్రదాయమని కదా మహాత్ముఁడు సెలవిచ్చియున్నాడు. అపమార్గ మాశ్రయణీయముకాదు. అభినివేశము కూడదు.

కాల:—ఏపనినైన సదుద్దేశముతోనే చేయవలెను. అప్పుడే ధర్మదేవత హర్షించును. ధర్మమే జయమునకుఁ గారణము.

విష్ణు:—మిత్రమా! భీమనాయకుని యభిమతమునుగూడ వివరింపుము.

అర్జు:—మీరవలంబించినది యార్యసమ్మతమైన పద్ధతియని వారు మిగుల నానందించిరి. కాని నిశుంభున కంతటి గ్రహణశక్తియుండదని యభిప్రాయపడిరి. ఏమైనను మనము రాయబారము జరుపుట సజ్జనహృదయాకర్షకమని మీతో నుడువుమనిరి.

విష్ణు:—ఇఁక మనము శత్రువుతో—కాదు రత్నసానుదుర్గాధీశునితోఁ గావించుకొనవలసిన యొడంబడిక యెట్లుండవలయునో నిర్ణయింతము. మీమీయభిప్రాయములను మొగమాటమువీడి నిష్కర్షగా వచింపుఁడు.

కాల:—వజ్రధరుని మార్గమును మేమనుసరింతుము.

వజ్ర:—కుమారా! అపమార్గమును విడిచి సద్బుద్ధితో దేశక్షేమమునకు మనమొనర్చు కార్యములకు సహాయపడుచు నీసార్వభౌమత్వమున కంగీకరించినచో నిశుంభుఁడు గ్రాహ్యుఁడే. అప్పుడైన మనకు నాఁతడు సామంతుఁడై యుండవలయును. పాళెగాండ్రమీఁద నాతనికావంతయుఁ బెత్తనముండకూడదు.

అర్జు:—వజ్రధరుఁడు చెప్పినది తుదినిర్ణయము. ముందుగానే కర్ణకఠోరముగా వచించుట కార్యవాదులకుఁ బాఁడికాఁదు.

పూర్ణ:—అర్జునదేవుని వాక్యము ధర్మసమ్మతమైనది. సుకుమారములైన మాటలతో వజ్రదేవుని యభిప్రాయమును నిర్వచింపవలయును. ఒకవీసమేనియు మనమంతకుఁ దగ్గరాదు. కోఅలుపెటికియే పాములవాఁడు పామునాడించును.

కాల:—శస్త్రసన్న్యాస మొనర్చినఁగాని నిశుంభుని నమ్మరాదు. ఆతని దుస్తంత్రము నాకనుభూత పూర్వము.

వజ్ర:—నాయాశయమును మీరుమన్నించుచో భాషను సవరించుటకు నాకభ్యంతరము లేదు.

అర్జు:—భావోచితమగు భాష, భాషానుకూలమగు భావము నుండునట్లు వాచికమును సిద్ధము చేయుము.

వజ్ర:—వాచికముతోఁ బనియేమున్నది. ముఖాముఖిని సంభాషింపఁగల సమర్థుని బంపుమని నిశుంభుఁడు కోరియుండెను. మన మొక్క ముఖ్య సూత్రము నిర్ణయించితిమికదా! దానిని సాధించుటకు నిశుంభునితో నుచితరీతినిమాటలాడఁ

గలసమర్థుని బంపుదము. అతఁడేగి వారాడు మాటలకు సమయానుకూలముగా నుత్తరము లొసంగుచు వాక్చాతుర్యము మెఱయఁ గార్యము నెఱవేర్చుకొని వచ్చును ఎంత చెప్పినను మన సూత్రమును వారు గ్రహింపరేని రాయబారము భగ్నమైనట్లే తలంచి యెవరిప్రయత్నము వారు చేసికొన వచ్చును.

అర్జు:—ఇది బాగుగానున్నది ఈమాట యిట్లు చెప్పవలయు నని నిర్ణయించుకొని పోవుటయుఁ జిలుకవలె నావలుకు లక్కడఁ బలుకుటయుఁ గార్యసాఫల్యమునకు హేతువు గాదు. వారేమియడుగుదురో యెట్లు నిర్ణయింపగలము? సమయస్ఫూర్తిగల రాయబారి ప్రధానోద్దేశమును మనసున నుంచుకొని దానికి వలయుమాటలు సామము నవ లంబించి వచింపవలయును. వారియుక్తులను ప్రతిహతములు గావించుటతోఁ దృప్తినొందక యెట్లయిన వారినొప్పించుటకే నచ్చఁజెప్పవలయును. పైని బర్యవసానము దైవాయత్తము. అట్లుచేయుటే నిష్పక్షపాతముగాఁ గాలంక షముగాఁ గార్యము నిర్వర్తించుటయగును.

విష్ణు:—నాదొక ప్రతివాదనమున్నది. రాయబారి యుభయ పక్షముల శ్రేయము నాకాంక్షించి సముచితవాక్యములతో నిశుంభుని నుద్దేశించి తదీయులెల్లరు వినుచుండ నిట్లుచెప్పవల యును. "ఈదేశమున నివసించు ప్రజలు పెక్కుసంఘము లుగా నుండుటవలన నొకరినొకరు ద్వేషించుకొనుట పరిపాటి యైనది. దానిమూలమున నంతఃకలహములు జనించు చున్నవి. ఎవరికుట్టుకు వారే ఘనులమని విఱ్ఱవీగుటతో

దృష్టి నొందుచున్నారు. బలవంతులమధ్య బలహీను
లనేకులు నలిగిపోవుచున్నారు. ఈయవకాశమును బురస్క
రించుకొని దోఁపిడిగాండ్రు మార్గస్థులను హింసించు
చున్నారు. ఆటవికులు గ్రామములు కొల్లకొట్టుచున్నారు.
వారిదేశములకు హానికలిగినప్పుడు వీరు, వీరిప్రజలకు హాని
కలిగినప్పుడు వారు సంతసించుచున్నారు. లేదా, తటస్థులై
చూచుచున్నారు. మఱికొందఱు దుండగులను బ్రోత్స
హించుచున్నారు. ఇదినాగరికతకు లక్షణముకాదు. దేశ
మున శాంతి నెలకొనుటకుఁ బలుకుబడిగలవా రందఱు నైక
మత్యముగలిగి తమ తమ ప్రాంతవాసుల సౌఖ్యమునకుఁ
బాటుపడవలయును. విద్రోహులను శిక్షింపవలయును.
ఇట్టి కార్యములు సక్రమముగా జరుపవలయు నన్నఁ
బేరుపొందిన యాంధ్రరాజు లందఱొక సమాజముగాఁ
గూడి, సర్వజనసమ్మతి వహించిన బలశాలిని సమర్థుని బెద్ద
నెన్నుకొని తదనుమతిని శాసనముగా భావించుచు నసూ
యాది దుర్గుణములకు లోనుగాక తాము వర్తించుచు నిత
రులు వర్తించునట్లు చేయవలయును. న్యూనాధిక భావము
గాని, యధికారవాంఛగాని యెవ్వరికి నుండఁగూడదు.
ఒకరొకరి మత సంప్రదాయములకుఁ గాని, కులాచార
వ్యవస్థలకుగాని భంగకరముగాఁ బ్రవర్తింపరాదు. పరస్పర
సహకారము, దేశసౌభాగ్యము, జాతిగౌరవము, పరమ
లక్ష్యములుగాఁగొని సాధ్యమైనంతవఱకు స్వార్థపరత్వమును
వీడి ప్రజాభీష్టమును మన్నించుచు సత్యము, ధర్మము
నాయుధములుగాఁ బ్రజారాజ్యమేలవలయును. రాజా! ఇది
మాయాశయము, ఈయాశయమును బురస్కరించుకొనియే

మేము సామ్రాజ్యమును స్థాపింపఁ గోరుచున్నారము. ఇది మీకు సమ్మతమేని యిందలి పరమోత్కృష్టతను లక్షించి, మన మాంధ్రులము, ఇదిమన దేశము, ఇది మన జాతియని యెంచి వ్యక్తిగతములైన యహంకార మమకారములకు ప్రాధాన్యమీయక మాకుఁ జేదోడు వాదోడై నిలువుఁడు. దేశమును, బ్రజను, దైవమును జూచి మాయుద్యమమునఁ బాల్గొని మమ్ముత్సాహముతో నడపుదురుగాక యని స్నేహముతో వాంఛించుచున్నాము."

ఈమాటలువిని నిశుంభుఁ డేమనునో, ఆతని మంత్రులు సేనాపతులు నేమందురో ఆలకించి యిందలి మూలసూత్రములకు భంగము కలుగకుండ రాయబారి నచ్చఁజెప్పవలయును. అప్పటికి నాతనిబుద్ధి పెడదారిని వర్తించునేని చెండనాడక తదభిమత మెఱిఁగింపుమని యడుగవలయును న్యాయబద్ధములైన యాతని సూచనలు తప్పక మన్నింపఁబడునని విశ్వాసము పుట్టింపవలయును. అచిరకాలములోనే విజయవాటికలోఁ గనకదుర్గా సమక్షమున సర్వజన సమావేశము జరుగుననియు, నందు నేతృనిర్ణయము ప్రజాభిప్రాయమునుబట్టి పెద్దలచేఁ గావింపబడుననియుఁ దెలిపి వారిని, వారి పక్షమువారిని ఆహ్వానింపవలయును.

ఇట్లానర్చితిమేని యాపస్తంబ మహర్షి యాదేశమును మనమాచరించిన వారమగుదుము. కర్మాచరణమునకే పురుషుఁ డధికారి; పర్యవసానము దైవాయత్తము.

అర్జు:— (హర్షముతో) నీ వాక్యపద్ధతి హృదయంగమమై యున్నది. ఇంత సరళముగాఁ జెప్పిన గ్రహింపఁడేని నిజ

ముగా నిశుంభుఁడు రక్కసుఁడే. రక్కసుఁడే కాదు— దారక్కసుఁడు.

పూర్ణ:—కార్యవిధానము నిపుణముగా నీతియుతముగా నిష్కపటముగా నిర్ధరింపఁబడినది. దేవరబుద్ధిసంపద కిది యొక ఘనకార్యము కాదు.

అర్జు:—ఔను. మనలో మనము చక్రవర్తులమనుకొని మురియుటకంటె సర్వజనసమక్షమునఁ బెద్దలయనుమతిని గనక దుర్గాసమక్షమునఁ బదవిస్వీకరించుట శ్రేయోదాయకము.

వజ్రి:—ఇందలి వైషమ్యమును మీలో నొక్కరు గ్రహించి నట్లుతోఁచదు. సర్వజనసమూహముచే విష్ణుదేవుఁడే ఆంధ్ర చక్రవర్తిగా వరింపఁబడునని మనము నిర్ధారణచేసి గర్వింపవచ్చునా? దేశము విశాలము. లోకము భిన్నరుచి. నిశుంభుఁడు తులువ. ఏదైన విఘ్నము సంభవింపవచ్చు. ప్రజాదరము మఱియొక్కనికి లభించుట తటస్థించినచో—

పూర్ణ:—అసంభవ మసంభవము. ఎన్నఁటికి నట్లుఁజరుగదు.

విష్ణు:—ఆర్యా! ఏలయట్లు సంశయించెదవు. మఱియొక్కనికిఁ గాదు. నిశుంభునికే ప్రజాదరము లభించినను వానినే సమ్రాట్టుగా నంగీకరించి ప్రజాక్షేమము కుంటుపడకుండ రక్షించెద. దీనికెవ్వఁడు విఘ్నమాపాదింపఁ గడంగినను తత్‌క్షణమే వధించెదను. త్రిలోకము లెత్తి వచ్చినను సత్వరముగా నాంధ్ర సామ్రాజ్యము స్థాపితముకాఁగలదు. నమ్ముము! ముమ్మాటికి నమ్ముము!

అర్జు:—(స్వగతము) ఆహా! ఏమి యుదారత! ఈతని జూచి నపుడు నాహృదయము ప్రహ్వీభావమును వహించు

చుండును. తగిన మిత్రుఁడని యవ్యాజముగాఁ బ్రేమించు చుండును. నిక్కముగాఁ జక్రవర్తిత్వమున కితఁడే దగును. (ప్రకాశము) మిత్రమా! ఆర్యసంతతి క్షత్రియవీరుఁడు వచింపవలసిన మాట వచించితివి. హర్షావేశముచేఁ గౌఁగిలింపఁ దలంచితినిగాని యర్హుఁడనో కానో యని సంశయించి మానితిని.

విష్ణు:—(కౌఁగిలించుకొని) మిత్రమా! అర్హతానర్హతలు మైత్రికి లేవు. హృదయసంసర్గము పూర్వజన్మవాసనచేఁ గాని లభింపదు. తనువులు గలిసియున్న నెందఱిమనస్సులు వేఱుకావు? తనువులు వ్యవహితములైన నెవ్వరిహృదయము లొక్కటి యగునో వారే మిత్రులు.

వజ్ర:—(విశ్వసించి) కుమారా! ఎఱుఁగకపోవుటచే నిందలి నా బాధ్యతను గణింపవైతివి. మీజనకుఁ డంత్యకాలమున గోరఁగా నిన్ను సింహాపీఠ మెక్కించి సార్వభౌముం జేయుదునని నాదేవి యాధ్యాత్మికజ్యోతిసాక్షిగా మాటయిచ్చితిని. మరణాంతము బ్రహ్మచర్యము బాసచేసితిని. హస్తగతమైన ఫలమును సంశయగ్రస్తముగా నొనర్చిన నేనేమి చేయుదును! ఎట్లు జీవింతును?

విష్ణు:—(నిర్ఘాంతపడి కొంతసేపటికి) ఆర్యా! నా యపరాధమును క్షమింపుము. సహజమైన నిర్లిప్తతచే నయత్నసిద్ధముగా నమ్మాటలు నోటవెడలినవి. ఆడినమాట తప్పుట రాచపుట్టువునకుఁ బాఁడికాదు. ఉభయులము ఆత్మసుఖాభిలాషులము గాము. ఉభయులము నిష్కల్మష హృదయములతోనే ప్రతిజ్ఞలు చేసితిమి. ఉభయుల

ప్రతిజ్ఞా నిర్వహణమునకు భగవంతుఁడే దారిచూపఁగలఁడు. అందును బ్రహ్మచర్య వ్రతానుష్ఠానపరుఁడవగు నీ ప్రతిన నెఱవేఱదేని వేదశాస్త్రములు సారహీనములై యప్రమాణములు గావా ? నిర్వేదమెందుఁకు ?

వజ్ర:—క్షత్రియునకుఁ బ్రతిజ్ఞాని ర్వరణము నిర్వాణము. కాని నాఁడు నిర్వేదముగాక మఱియేమిగతి ?

విష్ణు:—నీ కెన్నఁడు ప్రతిజ్ఞాభంగము రాదు. ఆర్యా ! అనుమానము త్యజింపుము.

వజ్ర:—నీవనుకూలుఁడవై యున్న నాకెక్కడి ప్రతిజ్ఞాభంగము? (నవ్వును)

విష్ణు:—(తనలో) ఈతని హృదయము ప్రసన్నమైనది. బ్రతుకు జీవుడా ! (ప్రకాశము) ఆర్యా ! విష్ణుదేవుఁడు నీవు పెంచిన మొక్క ! అనుకూలుఁడు కాకేమి ?

వజ్ర:—ఈ సందర్భమునఁ బని మఱచితివి. రాయబారిగా నెవ్వరిఁ బంపుదము.

విష్ణు:—దీనిని సమర్థతతో నిర్వహింపఁగలవాఁడు నిన్ను విడిచిన యర్జునదేవుఁ డొక్కఁడే యని నా తలంపు. మిత్రమా! ఇక్కార్యమున నార్యవజ్రధరుని శ్రమపెట్ట నిచ్ఛ జనింపకున్నది. మణిభద్రుఁడు నీకుఁ దోడురాఁగలఁడు. అతఁడు రత్నసానుదుర్గమునకుఁ బరిచితుఁడు. కార్యము నెఱవేర్చుకొని రమ్ము. ఆర్యా ! శీఘ్రముగాఁ బ్రయాణసన్నాహము కావింపుము.

అర్జునదేవుఁడు తన యంగీకారమును దెలిపెను. వజ్రధర నియుక్తుఁడై పూర్ణభద్రుఁ డుత్తమాశ్వములఁ దెప్పించెను.

వజ్రధర విష్ణుదేవుల సెలవు తీసికొని యర్జునదేవుఁడు పయన మయ్యెను. మణిభద్రుఁడును బ్రయాణోన్ముఖుఁ డయ్యెను. అశ్వారోహణ మొనర్చుచుండ నర్జునదేవుని కుడిభుజమదరెను. ఎన్నియో శుభశకునములయ్యెను. దీని కేమి ఫలమని కౌతుకముతో నర్జునదేవుఁడు మనసులో విమర్శించుకొనెను. నిశుంభుఁడు సదుద్దేశముతో లొంగివచ్చునని విష్ణుదేవుఁడు శుభ శకునములఁ గాంచి వచించెను. రాయబారము భగ్నమై కుమారునకు విజయముతో సామ్రాజ్యము లభించునని వజ్రధరుఁడు హర్షించెను. మన కనుకూలముగాఁ గార్యము పర్యవసించునని పూర్ణభద్రుఁడు తలంచెను. నిశుంభుఁడు హతుఁడగు ననియుఁ గూతురు తనకు లభించుననియుఁ గాలకేతుఁ డువ్విళ్ళూరెను. క్షణములో నర్జునదేవుఁడు మణిభద్రానుగమ్యమానుఁడై నగరమార్గము నతిక్రమించెను. వజ్రధర పూర్ణభద్రులు నిజనివాసముల కరిగిరి.

విష్ణుదేవుఁడు గమనోన్ముఖుఁడైన మణిభద్రునివంక సాభిప్రాయముగఁ జూచెను. అతఁడు తేని అభిప్రాయము నెఱింగిన వానివలె నభినయించెను. అర్జునదేవుని రాయబారిగాఁ బంపుటలో నాతని కార్యసమర్థతయే కాక విష్ణుదేవుని రహస్యోద్దేశ మొకటి కలదు. మల్లిక కాతఁడు తగిన పురుషుఁడని యాతని యభిప్రాయము. రత్నసాను దుర్గమునకుఁ బోవునప్పుడు గోచరించిన శుభసూచన లాతని యుద్దేశమును బలపఱిచెను. రాయబారము నడపించు దినములలో నర్జునదేవుని మల్లిక చూచుట తటస్థించెనేని దైవసంకల్పము సూచితము కావచ్చునని విష్ణుదేవుఁ డూహించెను. కాఁగల కార్యములు పవిత్రములగు హృదయములందు ముందుగాఁబ్రతిబింబించుట యనుభవ

విరుద్ధముకాదు. మహర్షుల చిత్తములకు భూత భవిష్యత్తులు వర్తమానమువలె గోచరించునని చెప్పుదురు. విశుద్ధ హృదయులగు రాజర్షులు నట్టివారే.

విష్ణుదేవుఁ డందఱు వెడలిపోయిన పిమ్మట నొక్కింత తడవుత్కంఠితుఁడై స్తబ్ధుఁడయ్యెను ఆరాకాచంద్రబింబానన-ఆ జంగమ కల్పవల్లి - ఆసజీవస్వర్ణప్రతిమ కైవసమగుట యేనాఁటికో? అని యతఁడు వలవంత పాలయ్యెను. అర్జునదేవుఁడు తెచ్చు సందేశముతోఁబాటు మణిభద్రుఁడుగూడ నేమైన సందేశము తేవచ్చునని యతని కాశ జనించెను. 'నాగుట్టు తెలియక మొన్నటిపట్టు చేటిక ప్రసంగమును గుఱించి శ్రద్ధచేయఁడయ్యె. ఈ పర్యాయము రాజపుత్రికతోఁ బ్రసంగించిరాఁడా?' యనియు నాతఁ డనుకొనెను. దినములు గడుపుట దుర్భరముగాఁ దోఁచెను. అన్న పానీయములుగూడ నాతనికంత రుచింపవయ్యెను. ఆతఁడు పెక్కు విధములగు స్వప్నదృశ్యములఁ గాంచుచుండెను.

## పదునాల్గవ ప్రకరణము

వసుంధర తిరస్కరించుటయు నిశుంభుఁడు కోపించుటయు మణినాగుని మనోవేదనకుఁ గారణములయ్యెను. అన్ని విధములఁ దనకుఁ దగిన కన్నియయని, రెండురాజ్యము లిచ్చు వచ్చున న్నెలవచ్చునని, వనవిహారములు నౌకాయానములు వసుంధరా సహితుఁడై చేయవచ్చునని యేమేమో చిరకాలము నుండి మానస కాసారమున నాందోళితములైన భావతరంగము

లోకృపరి శాంతించుటయే గాక ప్రేమరసపూరము లింకఁ బొఱుటయు నిరాశాపంకము బయలుపడెను. మేనమామ మొగము చూచుటకు జంకుజనించెను. అతనికిచ్చట నుండుటయే కష్టముగాఁ దోఁచెను. స్వగృహమునకుఁ బోయినఁగాని చిత్తశాంతి లభింపదని యాతఁడనుకొనెను. ఆ విషయమై తల్లితో నాతఁడిట్లు ప్రసంగించెను.

మణి:—మనమువచ్చి చాలదినము లైనది. తండ్రిగారు మన రాక కెదురుచూచు చుందురు. వచ్చినపని యైనదికదా! ఇఁక బయలుదేఱి పోవుదము. మామ సెలవు తీసికొనుము.

యశో:—అగుటకుఁ గాకపోవుటకుఁ బనియేమున్నది? చాల దినము లైనదని యొకపరి చూచిపోవలయునని వచ్చితిమి. వచ్చినందుకు బాగుగానే యైనది. ఆ మంకుపిల్లతో నీకు వేళాకోళమేమిటి? ఏదో పరిహాసము చేసెనని తలంపక గా వెఱ్ఱిమొగము గోరంతలు కొండంతలుచేసి తండ్రితో జెప్పినది. తన తెలివి యేమి తెల్లవాఱినది. పరాయిలా? దానికిఁ బెద్దగొడవ చేసినాఁడు.

మణి:—జననీ! పెండ్లికాదని భయమా? మామ నాతో నింతవఱకు మొగమిచ్చి మాటాడలేదు. ఇక్కడ నొకక్షణ ముండుటయు నాకు శ్రమగా నున్నది.

యశో:—నిన్ననే నేను పెద్దమామయ్యతో మేమువెళ్ళవలయు నని చెప్పితిని. చిన్నమామయ్యకూడ నక్కడనేయుండెను. అతఁడుగూడ నీగొడవ యాలకించెను గాఁబోలు. అక్కా! నీ మనస్సులోఁ గష్టముంచుకొనకుము. వసుంధరయేకాని మల్లిక నీకుఁ దగిన కోడలుకాదా? యనెను. ఎందుకుఁ

గాదు? మీ యాబిడమాత్రము తక్కువ తిన్నదా? ఆమె కెన్ని కోరికలుండునో? యంటిని. ఆ మాటలువిని పెద్ద మామ కోరిక లెవ్వరికి లేవు. తల్లి లేని కూనయగుటచే మనసు నొప్పింపఁ జాలకున్నాను. ఈ గొడవ జరుగనిచో మీరు మీరు చెప్పిన బిడ్డ కాదనునా? ఇంతకు ఘటన లేదు. ఇప్పుడామె మనస్సు కెంత చెప్పిన నచ్చదనెను.

మణి:—నాకునచ్చునను కొనుచున్నావా? మీరందఱభిలషించుచున్నారని నేను మనసువిప్పి మాటలాడితిని గాని యింక దానిమొగము జూడను. కట్టి కాళ్లమీఁదఁ బడవేసిన నామెను ప్రేమింపఁజాలను. ఏదివిఱిగిన నదుకనగు గాని మనసు విఱిగిన నెన్నడు కలియదు. ఆ మాట నాకుఁ జెప్పకు. ప్రయాణముమాట చూడుము.

యశో:—నాతో సంబంధము తెగిపోవలసినదేనా? చిన్న మామయ్య దేవులాడుచున్నాఁడు. నేను వెళ్లెదనన్నప్పుడు పాప మింతమొగము చేసికొన్నాఁడు. మల్లికయే నాకళ్లకు జక్కఁగాఁ గనఁబడును. వసుంధర మొగముతీ అెప్పుడు మబ్బులోఁ బొద్దు గ్రుంకినట్లే యుండును.

మణినాగుఁడు మాటాడలేదు. ఆతని డెందమున నాశాంకురములు మొలకలెత్తెను. రాగద్వేషములు రెండు తుల్య నిరూఢిగాంచుచుండెను. మల్లికతోఁ దాను మహావిభవము లనుభవించుచు వసుంధర చిత్తము చిన్నపోయి పశ్చాత్తాపము పాలగునట్లు చేయవలయుననెడి సంకల్ప ముదయించెను. మహీంధరుఁడు సేనాధిపతి. రాజుతరువాత రాజు. ఆతఁడు తన కండయై నిలచినచో నిశుంభుని నిలకడమీఁదఁ

ద్రోసి రా జనవచ్చుననియు, వసుంధర నే పరిచారకునకో కట్టిపెట్టి పరిభవింపవచ్చుననియుఁ గూడ నాతఁ డూహించెను. ఈ యూహాసందోహముచే మణినాగుని మనసున ననురాగ లతిక మరలఁ జిగిర్చెను. మంచియుపాయము లభించినందు కాతఁడు సంతసించెను. ముఖమున సంకుచితభావము సన్న గిల్లెను. ఆనందరేఖలు పరిఢవిల్లెను. మాతా! నీయభిలాష మును భంగపఱచుటకు సాహసము చాలకున్నది. మాటనిలు కడలేని వీరిని నమ్మి యాశాభంగము నొందెదవేమోయని జంకుచున్నాను. నీయభిమతమునకెన్నఁడు నే నడ్డుచెప్పువాడను కాను" అని యాతఁడు తల్లితో నుడివెను. కుమారుని మాట లకు యశోధర హర్షించెను. మల్లికను బెండ్లియాడుట కంగీ కారము సూచించినందులకామె వానిని మెచ్చుకొనెను. "కుమారా! నాయందు నీకుఁగలభక్తి నెఱుఁగనా? ఆశాభంగ మొందుటకు వారినేమి ప్రార్థించితినా? మహీధరుఁడు రాజు దగ్గరనుండఁగా జెప్పినమాటకు వెనుకాడిన నాజీవితములో నింక వీరిమొగముజూతునా? శ్రీశైలమునకు సింహాళమెంతో, సింహాళమునకు శ్రీశైలమునంతే. ఎందుకు? ఇప్పుడే సంగతి తేల్చుకొందును. ఇష్టపడినచో వెంటనే వివాహము; కానిచో రేపె ప్రయాణము" అని స్త్రీస్వభావ సులభమగు నుబలాట ముతో ననెను.

మఁశ:— తొందరపడవద్దు. వారిప్పుడు రాజకార్యములలో మునిఁగియున్నారు. మొన్న నేదో యొక రాజునొద్దనుండి సందేశము వచ్చినదఁట. మరల నిన్న వారిరాయబారి వచ్చె నట. రాయబారము భగ్నమైనచో ఘోరసంగ్రామము తప్పదనుకొనుచున్నారు. మహీధరుఁ డొకవంక యుద్ధ

ప్రయత్నములుగూడఁ జేయుచున్నాఁడు. ఏమి కారణమో కాని పెద్దమామయే శాంతముగా రాయబారము వినుచున్నాడఁట. అది తక్కిన యిక్కడవారి కెవ్వరికినంతగా నభిమతమైనట్లు కనఁబడదు.

యశో:—యుద్ధము తటస్థించిన సైన్యముతోఁ దోడురమ్మని మీతండ్రిగారికి వర్తమానము పంపఁగూడదా?

మణి:—ఏమో? మనకేల యీ పిలువని పేరంటము? వర్తమానమే పంపినఁ దూర్పుతీరమంతయు యుద్ధనౌకలతో నింపివేయమా? ఒకవేళ రాయబారము పర్యవసానము చూచుకొని యాపని చేయుదురేమో?

యశో:—అట్లైన మహీధరుఁడు నిన్నిప్పుడు విడిచిపెట్టఁడు. యశోధరచిత్తవృత్తి యెట్లున్నదో కనుఁగొనుట కభ్యంతర ముండునా?

మణి:—అభ్యంతరములేదు. సమయమెఱిఁగి మాటాడనిచో హింసవైన వెగటుగాఁదోఁచునని చెప్పితిని. పైనినీయిష్టము.

యశోధర వెడలిపోయెను. మణినాగుని చిత్తమున నూహాలపై నూహ లుప్పతిల్లఁ దొడఁగెను. రాయబారము భగ్నమై యుద్ధమేతటస్థించిన సైన్యసమూహముతో మహీధరునకు బాసటయై నిలిచి తన నైపుణ్యమును జూపవచ్చునని యువ్విళు లూరసాగెను. ఆతనిచిత్తఫలకమున మల్లికాసౌందర్యము ప్రతిఫలింప జొచ్చెను. ఊహాతరంగముల తాఁకుడుచే నాఁతడొకప్పుడు ముదితుఁడు, నొకప్పుడుముగ్ధుఁడు, నొకప్పుడు విభ్రాంతుఁడు నగుచుండెను.

యశోధర లోనికరుగు నప్పటికి యశోద యొంటరిగాఁ గూరుచుండి మల్లిపూవులను దండగాఁ గూర్చుచుండెను. క్రమముగా మాటధోరణి తెచ్చి యామె మల్లిక పెండ్లి విషయమై ప్రస్తావించెను. మహీధరుఁ డంతకుముందే యశోదతో నావిషయము ముచ్చటించి యున్నందున యశోద సుముఖత గానిపింప సమాధాన మిచ్చెను. భర్తయంగీకారమే తనయంగీకార మనియు భర్తమాట కెదురాడుటకుఁ దానెంతయు జంకుదు ననియు వదినెగారి కెఱిఁగించెను. యశోధర హృష్టహృదయయై మునుపటికంటె మల్లికను స్నేహ గౌరవములతో లాలింప సాగెను.

# పదునైదవ ప్రకరణము

రాజప్రాసాదమునకుఁ బ్రక్కనున్న చిన్న సౌధమున నర్జునదేవునకు విడిది యేర్పరుపఁబడెను. మణిభద్రుఁడాతని ననేకవిధముల ననువర్తించుచుండెను. ఆతని సత్ప్రవర్తనమునకు మెచ్చి యర్జునదేవుఁడు మణిభద్రా! నీవు రాజునకుఁదగిన బంటువని ప్రశంసించెను. వినయ విధేయతలుప్పతిల్ల మణిభద్రుఁ డర్జునదేవునకు విష్ణుదేవునకు వలెనే సపర్య లొనరించుచుండెను. విష్ణుదేవుఁడు చెప్పమన్నరీతిని రాయబారము విషయములను మఱింత పొందుపఱచి యర్జునదేవుఁడు నిశుంభున కెఱిఁగించెను. నిశుంభుఁడు శాంతచిత్తముతో విని మేము పర్యాలోచనము చేసికొని మీకు సమాధానమిచ్చెదము. అంతవఱకు మీరు మాకతిథులై యుండఁగోరెదనని సగౌరవముగా వచించెను. విమర్శించుకొనుటకు న్యాయముగాఁగావలసినంత యవకాశము

పూర్తిగా మీరు వినియోగించుకొన వచ్చునని చెప్పి యర్జున దేవుఁడు విడిదలకు వచ్చెను. కుఱుమట్టమైన యాసౌధరాజమున రాజకుమారోచితములగు భోగ్యవస్తువు లనేకములు పొందు పఱుపఁబడియుండెను. సౌధముచుట్టు పుష్పలతలు గున్నచెట్లపై నల్లిబిల్లిగాఁ బ్రాఁకి సౌరభమును వెదచల్లుచుండెను. మేడ వెనుక సుందరోద్యానము రాజసౌధోపవనముతోఁ గలిసి వివిధవృక్ష వితానములతో విరాజిల్లుచుండెను. అర్జునదేవుఁడు సౌధోపరిభాగమున మహార్హాసనమున నుపవిష్టుఁడై యుండెను. మందమలయానిలుఁ డాతని యుత్సాహసంపదకుఁ దగినట్లు పరిచర్యచేయుచుండెను. ఆరాజకుమారుఁడు మణిభద్రునితో నిట్లు ప్రసంగించెను.

అర్జు:—నిశుంభుని వైభవ సమగ్రత నిరుపమాన మైనది. మన మింతకుముం దనుకొనినంత క్రూరత్వ మీతనియం దున్నదా యని నాకు సందియము పొడముచున్నది. దర్పము, రాచఠీవి, మన్నన యించుకంతయుఁ గొదువలేక యొప్పారుచున్నవి.

మణి:—నాకు నట్లే తోఁచినది. నిపుణతతోఁ గార్యము పరిశీలింపఁగల బుద్ధిసంపదకుఁగూడఁ గొఱత లేదు. తనకుఁ గలిగిన యభిప్రాయము నెవరెంత చెప్పిన మార్చుకొనఁ జాలఁడని యతని పరిజనులు చెప్పుచున్నారు. తనదే పయిచేయిగా నుండవలయునను పట్టుదలతోఁ గార్య తంత్రములు నడుపుచుండునఁట.

అర్జు:—అది దుర్గుణము కాదననుగాని బలశాలికది నైసర్గికము.

మణి:—ఆ కనఁబడునదే మహారాజునంతఃపురసౌధము. దానిని జూచినప్పుడు కైలాస శిఖరము స్ఫురించుచుండును. అందే సార్వభౌముని దేవి—(నాలుక కఱచుకొని తెల్లపోవును.)

అర్జు:—ఏమట్లు సంశయించెదవు? సార్వభౌముని దేవియా? ఎవరు? నిశుంభునకుఁ బత్నీవియోగము తటస్థించినట్లు విని యుంటిమి.

మణి:—దేవా! దేవరహస్యము. నోరు జాఱినది.

అర్జు:—విష్ణుదేవుఁ డొకటి నేనొకటి కాదు. రహస్యమైనచో వెల్లడింపను. చెప్పుము.

మణి:—నిశుంభుని తనయ యందు వసించుచుండును. మన సార్వభౌముని హృదయసీమ ననురాగలత నాటిన సౌందర్య రాశి యామె.

అర్జు:—(ఆశ్చర్యహర్షములతో)నామిత్రుఁడు నిశుంభునితనయను వలచెనా? వజ్రధరుఁడు దీనికి సమ్మతించెనా? ఓహో! ఆమె కాలకేతుని తనయయై యుండును. ఆపస్తంబునివలన నాసమాచారమును వినియున్నాఁడను. ఇది యెట్లు సంఘటించినది?

మణి:—మొన్ననే సార్వభౌముఁడు చెప్పఁగా వినియున్నాను. ఈ మధ్యసింహాళమునుండివచ్చుచు నిశుంభుని బంధువులు దొంగలచేఁ గొట్టఁబడి యెఱ్ఱపాలెమున నొకటి రెండుదినము లాఁగిరఁట! అప్పుడు దేవుఁ డాపస్తంబాశ్రమమునుండి యాదారినే వచ్చుట తటస్థించెనఁట. అక్కడ వా రొండొరులఁ జూచుకొనిరి. ప్రథమ సందర్శనముననే యిరువుర మనసు లేకమైనవి.

అర్జు:—మిత్రుని వలపించిన యా కన్యామణి వేల్పుఁగన్నియల మించియుండుననుట నిస్సంశయము. నిశుంభుఁ డింత శాంతుఁడై రాయబారము సాగించుట కిదియే కీలకమై యుండవచ్చును. నీవామె నవలోకించితివా ?

మణి:—ఇంకను జూడ లేదు. చూచిరమ్మని ప్రభువాజ్ఞాపించెను. అమూల్యమగు రత్నభూషణ మామె శిరమున నలరారుచు దివ్యకాంతులు చిమ్ముచుండునఁట ?

అర్జు:—(తనలో) ఆప స్సంబుఁడు చూపిన మణిభూషణము కాదుగదా! (ప్రకాశము) ఆ రత్నభూషణమును గుఱించి మిత్రుఁ డింకేమైన వివరించెనా ?

మణి:—ఆప సంబమహార్షి దానిని దేవునకు సమర్పించెను. సార్వభౌముఁడు దాని నామె కొసంగెనఁట !

అర్జు:—అయినచో నేనా రత్నభూషణమును జూచితిని. అది జేరఁదగినచోట జేరి ధన్యమైనది. మణిభద్రా! నిశుంభ తనయ - కాదు - కాలకేతు తనయ తప్పక యిందిరాదేవి యవతారమేమో యని నాకుఁ దోచుచున్నది.

వారిట్లు సంభాషించు సమయమున రాజసౌధోపరి భాగమున మల్లికా వసుంధరలు విస్రంభ విహారము సలుపు చుండిరి. గవాక్షమార్గమునుండిమణిభద్రుఁడువారినిస్పష్టముగాఁ జూచెను. శిరోభూషణమందలి రత్నదీధితులు శంపా లతల వలె మిఱుమిట్లు గొలుపుచుండెను. అర్జునదేవునకుఁ జూపి యామెయే మన రాణియని మణిభద్రుఁడు వచించెను. ఎంత ప్రసన్నమైనయాకృతి. లోకమున సనుగ్రహింప నవతరించిన మహాలక్ష్మియో, రాజరాజేశ్వరియో కాక సామాన్యమానవ

వనితకేమి, యిట్టి యనన్య సామాన్య సౌందర్య గరిమయేమి ? నాఁడు మహర్షి యాపస్తంబుఁడా రత్నమును జూపినప్పుడు కలిగిన ప్రహ్వీభావమే, మాతృబుద్ధియే నేఁడీమెను జూడఁగా జనించుచున్నది. మిథునకరాంగి యగుట కీమె యెంతయుఁ దగియున్నది. మణిభద్రా ! ఆమెతో విహరించుచున్న యా తనుగాత్రి యెవ్వరు ? ఆమెయుఁ గన్యకవలెను, రాజదుహిత వలెను గానఁబడుచున్నది.

మణి:—ఆమె నిశుంభుని సోదరుఁడు, సేనాధిపతి యగు మహీధరుని కూఁతురు మల్లిక యఁట. వీరిరువురు నెప్పుడు గలిసి యుందురని ప్రభువే సెలవిచ్చెను. వారి నెఱుగుటకే రత్నాభిజ్ఞానము తెలుపఁబడినది.

అర్జున:—ఎంత మధురమైన యాకృతి. వీరిద్దఱు విశాఖా నక్షత్రముల వలె మెఱయు చున్నారు. అన్నదమ్ముల బిడ్డలా?

మణి:—(అర్జునదేవుని దృష్టి సాభిలాషముగా మల్లికపైఁ బ్రసరించుట కనిపెట్టి) బయటికిబోయి పరికింతము.

అర్జు:—వలదు వలదు. మనము వారిని జూచుచున్నట్లు గ్రహించిరేని లోనికిఁ బోవుదురు. విస్రంభవిహారమొనర్చు వీరిదర్శనము నాకు గనువిందొనర్చుచున్నది. ఏమిసొకు మార్యము! ఎంతచక్కదనము ? సమానరూప లావణ్యశోభితలైనను వీరియాకృతి మాధుర్యమున భేదము లేక పోలేదు. ఒకటి రత్నమువలె నుజ్జ్వలము. ఒకటి కాంచనము వలె కమనీయము. ఒకటి యుషస్సువలె నోజోవంతము. ఇంకొకటి చంద్రికవలెఁజక్షురుత్సవకరము. ఒకటి కోరకము; మణియొకటి ప్రవాళము. అది మిత్రప్రీతి విధాయకము.

ఇది యాత్మానంద సంధాయకము. అట్లయ్యు న్యూనాధిక వివక్షకుఁ దావిచ్చుట లేదు.

మణి:— రాజపుత్రా! మనము రాయబారులమను మాట మఱచిపోయితివా ?

అర్జు:—(వినిపించుకొనక) అదిగోవారు పావురములతో నాడుచున్నారు. కపోతవల్గనముకంటె వారిముఖవల్గనము హృదయాకర్షకమైయున్నది. అదెయొక కలరవ మిటు వచ్చుచున్నది.

పావురమువచ్చి కోణేగ క్రింది కటకటాల కమ్మిపై వ్రాలెను. అర్జునదేవుని ప్రోత్సాహమున మణిభద్రుఁడు మెల్లగాఁ బోయి దానిని బట్టుకొనెను. రాజకుమారుఁడును కుతూహలముతో దాని నందుకొని చూచుచుండెను. రాజపుత్రికలు పావురము నరయుచుఁ దటాలున వారిని జూచిరి. లజ్జాపరవశలై లోనికరిగి వీరెవ్వరై యుందురని వితర్కించుకొనుచు గవాక్షరంధ్రములనుండి పరికింపసాగిరి. "ఆర్యపుత్రునివలె మధురప్రియదర్శనుఁడగు నీరాజకుమారుఁ డెవ్వరైయుండును. కాకులేశ్వరుని మిత్రుఁడై యుండవచ్చును. మాతండ్రితో నామహామహుఁడు రాయబారము జరుపుచుండెనుగదా!" యని వసుంధర తలంచెను. మల్లికయు నర్జునదేవుని ఱెప్పవేయక పరికించుచు "నీరాజకుమారుని సందర్శనమున నాడెంద మేల యిట్లు స్నిగ్ధమగుచున్నది? ఈతఁడు రాయబారియైనంత మాత్రమునఁ బ్రేష్యుడగునా ? శ్రీకృష్ణుఁడు యుధిష్ఠిరునకు, నిషధేశ్వరుఁ డింద్రునకు దౌత్యమొనర్ప లేదా? మిత్రకార్యసంపాదనమునకై పూనివచ్చిన యీరాజకుమారుఁ డేదేశమును దననివాసముచేఁ బవిత్రము

గావించుచున్నాఁడో ? ఈ జయంతునిగన్న యా శచి ఎవ్వరో? ఈ సుకుమారుని బేర్కొనుచు నేయక్షరములు సార్థకములగు చున్నవో ? " అనుకొనుచుండెను.

వసుం:—మల్లికా! చిత్ర ప్రతిమవలె నట్లే నిలిచి చూచుచున్నావేమమ్మా!

మల్లిక:—(వినిపించుకొనక తనలో) ఏమి యా నగుమొగము తీరు! ఆకర్ణాంత విశాలములైన యా కనుదమ్ముల ధాళధళ్యము. సర్వావయవములు చెప్పినట్లు సృజించి నటువ

వసుం:—ఏమమ్మ ! మాట వినిపించుకొనవు? అంతటి పారవశ్యమా?

మల్లి.—నీ వేమంటివి ? ఏమి వినిపించుకొనకుంటిని ?

వసుం:—చిత్ర ప్రతిమ వలె నట్లే నిలిచితివేమని యడిగితిని.

మల్లి:—పావురమును విడిపించుట కుపాయ మాలోచించుచున్నాను. అది యా పురుష పుంగవునకుఁ జిక్కినది!

వసుం:—అది యొక్కటే చిక్కినదా!

మల్లి:—(నర్మహాసముతో)అందఱు నీవలె ననుకొనుచున్నావు. కనులు పచ్చఁబడినవారికి లోకమంతయుఁ బచ్చగాఁ గానిపించునఁట !

వసుం:—నీ గడుసరిమాటల కేమిగాని పావురమును గరతాళములచే నాహ్వానింపుము. అది వచ్చునేమో ?

మల్లి:—ఎట్లు వచ్చును ? దానిని బట్టుకొన్నారమ్మా !

వసుం:—(మందస్మితముతో) ఎవరు ?

మల్లి:—(ప్రణయ కోపముతో) ఎవరా? మీ యాయన రాయబారి!

వసుం:—(ఇంచుకనమ్రయై) మంచిదే. ఆమాటే నేను దిరుగ వేయుచున్నాను.

మల్లి:—ఎంత చమత్కారపు గుల్లవో! పై కేమియు నెఱుంగని బేలవలె నుందువు. పైఁగా నావి - గడుసరిమాటలు.

వసుం:—పోనిమ్మ! పావురమును దెచ్చుటకుఁ జేటినిబంపుము. అది యా పురుషవరేణ్యుని గోరి తేఁగలదు. సాయంసమయమునకుముందుఁ బ్రమదవనమునకుఁ బోవుదమనుకొంటిమి గదా? దానికిఁ గాల మతీతము గాకుండఁ జూడు.

మల్లి:—ఓ సరే చేసెదను.

అని యామె క్రిందికిఁ బోయెను. చేటికనుబిలిచి రహస్యముగాఁ బావురముసంగతి నెఱిఁగించి యానెపమునఁబోయి యా రాయబారి కులగోత్రములను తెలిసికొని కాకులేశ్వరుని ప్రణయకథ నెఱిఁగిరమ్మని పంపెను. నీవు వచ్చుటకాలస్యమైనచో మేము ప్రమదవనమున నుండుదుమనికూడ నామె చేటికతోఁ జెప్పెను. చేటిక బయలుదేఱిపోఁగానే తాను మరల సౌధోపరిభాగమునకేగి వసుంధర వనగమన సన్నాహములో నున్నందున నెప్పటియట్లు సోరణగండ్లనుండి రాయబారి సౌధమువంకనే చూచుచుండెను. కొంతసేపైనపిమ్మట రాయబారియు ననుచరుఁడును మేడదిగి క్రిందకేగుట నుపలక్షించెను. అప్పటికి వసుంధరసన్నాహము పూర్తియైనందున నిరువురు గలిసి ప్రమదవనమునకేగిరి.

మల్లికచే నియుక్తయైన చేటిక రాయబారియున్న విడిదల కేగెను. అర్జునదేవుఁడు పావురమును దగ్గఱ నుంచుకొనియే నిశుంభుఁడు తెలిపిన సందేహములకు సమాధానములు వ్రాయు చుండెను. చేటిక యించుక దవ్వుగాఁజాటున నిలిచెను. మణి భద్రుఁడామె తమతోఁ బనిగలిగి వచ్చినట్లు గ్రహించి యచ్చే రువ కేగెను. ఆమె మణిభద్రుని బ్రశ్నించి యర్జునదేవుని కుల గోత్రాదులు తెలిసికొని పావురమునిమ్మని యడిగెను. రాజ పుత్రుఁడు పని తొందరలో నున్నాఁడు; అది పూర్తియగునం దాఁక నిరీక్షింపుము. వారి సెలవుపొంది తెచ్చియిచ్చెదను అనిచెప్పెను. ఇరువురు నొకప్రక్కగాఁ గూరుచుండి యిట్లు సంభాషించిరి.

చేటి — మొన్న నీవు వచ్చినపనిని గుఱించియేనా యిప్పుడు సమాలోచన జరుపుచున్నది. పర్యవసాన మెట్లుండునో యేమైన నూహింపఁ గలిగితివా?

మణి:— మొన్నటివిషయమే. దానిని విపులముగా విమర్శించు చున్నారు. ఇప్పటివఱకు సంభాషణము సామరస్యము తోనే జరుగుచున్నది. శుభోదర్కము గావచ్చుననియే యూహించు చున్నాము.

చేటిక:— దైవ మనుగ్రహించుఁగాక! మీ రాజేంద్రునకు క్షేమమా ?

మణి:— ఆమహాత్ముని క్షేమమున కేమికొఱఁత ?

చేటిక:— మీధరణీపాలునిహృదయము కఠినమైనదనుకొందును.

మణి:— కాదు. ఆప్రభువు దయాసముద్రుఁడు. నీవేల యట్లను చున్నావు ?

చేటిక:—చందమామ సుకుమారమైనదనియే అందరు తలంతురు. ఆయి కఠిన మైనదని తెలియని వారుండరుగదా! చంద్ర కిరణములు సోఁకినంతనే ద్రవించు చంద్రకాంతము కఠినమా? చంద్రుఁడు కఠినుఁడా?

మణి:—ఉదయించినంతనే చంద్రుఁడు చీఁకటిని బహిష్కరించుట మొదలుపెట్టును. దేనికైనఁ గాల మనుకూలము గావలయుఁగదా? ఎంతతొందర పడినను శరత్కాలము రానిదే మేఘావరణము తొలఁగునా?

చేటి:—మేఘములచాటున నుండియుఁ గలానిధి తొగకన్నియను నవ్వించుచునే యుండును. అది యాతని ప్రకృతి.

మణి:—మొన్నటి నీ ప్రసంగమును మాఱేఁడు ప్రణయపూర్వకముగా నాలకించెను. మీరాజపుత్రిక కరగ్రహణమున కా దేవుఁడెంతయుఁ దమకించుచున్నాఁడు.

చేటి:—నీమాటతథ్యముగుఁగాక! మారాజపుత్రి విరహవేదనచే నలఁగాఁగుచున్నది. ఆ మహాపురుషుని గుణవర్ణనముకంటె నితరము లామెకు రుచింపకున్నవి.

మణి:—మీ నృపాత్మజ యేమైన సందేశ మొసంగినచోఁ గొనిపోయెద.

చేటి:—రేపు ప్రొద్దు వాలఁబడఁగానే యీ సౌధము నంటియున్న యుపవనసీమకు మీరాయబారి నొకసారి తీసికొని రాఁగలవా? మారాజపుత్రికలు మన్మథపూజ చేయుదురు. సౌభాగ్యవర్ధక మగుటచే యశోదాదేవి కుమారికల నా వ్రతమాచరింప నియోగించినది. అప్పుడక్కడ వారిరు

వురు, నేనుదప్ప నొరులెవ్వరు నుండరు. నీవు, మీరాకొమ రుఁడు వచ్చినచో మా రాజపుత్రి నీతో మాటాడుటయే గాక మఱియొక మేలుకూడఁ గంటఁబడఁగలదు.

మణి:—మా రాజమిత్రుఁ డట్లుచేయుట కిష్టపడునేని వచ్చె దము. రాజకార్యముల తొందర కలిగినను, నాతఁ డిష్టపడ కున్నను నట్లు చేయఁజాలము.

చేటిక:—అట్లైన వారి కీసంగతి యెఱుకపఱుపకుము. వన విహారము వంకపెట్టుకొని యటు చేయవచ్చును. మారాజ పుత్రికలకుఁగూడఁ దెల్పను.

మణి:—రాజాంతఃపురములోఁ బనిక త్తెలతోఁ జెరలాటము ఏ విధముగానైన కార్యభంగమునకుఁ గారణమగునేని—

చేటిక:—ఎన్నటికి నట్లుకాదు. రాజ రహస్యమును జెప్పు చున్నాను. నిశుంభ మహారాజే తనయ యభీష్టమును మన్నించియున్నట్లు, దానిననుసరించియే రాయబారములు జరుపుచున్నట్లు మహీధరాదు లూహించుచున్నారు. ఈ రాయబారమునకు వారందఱు విముఖులయ్యు మహారాజు నకు వెఱచి కిక్కురుమనకున్నవారు. అదిగో! మీ ప్రభుఁడు నీకై యరయుచున్నట్లున్నాఁడు. నన్ను శీఘ్రముగాఁబంపుము.

మణిభద్రుఁడు తొందరగా నర్జునదేవుని సమీపించెను. ఆతఁడు మడఁచిన పత్రిక మణిభద్రునిచేత నుంచి వేగముగా దీనిఁ గొనిపోయి నిశుంభున కందఁజేసి రమ్ము! అంతవఱకుఁ బావురముతోఁ గాలక్షేపము చేసెద నిటు తెమ్ము” అనెను. మణిభద్రుఁడు పావురముకొఱకుఁ జేటిక వచ్చినట్లు విన్న వించెను. అయినచో నిటురమ్మను మని రాజపుత్రుఁడు కుతూ

పాలముతో ననెను. మణిభద్రుండు చేటికకా సంగతి యొఱిం గించి తాను నిశుంభు నాస్థానమునకుఁ బోయెను. చేటికవచ్చి యర్జునదేవునకు మ్రొక్కెను. పావురము చేటికను జూడఁగానే యర్జునదేవుని చేతిపట్టు విడిపించికొని యమ్ముగుద భుజాగ్ర మున వ్రాలెను. చేటిక నవ్వుచుఁ బశుపక్ష్యాదులు మచ్చిక చేయువారిని విశ్వసించును. రాజకుమారుఁడు వినోదింపఁ దలఁ చినచో నుంచుకొని తరువాతనే విడువవచ్చును అని పావుర మును బుజ్జగించి చేతి కందీయఁబోయెను.

అర్జు:—వలదు వలదు. దాని యభిమతమునకు భంగము చేయుట నాకు సమ్మతముకాదు. నీవు తీసికొని పోవచ్చును. దీని—(సంశయించి యూరకుండును)

చేటి:—దేవరవారేదో చెప్పఁదలఁచి సంశయించిరి. ఈదాసి యన్యాగాలని తలంప నక్కఱలేదు. ఆర్యా! రాజాంతః పురములందును గన్యాంతఃపురమున మెలఁగుచుండు మాకుఁ గత్తులమీఁది నడక బాల్యాభ్యస్తమే.

అర్జు:—కావచ్చును. ఇపుడు దాని యుపయోగము మాకం తగా లేదు. దీనికొఱకు మీరాజపుత్రిక లాత్రపడుచుండు రని చెప్పఁబోయి నీరాకయే దానిని వ్యక్తము చేయుచుండ మఱి చెప్ప నెందుకని విరమించితిని. నీవింక నేగవచ్చును.

చేటిక 'యేఁమిగాంభీర్య' మనుకొనుచు వెడలిపోయెను. అర్జునదేవుఁడు రాజపుత్రికలను గుఱించియేమో యడుగఁదలఁచి సంశయించినమాట నిజమే. చేటి వెడలిపోయిన పిమ్మట మల్లికాముఖపుండరీకమునే స్మరించుచుఁ దదీయవిలాసములనే మననము చేయుచుండె. ఆమెకుఁ దనపై వలపు జనించినట్లు

లాతఁడు గ్రహించుట కెట్టి యవకాశము చిక్కదయ్యెను. చేటికతో నా ప్రసంగమెత్తి తన హృదయమును వెల్లడించుట కాతఁ డిష్టపడక నాలుకచివరకు వచ్చిన మాటనునిరోధించెను.

మణిభద్రుఁడు నిశుంభునకుఁ బత్రిక సమర్పించి తిరిగి వచ్చెను. అర్జునదేవుఁడు 'వారేమైనఁ జెప్పుమనిరా' యని యడిగెను. జేపు 'ముఖాముఖి నన్నివిషయములు చర్చింతమని నిశుంభుఁడు మీకెఱింగింపు మనియె' నని మణిభద్రుఁడు తెలిపెను. వారి ముఖలక్షణము లెట్లున్నవని రాజకుమారుఁడు ప్రశ్నించెను. 'యథాపూర్వముగానే యున్నవి. వచ్చుచుండఁగా దారిలో నొక భటుఁడు విజయవాటిక కెట్లు పోవలెనని యడిగి సావధానముగా మార్గమును దెలిసికొన్నవాఁడు. ఆతని వాలకము చూడఁగా విజయవాటికకు నిశుంభుఁడు ప్రయాణ మగుచు ముందుగా నచ్చటి స్థితిగతులు చూచిరమ్మని పంప వాఁడు పోవుచున్నట్లు తోఁచినది.'

అర్జున:—నీమాట లుత్సాహ జనకములైనవి. కార్యము ఫలింపఁజేసికొని పోఁగలమను ధైర్యము కలిగినది. ఇంకొక దిన మాలసించినను వచ్చినపని యనుకూలమగునేని ముదావహ మగును.

మణి:—మీరు వచ్చుటయు మఱియొక లాగున జరుగుటయుఁ బరస్పర విరుద్ధములు కావా? రత్నసాను దుర్గమంతయు మీరాకచే దాఁగిలిమూతలకు లోనైనది. ఎక్కడఁ జూచినను గుస గుసలే.

అర్జు:—శుభాంతమగుఁగాక! రమ్ము! పైకిఁబోవుదము.

(ఇరువురు మరల మేడమీఁది కేగిరి.)

# పదునాఱవప్రకరణము.

మరుసటి యుదయమున నర్జునదేవుఁడు కాల్యకృత్యములు నిర్వర్తించుకొని నిశుంభుని యాహ్వానమున కెదురు చూచుచుండెను. కార్యకలాపమును ముగించుకొని శీఘ్రముగాఁ గాకులముపోయి మిత్రుఁడు తనమీఁదఁ బెట్టిన భారమును డింపుకొన వేగిరపడుచున్న యాతనిడెందమును మల్లికవెనుకకు లాగుచుండెను. ధీరుఁడగుటచేమనసుచిక్కఁబట్టుకొని రాజకార్యములఁ బ్రమాదము సంభవింపకుండ శ్రద్ధాళువై వేయి కన్నులతోఁ జూచుచుండెను. ఆతఁడు పూర్వాపరముల విమర్శించుకొనుచుండ మణిభద్రుఁడు నమస్కరించి యమాత్యప్రసేనుఁడు దర్శనార్థియైవచ్చినట్లు విన్నవించెను. లోనికిఁదీసికొనిరమ్మని యథార్హసత్కారము లొనర్చి 'మీమహారాజుగారొక నిశ్చయమునకువచ్చిరా'యని యతఁడాతనిఁ బ్రశ్నించెను. పిమ్మట నుభయులు నీ క్రిందివిధముగా సంభాషించిరి.

“చాలభాగము నిర్ణీతమైనట్లే. కొన్ని ముఖ్యవిషయములను మనమిప్పుడు తేల్చికొందము”

“మీ విషయ విభాగము నెఱిఁగింపుడు పరిశీలింతము”

“సమితి సమకూర్చుటకివి ప్రబలాటంకములు కావు కాని నిష్కర్షమంచిది.”

“నిష్కర్షచేయక యే యంశమును విడువవలదు. హృదయపరిశుద్ధికి స్నేహవృద్ధికి నిష్కర్షప్రధానకారణమగును. సందిగ్ధముగానున్న విషయము స్వల్పమైనను గార్యము సాగనీయదు.”

"అందుకనే మనవిచేయుచున్నాను. ఇప్పుడు మనము మనసుకలిసి మాటలాడుకొనుచున్నాము. ఇంతకుఁ బూర్వ మెవరి కేప్రదేశ మందుపాటులోనున్న వారాప్రదేశమును లోఁబఱచుకొని పాలించుచున్నారు. ఇఁకముందు పరరాజ్యాక్రమణము నిరోధింపఁబడును. కావున నెవరిదేశ మెంతవఱకో హద్దులు నిర్ణయించుకొని పొలిమేర లేర్పఱచుకొనవలయును. ఇది మొదటివిషయము."

మంచిదే! "దీనికి నానిర్ణయము సూచించుచున్నాఁడను. గోదావరీనది కెగువనున్న దేశము మాయన్నగారి యేలుబడిలో నుండును. అది భీమమండలమని వ్యవహరింపఁబడును. కృష్ణాగౌతమీ ముఖద్వారముల నడుమనున్న ప్రాచ్యభాగము కాకులేశ్వరుని యధికారమునకు లోఁబడి యుండును. అది క్షీరరామమండలమని ప్రసిద్ధికాంచఁగలదు. శ్రీశైలపర్వతము నంటియున్న మధ్యదేశము మహీధరమండలమను పేర మీరాజేంద్రునిచే రక్షింపఁబడుచుండును. కాళేశ్వరము మొదలుకొనియున్న యింద్రావతీతీరము వాయవ్యమండలమను పేర కాలకేతు సంతతివారిచే, నేలఁబడుదేశమని భావింతము. ఆయాదేశముల మధ్యనున్న గ్రామములను కూటములుగా, మండలములుగా విభజించి పరిపాలనకు సౌకర్య మనువుపఱిచి సామ్రాజ్యరథము నిరాఘాటముగా సాగిపోవుటకు రాచబాట నిర్మింతము. ఎవరిదేశమునువారు స్వతంత్రులై పాలింపవచ్చును. కాని యందఱు సామ్రాజ్యసమితియొక్క నిర్ణయములను శిరసావహించి సమ్రాట్టుగౌరవమును గాపాడుచుండవలయును."

"మీసూచన సమంజసమైనదే. ఇఁక రెండవ విషయము— మా ప్రభునకు నితరద్వీపములతో సంబంధమున్నదని

మీారెఱుంగుదురు. అక్కడి నుండి రాకపోకలు జరుపుటకు మాకుఁ గొంత తీరభూమి యావశ్యకము. మా దేశమున నదులు లెక్కువగానున్నవి. నదులమీఁదస్వాతంత్ర్యము కూడ మాకుండవలెను."

"అయినచో బృందావనమునకు దిగువ నొక రేవుస్థలము నిర్ణయించుకొందము. ఆవిషయమున నెవరికి నే యభ్యంతరము నుండదు. నదులు సర్వసాధారణములని యంగీకరింతము. ఇతరులకు బాధ కలిగింపకుండ నెల్లరు వాని నుపయోగించు కొనవచ్చును. ఆయుపయోగ సందర్భమున సంఘర్షణలు జరుగకుండఁ జూచుటకు, ప్రయాణ సౌకర్యము లొనర్చుటకు సామ్రాజ్యసమితి యధికారముగలిగియుండును. అట్టైన స్వార్థపరత్వముతో నెవ్వరు వర్తింపఁజాలరు."

"సామ్రాజ్యసమితి నెవ్వరు నిర్ణయింతురు; దానిపై నధికారమెవ్వరు వహింపవలయునన్నది మూఁడవవిషయము."

"అమాత్యవర్యా! ఇది మనము నిర్ణయింపవలసిన యంశముకాదు. ప్రతి మండలమునందు నుపమండలములు, కూటములు నేర్పాటుపఁబడ వలయును. అందలి ప్రజలు తమ కిష్టులగు వారిని బ్రతినిధులుగాఁ బేర్కొందురు. ప్రజా ప్రతినిధులు సామ్రాజ్యసమితిలో నుండఁదగిన సభ్యులను నిర్ణయింతురు. ఆసభ్యులు తమలో నొక్కని సమ్రాట్టును జేయుదురు. సమ్రాట్టు ప్రజాభిమతమునకులోఁబడి సర్వాధికారము గలిగియుండును. ఈ ప్రణాళికలో నేమైన మార్పులు చేయవలయునన్న రేపు విజయవాటికలోఁ గూడనున్న సమావేశమున మీారుపపాదింపవచ్చును. వివిధపక్షముల నాయకులు

ప్రజలకు వాని మంచి చెడ్డలను వివరింతురు. సర్వజనాంగీకృతి పడసిన సూత్రములు ధర్మశాస్త్రములోఁ జేర్పఁబడును. కావున దానికై యిప్పుడు సందేహపడ నక్కఱలేదు."

"అంగబలముచేఁగాని యర్థబలముచేఁగాని యసమర్థు డధికారియైనచో"

"మీమాటలు నాకు నవ్వు పుట్టించుచున్నవి. సహజమగు సుగుణసంపదలేక కేవల మంగబలముమీఁద నర్థబలము మీఁద నాధారపడి పురుషుఁడు మహాజనాంగీకృతి పడయ గలుగునా? ఒక్కనాఁటికి నట్టివైపరీత్యము తటస్థింపదు."

"హాసీ! అట్టి సంశయమునకుఁ బ్రథమమునఁ దావీయకుండ మీయగ్రజునో మాజేనినో చక్రవర్తిగా నంగీకరింప గూడదా?"

"ఒక్కనాఁటికి నట్లుజరుగఁగూడదు. మనలో మనమే చక్రవర్తులమైనచో నీసంస్థకు నవ్యత యేముండును. అట్లుజరిగినచో దీని మహోత్కృష్టతయే కుంటువడును. పవిత్రతయే నశించును. ప్రజాభిమతముగాని యధికారమునకు మీజేడు సిద్ధపడునా? మాయన్న వాంఛించునా? ప్రసేనా! అధికార వాంఛను భూస్థాపితముచేసి మాటాడుమని మీమహారాజుతో ఖండితముగాఁ జెప్పుము. అట్లుకానినా డది ప్రజాసంస్థయే కాఁజాలదు."

"మావిభుఁ డయ్యధికార పదవి కర్హుఁడు కాడని మీ నిర్ణయమా?"

"ఎంతమాత్రము కాదు. ఆ విషయమున మాకొక నిర్ణయములేదు. రేపటి సమావేశమునకు వివిధప్రాంతముల నుండి మహాజనులు విచ్చేయుదురు. గుణమునుబట్టి, బలమును

బట్టి, సమర్థతనుబట్టి వారెవ్వరిని సమ్రాట్టుగా నంగీకరింతురో ఆ మహనీయుఁడే యాంధ్రసామ్రాజ్యమున మూర్ధాభిషిక్తుఁడు కాఁగలడు. ఆతని యధికారము చెల్లుటకు మేమందఱము తోడ్పడఁగలము. మాతోఁబాటేమీరునని మాయాశయము.''

''అధికారవాంఛ కాదుకాని మొట్టమొదటి యాంధ్ర చక్రవర్తి యనిపించుకొనవలయునని మా మహారాజునకుఁ గుతూహలము కలదు. అందుకుఁ దగిన యుత్సాహము, బలము, శౌర్యము, కార్యదక్షత సమగ్రములై యున్నవి. మీ యన్నగారిని విడిచి యింతటివాని నింకొకని ప్రేలుమడచి నిరూపింపుఁడు. మీ యన్నగారు పాపము వృద్ధులు''

అర్జునదేవున కఱకాలిమంట నెత్తికెక్కెను. కత్తితోఁ గాని పీఠికిఁక సమాధాన మీయరాదని యెంచెను. తొందర పడి కార్యభంగము చేయుట యుక్తముకాదని తలంచి భావ వికారము పైకిఁ గనఁబడనీయక ''అమాత్యవరా! నీమాటల యందు నీకు విశ్వాసమున్నచో నంత సంశయ మెందులకు? ప్రజలు బుద్ధిహీనులా? ఉత్సాహము శౌర్యము సమగ్రముగాఁ గల సమర్థుని విడిచి కుక్కనో నక్కనో సింహాసన మెక్కింతురా? మీరు, మీపరివారము రేపటి సమావేశమునకు రండు. మీ రాజేంద్రుఁడే ప్రజాదరమునకు లక్ష్యమైనచో నాతని యభిలాషము సిద్ధింపఁగలదు. కానినాఁడు విచారపడఁ గూడదు. అందులకై యింత చెప్పవలసి వచ్చినది.'' అని శాంత ముగా బదులుచెప్పెను. ప్రసేనున కామాట లాశాజనకము లయ్యెను. సపరివారుఁడై నిలచిన నిశుంభుని కాదని యెవఁ డన్యుని చక్రవర్తిగాఁ జేర్కొనఁ గలఁడు. మూర్ఖులై ప్రజలొక వేళ నితరుని పేరుచెప్పినను నెవఁడు నిశుంభుని యెదుట

'నహామస్మి' యని సింహాసనమెక్క సిద్ధపడఁగలడని యాతఁడు తలంచెను. "మీతో సంభాషించుటవలన మాకు సంశయ నివృత్తియైనది. మా జేనికిది యంతయు విన్నవించి తుది సమాధానము మీకుఁ దెలుపఁబడును. నేఁడెట్లును సాగదు. రేపు మీ ప్రయాణము తప్పదని" వచించి సెలవు తీసికొని ప్రసేనామాత్యుఁడు కొలువు కూటమునకుఁ బోయెను. మహీధరాదులు, నిశుంభుఁడు ప్రసేనునిరాక కెదురుచూచు చుండిరి. మహీధరుఁడు ప్రసేనుని జూచి 'కాయా? పండా?' యని యాత్రపడుచున్న వానివలె నడిగెను. ప్రసేనుఁడుఁ 'మిగులముగ్గిన గుడక కాదుకాని పలుకఁబాఱిన'దని వికసితవదనుఁడై వచించెను. పిమ్మట రాజానుమతిని బనకు నర్జునదేవునకు నైనసంభాషణము నెల్ల వారికి వినిపించి విజయవాటికను జరుగనున్న సమావేశమునకు సపరివారుఁడై నిశుంభుఁడేగుట తనకుసమ్మతమని చెప్పెను. మహీధరాదులు మఱికొంత చర్చజరిపినమీఁదట నిశుంభుఁడిట్లు కార్యనిశ్చయమొనరించెను. "మనమిత్తఱి రాయబారినిరావించి యాతనికి మనసమ్మతి దెలియఁజేసి పంపుదము. మనయందభిమానముగల జానపదులు విశేషసంఖ్యగలవారు విజయవాటికకు వచ్చు నేర్పాటుకావింతము. మహీధరుఁడు మణినాగుఁడు ముందుగాఁబోయి యచ్చటి ప్రజలచిత్తముల నాకర్షించుటకుఁ దగుప్రయత్నములు గావింతురు. తత్ప్రాంతగ్రామములఁ బెద్దలఁ గలిసికొని సామదానభేదముచే నేకగ్రీవముగా మనమాట పేర్కొనుటకుఁ గట్టడచేయఁ బ్రసేనుని నియోగించుచున్నాడను. సమావేశ పర్యవసానము మనకనుకూలమగునను నమ్మకముగలిగినచో నాటికి నేనచటికిఁ జేరుకొందును. లేనిచోనప్పుడే యేదో

పంకఁబెట్టి యీయొడంబడికను దోఁసివేయుదము. ఇదిసంప్ర తింపేకాని సిద్ధాంతము కాదుకదా? ఇది నా నిర్ణయము."

దానికందఱు నొడఁబడిరి. రాజాజ్ఞప్రకారము మహీధరుఁడుపోయి యర్జునదేవుని దోడితెచ్చెను. మణిభద్రుఁడాతనితో నుండెను. వారుచితాసనముల నలంకరించినపిమ్మట నిశుంభుఁడిట్లువక్కాణించెను. "భీమనాయకుని సోదరుఁడవగు నీవీకార్యమున రాయబారివై వచ్చుటకు నేనెంతయు సంతసించితిని. మీయన్నగారి ననామయమడిగితినని ముందుగాఁ జెప్పుము. మాయమాత్యుఁడు నీతోనన్నివిషయములు చర్చించియుండెను. దేశసౌఖ్యమును బ్రధానాశయముగాఁ బెట్టుకొని మేము నీవు సూచించిన మండలవిభాగమున కంగీకరించితిమి. నదీనదములు సర్వసాధారణములై యుండుటయు మంచిదే; మాకుసముద్ర తీరమున రేవుస్థలము ముందుగానే నిర్ణీతము కావలయును. బహుజనాంగీకారమునుబట్టి సమాఖ్యట్టు నేర్పరచుకొందమని నీవు చెప్పినదానికే మేము సమ్మతించితిమి. ఇదియిప్పటి మన యొడంబడికయొక్క సారాంశము. దీనిని మీ మిత్రుని కెఱింగింపుము. వజ్రధరాదులు సమ్మతించిరేని పదునైదుదినములకుఁ దక్కువ కాకుండ వ్యవధియుండునట్లు విజయవాటికను సమావేశమునిర్ణయించి మాకుఁదెలుపుఁడు. అప్పటికవకాశము చేసికొని తప్పక వచ్చెదను. నాకుఁ దీఱిక లేనిచోఁ బ్రతినిధి నంపెదను."

"అర్జునదేవుఁడా మాటలకు హర్షించెను. మణిభద్రుఁడు మెచ్చెను. "రాజా! నీ నిర్ణయము సంతోషదాయకమైనది. విజయవాటికకుఁ దప్పక మీరు రావలయునని మేమందరము కోరుచున్నారము. ఐహికభోగములకు నధికార వాంఛలకు

వస్తులైన వారి కిందలి యుత్కృష్టత గోచరింపక పోవచ్చును. ప్రజా హితతత్పరుఁడవై నీవిట్లు లంగీకరించినందులకు మనఃపూర్వకమైన యభివందనమును దెలుపుచున్నాఁడను. నాకు సెల విమ్ము! పోయివచ్చెదను. శుభము" అనెను. నేఁ కాలాతిక్రమణమైనది. విశ్రమించి రేపు ప్రయాణము జేయుఁడు అని నిశుంభుఁడు కోరెను. వసుంధరాదులు దానిని బలపఱచిరి. అర్జునదేవుఁడు మాట త్రోసివేయజాలక తన నివాసభవనమున కేగెను.

---

# పదునేడవ ప్రకరణము

---

వచ్చినపని సంతోషదాయకముగా జరిగి నందులకు ముదితులై మణిభద్రార్జునదేవులు కొంతసేపు తద్విషయములు ముచ్చటించుకొని కాలక్షేపమునకు భవనము నంటియున్న పూఁదోఁటలో విహరింప నాగిరి. అప్పటి కించుమించుగాఁ బ్రొద్దువాలఁబడినది. వారాయా వృక్షలతాదుల సొంపు పరికించుచుఁ బ్రమదవనసీమనుడాసిరి. మణిభద్రుఁడు చేటిక చెప్పిన మాటమఱచిపోయెను. యుద్ధప్రసక్తి లేకుండ నాంధ్రరాజ్య స్థాపనము జరుగనైయున్నదను హర్షావేశము వారి హృదయముల బరవశము గావించెను. వారా ప్రసంగమే యధికముగాఁ గావించుకొనుచు వనమున దిరుగాడుచుండిరి. ప్రమదవనసీమ గోచరించఁగానే మణిభద్రునకుఁ జేటిచెప్పిన మన్మథపూజమాట జ్ఞప్తికి వచ్చెను. అర్జునదేవునకుఁ దెలియకుండ నవ్వనము నలువలంకులు దృష్టిసారించి వసుంధరా మల్లికలున్న తావు కనుగొనెను. నెమ్మదిగా నర్జునదేవు నటు గొనిపోయెను.

మల్లికా వసుంధరలు లోక గున్నమామిడిచెట్టు సమీపమున మాధవీ మండపమునఁ బరికరములుంచి మాలికలు గ్రుచ్చుచుఁ దనివితీఱక యింకను దాపుననున్న పూవు లందు కొనుచుండిరి. వారి సంభాషణము కలకంఠ కూజితములతోఁ గలిసి యవ్యక్తమై వినవచ్చుచుండెను. మణిభద్రుఁ డెఱుగనివానివలె 'రాజపుత్రా! కోకిలలు మాటలాడుకొనునా? ఆ సంలాపమును వినుచున్నావా?' యనెను. అర్జునదేవుని దృష్టి పూవులుగోసి లతామండపము ప్రవేశించుచున్న రాజపుత్రికలపై బ్రసరించెను. 'మణిభద్రా! రాజపుత్రికలిందు విహరించుచున్నట్లున్నారు. మనము వెనుకకుఁ బోవుద' మని యాతఁడు వచించెను.

మణి:—రాజపుత్రా! నిశుంభుని వాచికము విన్నాము కదా? సార్వభౌమునకది సంతోషదాయక మగును. అంతకంటెను సంతోషదాయకమైన యీరాజపుత్రి సందేశమును గూడఁ దీసికొనిపోవు టుచితము కాదా?

అర్జు:—పిచ్చివాఁడా! వారు మనతో సంభాషింపరు మనలఁ జూచిరేని సిగ్గుపడి యిప్పుడే తొలంగి పోవుదురు వారి విస్రంభాలాపములు విన కుతూహలము నాకును జనించుచున్నది. ఈలతామండపము చాటుననుండి యాలకింతము.

మల్లి:—పుష్పమాల కూర్చితివా? నేనిదిగో మంజరి సిద్ధము చేసితిని.

వసుం:—నాపనియుఁ బూర్తియైనది. ఇఁక మదనదేవు నారాధింతము.

మల్లి:—ముందుగాఁ జిగుళ్లు సమర్పించి పువ్వులఁ బూజింతము

ఆసమయమునకుఁ జేటిక సుగంధద్రవ్యములు చేతఁ బట్టుకొని యచటికి వచ్చెను. వచ్చుచు మణిభద్రుఁడు మఱచి పోయెనా? యనుకొని లతామండపము చాటుననున్న మణిభద్రార్జునదేవులను జూచి మేలు 'మణిభద్రా! మంచివాఁడ'వని తనలో మెచ్చుకొనెను. ఆమె వారిని జూడనట్లే నటించి మల్లికావసుంధరలను జేరఁబోయి ఏమమ్మా! పూజయింకను బ్రారంభింపలేవా? ఇవిగో సుగంధద్రవ్యములని యందిచ్చెను. వసుంధర వాని నందుకొని మల్లికా! పల్లవాస్తరణ కల్పించి యందు మదనదేవు నుంచెదను. పిమ్మట పూజ చేయుద మనెను. మల్లిక మంచిదనెను. ఇరువురు భక్తితో వివిధ ప్రవాళ ప్రసూనరాజము లర్పించిరి. చేటిక తెచ్చిన యగరుతో ధూపమువేసి రత్నదీపికల నివాళించి మధుర ఫలోపహారము లర్పించిరి. ఆపూజాప్రకారమును సావధానుఁడై చూచుచు నర్జునదేవుఁడు 'ఆహా! ఈ పుణ్యవతి లావణ్యాతిశయము నిన్నటికంటెను నేఁడు నేత్రానందదాయక మగుచున్నది. క్షణ క్షణము నతిశయించుచున్నట్లు తోఁచుచున్నది. నిన్న నన్నీ తరళాక్షి చూచియుండెరా? ఈ లలితాంగి మానస మెట్లున్నదియో కదా?' యని వారి సంభాషణమును శ్రద్ధతో వినుచుండెను. మణిభద్రుఁడు చేటికందిన పువ్వుల గుత్తులు సేకరించుచుండెను. ముచ్చటపడి దండగాఁగూడ గ్రుచ్చుచుండెను. పూజ ముగిసిన పిదప వసుంధర 'మల్లికా! నీవు మాలనర్పింతువా? మంజరి సమర్పింతువా? నీకేది యిష్ట'మని యడిగెను. మల్లిక రెండు నిష్టమే యనెను.

వసుం:—అయినచో రెండునీవే యర్పింపుము.

మల్లి:— నీవో? మరలఁ గూర్చుదువా?

వసుం:— నేను గీతిక పాడెదను.

మల్లి:—నేను నొక గీతిక పాడెదను. మాలిక నాకిమ్ము! మంజరి నీవు సమర్పింపుము.

వసుం:—అయిన నిదిగో మంజరి—పాడు! గీతికపాడుచు మంజరి నర్పింపు ము.

మల్లిక:—వల్లికల మేనఁ జివురు జొంపములుగూర్చి
వివిధ సుమ సౌరభంబులు విస్తరించి
పొంగి పోయెడి మకరందములు గ్రహింప
సుమము పరసీమ! నీమోము జూపవేల?

అని మాలిక సమర్పించును.

వసుం:— చిగురుఁ గెంకేల సుమపాత్రఁ దగధరించి
మధురసంబిచ్చి మన్నింప మనసుపడెడి
మల్లికను జేరఁదీసి చుంబనమొనర్ప
కాలసించెద వేల నీ వళికుమార!

అని మంజరి సమర్పించును.

మల్లిక:—ఇదేమిపాటమ్మా! నీపాటయందు సమయోచితి లేదు

వసుం:—ఏలయట్లనుచున్నావు. నీవు మదన దేవుని బ్రార్థించితివి. నేను భ్రమరకుమారుని నుతించితిని.

మల్లి:—నీవు నన్నుమనసులో నుంచుకొని పాడితివి.

వసుం:—నీవు నన్ను మనసులో నుంచుకొని పాడ లేదా?

మల్లి:—అట్లయినఁ జేటికె నడుగు. ఓసీ! మొగమోటము విడిచిచెప్పు? ఎవరిపాట సమయోచితముగ నున్నదే?

చేటి:—మరల బాడుఁడు. అప్పుడు కాని నేఁజెప్పజాలను.

ఇరువురు పాడుదురు.

చేటి:—సందర్భశుద్ధి దేనికున్నదనియా మీ రడుగుచున్నారు. నేఁ జెప్పఁజాలనుగాని యింకొక్కసారి పాడుచుఁ గన్నులు మూసి యా దేవుని ధ్యానింపుఁడు. అతఁడే మీ సందియము వారింపఁ గలఁడు.

మల్లి:—ముందుగా నేను బాడుదును. (అట్లు చేయుచున్నది.)

వసుంధరయు నిమీలిత నేత్రయై పాడెను. చేటిక సన్న చేయుగా నర్జునదేవుఁడు వారిని సమీపించెను. ఇరువురు నడుగుల చప్పుడువిని కనులు దెఱచి యర్జునదేవుని జూచి సంభ్రాంతలైరి.

చేటి:—ఎందులకా తత్తరము! ఎవరి యాహ్వానము సమంజసమో మీరే గ్రహింపుఁడు.

మల్లి:—ప్రణయకోపముతో ఆహ్వానించి నంటనే యైనదా? ఇది యంతయు నీ పన్నుగడ.

చేటి:—రాజపుత్రా! యీ పల్లవాస్తరణమునఁ గూరుచుండుము. మ ..శీభద్రా! నీవునటుగూర్చుండుము. (కూర్చుందురు)

అర్జు:—వీరెవరో మేము తెలిసికొనవచ్చునా?

చేటి:—ఈమె మహారాజ పుత్రి; వసుంధరాదేవి.

అర్జు:—అయినచో మాకుఁగాఁగల మహారాజ్ఞి. దేవీ! పాదాభివందన సమయమున కెదురుచూచుచున్నాఁడను.

అతఁడా మాట లనునప్పుడు వసుంధర పులకితగాత్రియు వినమ్రవదనయునై లజ్జాతిశయము నభినయించుచుండెను.

చేటి:—ఈమె మహారాజు సోదరుని దుహిత, మల్లిక.

అర్జు:—ఈమెయు నవివాహితయేకదా?

చేటిక:—ఔను

మల్లిక:—(స్వగతము) ప్రణయ మధురమైనభాషణము, కనువిందైన రూపము విన్నకొలఁది, చూచినకొలఁది హృదయము ద్రవించుచున్నది.

వసుం:—(స్వగతము) ఆర్యపుత్రుని మిత్రుఁడగుటచే నాకీతఁడత్యంతపూజనీయుఁడని యెఱిఁగియు గౌరవవాక్యమైనఁ జెప్పజాలకున్నాను. నన్నీ శాలీనత నిందాపాత్రురాలినిగాఁ జేయుచున్నది. ఇదివిని యీ మహాపురుషుఁ డేమని తలంచునోకదా!

చేటిక:—రాజపుత్రా! మీరుదయచేసినపని నెఱవేఱినదా?

అర్జు:—(స్వగతము) ఇట్లుచెప్పెదనుగాక! (ప్రకాశము) మీ రాజపుత్రికలట్లు మౌనము వహించియుండ నెట్లు నెఱవేఱును.

చేటి:—రాజకార్యము మాట అడిగితిని.

అర్జు:—ఓహో: అదియా? ఇచటికి వచ్చినపని యనుకొంటిని. అది మూఁడుపాళ్లు నెఱవేఱినది. శుభాంతమగు ననియే భావించుచున్నాము.

చేటి:—అందఱు సుఖించుమార్గ మాశంసనీయము.

మల్లి:—రాజపుత్రున కిచ్చుట నేదియోపనియున్నదికాబోలును. మనమేగుదము సెలవడుగుము.

అర్జు:—మీరువెళ్లినచో మాపని యెట్లునెఱవేఱును?

వసుం:—అదియేమో తెలిసికొనుము చేటికా?

అర్జు:—(మణిభద్రునిజూపి) మామిత్రునకీతఁడు సందేశ మర్థించు చున్నాఁడు.

చేటి:—రాజపుత్రీ! సిగ్గుపడక సందేశింపుము. కానిచో సార్వ భౌమునియెడ నపరాధము చేసినదాన వగుదువు.

వసుం:—(స్వగతము) ఏమిచేయుటకు నిర్ణయింపజాలకున్నాను. ఆర్యపుత్రుఁడెట్లుతలంచునో? ఒకనం కశాలీ నతకు భంగము. మఱియొకవంకఁ దిరస్కార భయము.

మణి:—మొన్నవచ్చి నప్పుడు సందేశము కొనిపోవకుండుటే సార్వభౌముని హృదయమునకు శ్రమకలిగించినది. కావున తప్పక సందేశమొసఁగ గోరు చున్నవాఁడ.

వసుం:—సందేశమును మల్లిక చెప్పనేచెప్పినదికాదా? సుషమపరసీమ నీమోము చూపవేల యని.

మల్లిక:—నామాట యెత్తెదవెందులకు; నీసందేశమునే వివరిం పుము. (చేరదీసి) 'ఆలసించెదవేల' అను పాడితివికదా?

వసుం:—(చిఱునగవుతో) నాగీతిక సమయోచితముగా లేదం టివికాదా? సద్యఃఫలదాయిని యగు నీగీతికనే సందే శింపనిమ్ము!

మల్లిక:— అది చిరకాలము క్రిందటనే నెఱవేఱినది. నీవు పాడినదే నీకు సమయోచితముగా నున్నది.

వసుం:— అయినచో మణిభద్రుఁడు రెంటను గ్రహించుఁగాక!

మల్లి:— చెలీ! నామాట యెవరు చెప్పుమనిరి.

అర్జు:— చెప్పమనకున్న నేమి? కర్ణ రసాయనము చేయ కూడదా? ఉఊ ము లేని వర్ష ము సుఖదాయక మే యగును. మఱియొకటి కూడ నభిలషితము.

చేటి:— నిస్సంశయముగాఁ జెప్పఁగోరెదము.

అర్జు:— కన్యలేనా పురుషులు కూడ నా దేవు నారాధింప వచ్చునా? వచ్చునేని పుష్పమాల సమర్పింతమని—

చేటి:— దైవారాధన కండఱు నర్హులే. స్త్రీపురుష భేదము ప్రతిబంధకమగునా? (మల్లికతో) మల్లికా! దేవునకు నీవు సమర్పించిన మాలిక నిటు తెమ్మా?

మల్లిక మాలికనుదీసి చేటిక కందింపఁ బోయెను. ఇంతలో నర్జున దేవుఁడు మణిభద్రుఁడు సిద్ధముచేసిన పుష్పమాల నందుకొని తటాలున మల్లికమెడలో వేసెను. చేటి ప్రోత్సహించి మల్లికచే నర్జునదేవుని కంఠమున బుష్పమాల వేయించెను. వసుంధర ప్రీతివిస్ఫారితేక్షణయై చూచి సుభద్రార్జునీయములోని యొక చరణము స్మరణకు రాఁగాఁ దనలోఁ బాడుకొనెను. ఆపాటవైఖరీ రూపమునతిక్రమించి యప్రయత్నముగా మధ్యమావస్థనొంది యిట్టిచటివారికి శ్రుతి గోచరమయ్యెను. “ఏలుకొనవే ప్రాణనాయకు నేలుకొనవే సుభద్ర! యర్జును నేలుకొనుమమ్మా!”

అర్జు:—మహారాజ్ఞి యాదేశ మవశ్య సంభావనీయము.

మల్లి:—ప్రణయకోపమును నటించుచు మీసంగతి బాగుగా లేదు. మాయమ్మతోఁ జెప్పి యేమిచేయించెదనో చూడుఁడు.

చేటి:—(భయముతోఁ దనలో) ఆ ప్రగల్భమాటలు నమ్మి మేర మీఱిచరించితినా యేమి? అతిసర్వత్ర వర్జయేత్తని పెద్ద

లందురు. (ప్రకాశముగ) బిడ్డలారా! పరిహాసములతో మనము పొద్దుచూడమైతిమి. యశోదాదేవి మనరాక కెదురు చూచుచుండును. పోవుదము. (అర్జునదేవునితో) ఆర్యా! సెలవొసంగుము. మరువవలదు. దయయుంచుము.

అర్జు:—అచిరకాలముననే పునర్దర్శన మగుఁగాక!

వసుంధరాదులు వెడలిపోయిరి. మణిభద్రార్జునదేవు లును బయలుదేఱిరి. ఆ ప్రదేశమున మల్లిక యుపయోగించిన వస్తువులనెన్నుచు మణిభద్రునితో నిది యాలతాంగి పట్టినది; ఇది యాతరలాక్షి చూచినదని చెప్పుచుఁ దలవిదీఱక యర్జున దేవుఁ డించుక యాలసించి మణిభద్రుని ప్రేరణచే నెమ్మదిగా నడుగులిడుచుఁ గ్రమముగా నివాససౌధము చేరుకొనెను.

---

## పదునెనిమిదవ ప్రకరణము

---

రాయబారము సరళముగానే ముసిగెను. అర్జునదేవుఁడు కాకులముచేరి వజ్రధర విష్ణుదేవుల కెల్లవృత్తాంతము వినిపించెను. విజయవాటికా సమావేశమునకు తిథివారాదులు నిర్ణయింపఁబడెను. ఎల్లవారికి నాహ్వానము లంపఁజేయఁబడెను. దివ్యజ్ఞాన సంపన్నుఁడయ్యు నాపస్తంబుఁడు లోకవ్యవహారానుకరణార్థము కతిపయ శిష్యబృందముతోఁ బ్రయాణమై విజయవాటి కరుగఁదలంచెను. గురునాథుఁ డనుచరవర్గముతోఁ బ్రయాణోన్ముఖుఁ డయ్యెను. భీమనాయకుని యాధిపత్యమున మహాసభ జరుగుటకు నిశ్చయింపఁ బడినందున నమ్మహాశూరు

డానాటికి విజయవాటికకుఁ జేరఁగలననియు నెల్ల పనులు చక్కఁ బెట్టుటకు నర్జునదేవుఁడచ్చటనే యుండవచ్చుననియు విష్ణుదేవునకు వర్తమాన మంపెను.

నిశుంభునకు నావిషయము విశదపఱుపఁబడెను. ఆతఁడంతకుముందే మహీధరమణినాగుల నాయా ప్రాంతము లందలి జనుల యాశయములను గ్రహించి తనపలుకుబడిని బెంపొందింపఁ బంపియుండెను. ప్రసేనుఁడు తమపక్షమువారిలో నొక్కఁడు వెనుకబడకుండ నందరు విజయవాటిక కరుదెంచునట్లు నియమముచేసి యందులకుఁ బాళెగాండ్రలోఁ బెద్దల యూథనాయకులుగా నియమించి తాను గృష్ణాతీరనగర పర్యవేక్షకు బయలుదేఱి పోయెను. నిశుంభున కెప్పటివార్తలప్పుడు చేరుచుండెను. సభాదినము సన్నిహితమగు కొలఁది వజ్రధరాదులకు హర్షాధిక్యము కలుగుచుండెను. నిశుంభునకారాటము హెచ్చుచుండెను. మహీధరాదులు పంపు వార్తలలోఁ గొన్ని యుత్సాహకరములుగను గొన్ని - నిరాశాజనకములుగను నుండెను.

ఒకనాటిరాత్రి నిశుంభుఁడు శయనమందిరమున నిదుర రాక బహువిధముల నూహించుచుండెను. అంతకంత కాతని కారాటము హెచ్చుచుండెను. దైవము విషమపరీక్ష చేయఁదలఁచి తనకీపరిస్థితి తెచ్చిపెట్టెనని యాతఁడునిశ్చయించుకొనెను. "ఔరా! నేనేల బిడ్డలను సింహళమున కంపితిని. పంపితిని బో. మార్గమున విరుద్ధ సంఘటనము జరుగనేల? జరిగెననుము! విష్ణుదేవుఁ డిచ్చటికి వచ్చుటయు వానిని వసుంధర చూచుటయు నేల తటస్థింపవలయును. సురసన్నిభుఁడగు నాతని వలచి

యాకన్నియ లోలోనఁ గృశించుచున్నది. ఆ బాల మోము చూడ నాకే జాలి కలుగుచున్నది. నేనిట్టి వజ్రధరునకు లోఁబడి విష్ణుదేవునకుఁ దనయనిచ్చిన బంధువులందఱు పరిత్యజింతురు. సుకుమార హృదయమున నాటుకొన్న అనురాగలతికను ద్రుంచివేసి ఆ సుకుమారి జీవితము దుఃఖభాజనము చేయుదునా? చిరకాలమునుండి నిలిచియున్న ప్రతిష్ఠను మంటగలుపుదునా? విజయవాటికలో మనకు విజయము సంభవింపనిచోఁ బరాభవమును సహింపఁజాల. సంభావితున కపకీర్తి మరణముకంటె వ్యధాకరము. ఈసమావేశము భగ్నమైనచో యుద్ధము తప్పదు. పోనిమ్మని యుద్ధసన్నాహమొనరింతునా? జయాపజయములు దైవాధీనములు. అప్పుడు తల్లిలేని యీబిడ్డ గతియేమి? ఎప్పటికప్పుడు దీనవదనముతో విశ్వంభర నన్నర్థించుచున్నది. తనకు మరణకాలమున నొసఁగిన వాగ్దానమును భంగపుత్తునేమో యని చలితహృదయయై చెవి నిల్లుకట్టుకొని పోరుచున్నది. (ఆలోచించి విశ్వసించి) ఎట్టును నాకు మరణము తప్పదనుకొందును. నాఁటి స్వప్నవృత్తాంతము మనమును వేధించుచున్నది. సముద్రములో నుఱికిన నన్ను నక్ర మీడ్చుకొనిపోవుట శుభసూచకముగా దోఁపకున్నది. శ్రీశైలమునుండి క్రిందికి ద్రొల్లితిని. అది నా పదచ్యుతిని సూచించుచున్నదేమో? ఎన్నటికి నట్లుజరుగదు. సింహకేసరముల నెవ్వఁడు పెఱుక యత్నించును? యమునకు యముఁడు నిశుంభుఁడని యెఱుఁగక యెవ్వఁడైన సాహసమొనర్చినవాఁడు మదీయదుర్వార క్రోధానలమున శలభంబై మ్రందకుండునా? కాని—ఆ స్వప్నమున మల్లికా వసుంధరలు మందహాస సుందరారుణాధరలై యింద్రవరుణులచే రక్షింపఁ

బడుచుండిరి. అర్జునదేవుని జూచినప్పటినుండియు నా యింద్రవరు ఇలు పీ రుభయులై యుందురా యని యూహా జనించుచున్నది. మహీధరుఁడు, యశోదయు మల్లికను మణినాగున కిచ్చి వివాహము చేయఁగోరుచున్నారు. వాఁడును యుద్ధము తటస్థించినచో సింహళమునుండి సైన్యముల రావించి సముద్రతీరము లాక్రమింపఁ గుతూహల పడుచున్నవాఁడు. ఒకవేళ విష్ణుదేవుఁడు నాకుఁ జిక్కునా? వజ్రధరాదులు హతులగుటయు విష్ణుదేవుఁడు జీవగ్రాహముగాఁ బట్టువడుటయుఁ దటస్థించిన దైవము నాయెడ నున్నట్లగును. అప్పుడు వసుంధరతో రత్నసాను రాజ్యలక్ష్మి నాతనికిఁ గైవసమొనర్చి ధన్యుఁడనయ్యెద.

అట్లుగాక కదనరంగమున నాచే విష్ణుదేవుఁడు హతుఁడైన వసుంధర చిత్తమున నెంతపరితపించును? విష్ణుదేవుఁడే నన్ను సంహరించుట తటస్థించిన- ఏమి? ఈ యశుభసూచనము. నిశుంభుఁడు బొద్దూకని యొకకుఱ్ఱవానిచేఁ బ్రాణాపాయమునొందునని నామనసు విశ్వసింపఁజాలకున్నది. మూఁడు లోకములు కట్టుకట్టి యొక్కపరి నాపై నుఱుకుదురుగాక! ఈ యపశకునము లేమిచేయఁగలవో చూచెదను. మూఢవిశ్వాసములకు లొంగి యాత్మశక్తి నుపేక్షించునంతటి బేలనుగాను. అంతవఱకు రాకుండ మాయోపాయము చేతనైన జయము సాధించితీఱెదను. నన్ను సార్వభౌముని జేసి కన్యారత్నమును గొనుమని ప్రలోభించిన ననురక్తుఁడు బాలుఁడునగు విష్ణుదేవుఁడు వ్యతిరేకోద్యమమునకుడిగి వశుఁడుకాఁడా? కుడిచికూర్చున్న నాకీదుర్భరస్థితి యేల సంభవింపవలయు"నని యనేకవిధములఁ దలంచుచు నాతఁడగ్నిపరీతమగు డొంకలలోని పాఁపజేనివలె

శయనమందిరమున నిటునటు దిరుగఁజొచ్చెను. ఆతని ముఖ ముబ్బిపోయెను. కన్నులెఱ్ఱవారెను. నిట్టూర్పుల తాఁకుడుచే నధరము కమలిపోయెను. రక్తము వేఁడెక్కి నాడులందుఁ దీవ్రముగఁ బ్రసరింపసాగెను. హృదయసంచలన మధికమయ్యెను. కొంతసేపటికాతఁడు తిరుగుటకశక్తుఁడై శయ్యపైఁ గూలఁబడెను. మూర్ఛితుఁడైనట్లు ముహూర్తకాలము పడినవాఁడు పడినట్లె యుండి దిగ్గనలేచి "ఏమనుచున్నావు? లోకమున నేకైకవీరుఁడని పేరుపొందిన నిశుంభుఁడు సామ్రాజ్యపదవి కనర్హుఁడా? ఛీ మూర్ఖురాలా! ఇదిగో! కరవాలమాత్ర సహాయుఁడనై పోయి వైరివీరులనిప్పుడే రూపుమాపివచ్చెద. నీబిడ్డయనాథయై యంగలార్చుననియా? శత్రువునందు మనసునిల్పినయాదుర్బుద్ధి కంతకంటె నేమిఫలము లభించును? వినను! నీవెంత బ్రతిమాలినను వినను! పొమ్ము! ఏమి యీనీ దివ్యరూపము. ఏమి యీ నీ అమృతహస్తము-నేత్రసమార్జన మొనర్చినంతనే యేమి యీ వింత తెలివి? ఏమి యీఘోరసంగ్రామము. నిశుంభుఁడు హతుఁడయ్యెనే? కాకులేశ్వరు నంకవీథి నలరారుచున్న నీపుత్రి కనుజూపి నన్ను వెక్కిరించు చున్నావా? విశ్వంభరా! విశ్వంభరా! విశ్వంభరా!" యని యాతఁడు మరల శయ్యపై వ్రాలెను.

చాలసేపు కన్నులుమూసికొని యట్లేపండుకొని యుండెను. పంచభూతములు నాతనియెడ దయవహించి సాఁకుచుండెను. సోరణగండ్లనుండి మలయానిలము వీవఁ దొడఁగెను. అమృతాంశుఁడు గవాక్షమార్గమునఁ గౌముదీగుచ్ఛములు గుమ్మరించుచుండెను. నిద్రాదేవి యొడిని జేర్చి యూఁజేని లాలింపసాగెను. ఇందుఁగలఁ డందులేఁడని సందే

హింపరాని సర్వాంతర్యామి స్వయముగాఁ బహారాయిచ్చు చుండెను.

క్రమముగాఁ జంద్రాస్తమయ మయ్యెను. చీఁకటులు వ్యాపించెను. కోడికూయుట, వేగుఁజుక్క పొడుచుట, తూర్పు తెల్లవారుట దేనిసమయమునదిజరిగిపోవుచుండెను. క్రమముగా మృదుల మాంజిష్ఠ శోభాసమృద్ధ మగుచు నహస్కరబింబ ముదయశిఖరి శిఖర మలంకరించెను.

అంతకుముందే నిశుంభుఁడు వందిజనము ప్రబోధింప మేలుకొని కాల్య కృత్యము లొనర్చి యున్నంతలో వార్తాహరుఁ డొకఁడు జాబు కొనివచ్చెను. ప్రసేనుఁడంపిన జాబనఁగానే యేమి సమాచారమో యెఱుఁగ నాత్రపడుచుఁ దక్షణమే దాని నందు కొని యిట్లు పఠించెను. "శ్రీ శ్రీ శ్రీ నిశుంభ మహారాజ పాద పద్మములకు సాష్టాంగపడి చేసికొను విజ్ఞప్తి. దేవరవారి పాద మూలమును విడిచి వచ్చినప్పటినుండి పడరాని పాట్లు పడి సామ దాన భేదోపాయముల ననువుపఱిచి యింతవఱకు నధిక సంఖ్యాకులు మనపక్షమవలంబించునట్లు కావించితిని. దేవరవారు విజయవాటికా ప్రయాణము తూఁగింప వచ్చును. దేవరదర్శనము ప్రజలలో మఱికొంత యుత్సాహమును జనింపఁజేయఁగలదని భావించుచున్నాను. వజ్రధరుఁడు తన పక్షము వారి నందఱ నేమఱకుండ రావించుచున్నాఁడు. ఏలిక సమక్షమున లేనిచోఁ బ్రజ లెదుటివాఁడే పెండ్లికొడుకని తలంచి కార్యహాని యొనర్తు రని భయ పడుచున్నాఁడను. దేవరచిత్తమునకు సమ్మతమగునట్లు చేయఁగోరెదను. విధేయుఁడు — అమాత్య ప్రసేనుఁడు." జాబు చదువఁగా నిశుంభునకుఁబ్రబల్యాశ జనించెను. వితర్కములనన్నిటి

దిగఁద్రావి సముత్సాహముతో విజయవాటికకు బయలు దేరెను.

ఆవార్త విని మల్లికావసుంధరులు హర్షపరిపూర్ణ హృదయులై మహారాజును సందర్శింపవచ్చిరి. అతఁడు వారి రాకకు సంతుష్టుఁడై 'మీతోఁ జెప్పి పోవలయునని యనుకొనుచుండ మీరే వచ్చితిరి. మంచి శుభసూచన. విజయవాటికకు రమ్మని ప్రసేనుఁడు లేఖ నంపెను. నేఁడే ప్రయాణము. అక్కడ పని పూర్తికాఁగానే శీఘ్రముగా వచ్చెదను.'

మల్లి:—మహారాజు మొగము దస్సియున్నది. కార్యాలోచనముచే నిద్రసరిగాఁ బట్టలేదెమో!

వసుం:—తండ్రీ! నీవింతకుముందే చక్రవర్తివి. దీనికై లేనిపోని పట్టుదల పెట్టుకొనకుము. నీకు దీనిమూలమునఁ గ్రొత్తయాధిక్య మిసుమంతయు రాఁబోదు. సర్వజన సమ్మతికి నిశుంభుఁడ ట్లవాట్లు వేసెననెడి యపయశమునకు లక్ష్యము కాకుమని ప్రార్థించుచున్నదాన.

నిశుం:—(చుబుకము పట్టుకొని మూర్ధాఘ్రాణముచేసి) తనయా! ప్రాణములర్పించియైన నీయభీష్టమును నెఱవేర్చెదను.

వసుం:—తండ్రీ! అట్లనవద్దు! సర్వలోక సుఖకరమగు మార్గము నవలంబింపుము. మనము లోకముతోడివారమే.

మల్లి:—(తనలో) యుక్తి ప్రయుక్తులకిది యదనుగాదు. (ప్రకాశము) సోదరీ! మహారాజు మొగమున సార్వభౌమకళ కానిపించుచున్నది. సూక్ష్మదృష్టితోఁ బరికింపుము.

వసుంధర:—సఖీ! చిరకాలమునుండియు నాకు గోచరించుచునే యున్నది.

మల్లి:—అంకును నేడు విశేషముగా—

వసుం:—తథాస్తు—

నిశుం:—(హర్షాతిశయముతో) బాలవాక్యము బ్రహ్మవాక్య మందురు.

అట్లు చెప్పి నిశుంభుఁడు ప్రయాణ సన్నాహము గావింప నగరపాలకుని నియోగించెను. కావలసిన వస్తువు లన్నియు సమృద్ధిగాఁ దోడఁ గొనితేఁ దగువారి కాజ్ఞ యొస గెను. తనయులకు సెలవిచ్చి పంపి మంగళవాద్యములు జయ జయధ్వానములు మిన్నుముట్ట రథారూఢుఁడై నగరు వెడలెను. బ్రాహ్మణులు స్వస్తివాక్యము లుచ్చరించిరి. పురవీథి నేగు నప్పుడు సుమంగలీజనులు పుష్పాంజలులు చల్లి యాతని యుత్సాహము నినుమడింపఁ జేసిరి.

# పంధొమ్మిదవ ప్రకరణము

విజయవాటికయందు రమణీయ ప్రదేశమున మహా సభ జరుగుటకు నిర్ణయింపఁబడెను. పూర్ణభద్రుఁడు ముందు గానే వచ్చి తత్ప్రదేశమున బందిళ్ళు, పాకలు వేయించి యాగంతుకులకు దగు వసతులేర్పఱచెను. భోజనశాలలు, పానశాలలు, విహారశాలలు కొదువలేకుండ నిర్మింపఁజేసెను. రథములు నిలుపుటకుఁ గరి తురగ వృషభాదులఁ గట్టుటకు

వసతులు కల్పించెను. మధ్యమధ్య వజ్రధరార్జునదేవులు వచ్చి యాతని యేర్పాటులు చూచి తగుసూచన లిచ్చిపోవుచు వచ్చిరి. పూర్ణభద్రుని చాకచక్యముచే నా ప్రదేశము కల్పవృక్షమువలె సంకల్పమాత్రమున సకలవస్తువుల నొసంగు చుండెను. పాలు, పెరుఁగు, కాయగూరలు నెప్పటి కప్పుడు వచ్చునట్లు గురునాథుఁ డేర్పాటుచేసి రెండు దినములు కలవనఁగానేవచ్చి తాను బూర్ణభద్రునకుఁ దోడుపడుచుండెను.

ఉపకార్యా నిర్మాణము పూర్తి కాఁ గానే విష్ణుదేవుఁడు వజ్రధరార్జునదేవులం గూడి విజయవాటిక కేతెంచెను. ఎవరికిఁ దగిన రీతిని వారికి విడిదల లొసంగఁబడెను. వారికి, వారి పరివారమునకు గజాశ్వాదులకుఁ దద్రక్షకులకు నిబుకా టను లేకుండ నివసించుటకు వీళ్లు కల్పింపఁబడెను. మణినాగ మహీంధరులు తమ పనిపూర్తి చేసికొని సమావేశము రేపనఁగా విజయవాటికకు వచ్చిరి. ఆనాటి సాయంకాలమునకే ప్రసేనుఁ డరుదెంచెను. వజ్రధరుఁడు వచ్చినవారి నందఱిని గలిసికొని కుశలప్రశ్నము కావించి రావలసినవారిని గుఱించి యడుగు చుండెను. తెల్లవాఱునప్పటి కందఱు వచ్చిరి. ఆపస్తంబభీమ నాయకులు రాఁగానే విష్ణుదేవుఁడు పాదచారియై పోయి నమస్కరించి తోడ్కొచ్చి యుచితములగు నివేశముల విడియింపఁ జేసెను. మునిశిష్యులకుఁ గాలకేతు ప్రభృతులకుఁ దగునివా సములుచూప మణిభద్రుని నియోగించెను.

ఇంతలో నిశుంభుని రథస్వనము వినవచ్చెను. మహీధరుఁడు, ప్రసేనుఁడు నెదురుగాఁబోయి కొనివచ్చి తమకై నియుక్తమగు మహార్హ వస్తుసంభృతమగు గుడార

మున నాతని బ్రవేశపెట్టిరి. నిశుంభుఁడు వచ్చెనని వినఁగానే విష్ణుదేవుఁడు వజ్రధరార్జునదేవులతోఁ గూడి యాతని సందర్శింప నేగెను. అర్జునదేవుఁడు వారి నొకరి కొకరి నెఱుక పఱిచెను. పిదప నీ క్రింది సంభాషణము జరిగెను.

నిశుం:— చిరకాలమునుండి మిమ్ము వినుచున్నారము. సందర్శనభాగ్యము నేఁటికి లభించినది. ఇది సుదినము.

వజ్ర:— అందఱము నట్లు సంతసింపవలసినదే.

విష్ణు:— ఈ సమావేశమునకు మీరాక యంగపరిపూర్తిని గలిగించినది. ఇప్పటిదనుక నీప్రదేశము గ్రహనక్షత్రశోభిత మయ్యుఁ జంద్రుఁడు లేని గగనతలమువలె సంపూర్ణప్రకాశము వహింపదయ్యెను.

నిశుం:— స్నేహపూర్వకమగు మీ యాహ్వానము ద్రోసిపుచ్చుటకు మనసు సాహసింపదయ్యెను. జరుగగల కార్యక్రమమేమి?

వజ్రధరుఁడు కార్యక్రమము సిద్ధపఱిచి యుంచెను. దానిని నిశుంభునకుఁ జూపెను. అది చూచుకొని చక్రవర్తి యెన్నిక రేపటి కార్యక్రమములో నున్నదనుకొని సంతోషముతోఁ "జక్కఁగానే యున్నది. నేఁడు వివిధపక్షనాయకుల సంప్రదింపులు మహనీయుల హితోపదేశములు నిర్ణయించి యుంటిరి. భీమనాయకులు దయచేసిరా?

వజ్ర:— విజయముచేసినారు. వారుకొంతసేపు విశ్రాంతితీసికొనఁగానే కార్యక్రమ ముపక్రమింపఁబడును. సెలవుతీసికొని మరలఁ గలిసికొందము.

నిశుం:— మంచిది. కాలాతిక్రమణము కాకుండజూడుఁడు.

విష్ణు:— అంతయు సిద్ధముచేయఁబడియే యున్నది. సెలవు.

విష్ణుదేవుఁడు సపరివారుఁడై యేగెను. వెళ్ళుచు నిశుంభుని దర్పమును గాంభీర్యమును జూచి దుర్గుణములే లేకున్న నిక్క ముగా నీతఁడు ప్రపంచము నేలగలవాఁడె. ఈతని పేరు విని పరరాజులులికిపడుదురన్న నాశ్చర్యమేమి? ఎట్టి దృఢకాయుఁడు! గంభీరము, భీకరమునయ్యు నీతనిముఖము దర్శనీయమైయె యున్నదని అనుకొనెను.

నిశుంభుఁడు విష్ణుదేవునిఁజూచి యద్భుతహర్షములకు లోనయ్యెను. అతఁడిట్లనుకొనెను: "ఇట్టిరాజకుమారుని మున్నె న్నఁడు చూచియుండలేదు. ముందుచూడఁబోము. వజ్ర హస్తుఁడైవచ్చిన యింద్రునినైత మీతఁడవలీలగా నిర్జింపఁగలశక్తి గలవాఁడనితోఁచుచున్నది. దర్శనమెంతయు సౌమ్యము. ఆకృతి మనోహరము; హృదయము గంభీరము: నిక్కముగా వసుంధర యీతని వలచి యవచనీయమైనది.

ఇట్లుతలంచి యారాజేంద్రుఁడు మహీధరాదులతోఁ గొంత కార్యాలోచన మాచరించెను. ఇంతలో సమావేశ ముప్రక్రమింపఁబడుచున్నదని తెలుపుచు గార్యదర్శిప్టలాహ్వా నించినందున నందఱు నచ్చటికేగిరి.

సభాభవనముచక్కఁగానలంకృతమైయుండెను. చిగురుఁ దోరణములు, ప్రసూనమాలికలు నెడనెడ కట్టఁబడెను. వితాన ములు, రత్నదీపికలు, రంభాస్తంభములు నాసభామంటప మును శోభిల్లఁజేయుచుండెను. మధ్య నొకవేదిక నిర్మింపఁ బడెను. అందు భీమనాయకుఁ డాసీనుడై యుండెను. ఆరాజేం ద్రునిప్రక్క నాపస్తంబమహర్షి యుపవిష్టుఁడయ్యెను. వేదిక

కిరుప్రక్కల నిశుంభ మహీధరాదు లొకవైపున విష్ణుదేవ వజ్ర ధరాదులొకవైపునఁ గూర్చుండిరి. కాల కేతువు మునివర్యులతో ముందటఁ గూర్చుండెను. పిమ్మట సామంతులు, పాళెగాండ్రు జానపదులు సమ్మర్దములేకుండ గూర్చుండిరి. పూర్ణభద్రుఁ డొక వైపున నర్జునదేవుఁడొకవైపున నిలిచి యందఱు నిశ్శబ్ద ముగా నుండునట్లు చూచుచుండిరి. ఆయుధములు ధరించిన కొందఱుభటు లిటునటుదిరుగుచు నల్లరులుజరుగకుండఁ గాచు చుండిరి.

సమయము కాఁగానే ఆప స్తంబమహర్షి లేచి యుచ్చై స్స్వరముతో "ఓమ్ యో దేవోగ్నౌ యోప్సుయో విశ్వంభువన మావివేశ య ఓషధీషు యో వనస్పతిషు తస్మై దేవాయ నమోనమః" అని మంగళాచరణము గావించి కూరుచుండెను. పిమ్మట భీమనాయకుఁడు సభ్యులకిట్లు విన్నవించెను.

"మహనీయులైన సభాస్తారులారా! వివిధప్రాంతముల నుండి మిక్కిలి శ్రమకోర్చి మీరందఱు విచ్చేసియున్నారు. ఇంతకుఁబూర్వ మొకరికొక రపరిచితులయ్యు సుహృద్భావము వెల్లడించు కొనుచు హృష్టహృదయులై సామరస్య ముతో సంభాషించుకొనుచున్నారు. ఇందుఁగొందఱు మహా రాజులు, కొందఱాగర్భ శ్రీమంతులు, కొందఱు తపోధనులు, కొందఱు విజ్ఞానఘనులు, సద్భావముతో సత్కార్య నిర్వహ ణమునకై సమావేశమైన యిందఱ నొకపర్యాయము చూడఁ గలుగుటచే మనకిది పర్వదినము. ఇది విజయవాటి; నేఁడు విజయదశమి; విజయవారము. కావున మనమీకార్యనిర్వహణ మున విజయము కాంచఁగలము. ఎట్టిపవిత్రత, ఎట్టి యుదారత,

ఎట్టిసుహృద్భావము మీహృదయముల నేడు తొలకాడుచున్న దో, అట్టిభావమే శాశ్వతముగా మీడెందముల నెలకొని యుండునట్లు భగవంతుఁ డనుగ్రహించుఁగాక !

మన మిక్కడఁ జేరిన ప్రయోజనము రెండుదినములలో ముగింపఁదగినదిగా విభాగింపఁబడినది. ఇప్పుడు మహనీయుఁడైన యయ్యాప సంబమహర్షి ధర్మశాస్త్ర రహస్యముల నెఱిఁగించుచు హితోపదేశము చేయును. పిమ్మట మీలో నెవ్వరైనఁ బ్రస్తుతవిషయమును గుఱించికాని, దాని కుపబృంహాక మగు నంశము గుఱించి కాని మీ యభిప్రాయములు వెల్లడించుచు మాటాడవచ్చును. మధ్యాహ్నము మనము చేయఁబూనిన కార్యమందలి కష్టసుఖములను నాయకులు పరస్పరము సంప్రతింతురు. ఇది యీదినచర్య. రేపు ప్రొద్దుటఁ గూడ నాయకులు ప్రజలువిమర్శించుకొందురు. మధ్యాహ్నము సార్వభౌముని నిర్ణయించుకొందురు. ఇది యిచ్చట జరుగవలసిన కార్యకలాపము. పిమ్మటివిషయములు సార్వభౌముఁడు ప్రజా ప్రతినిధుల సమితితో నాలోచించి నిర్ణయించును. ప్రజలు తమ ప్రతినిధులనుగూడ రేపే పేర్కొందురు.

ప్రస్తుతవిషయమును గుఱించి యించుక ముచ్చటించెదను. ఘనమైన కార్యభారమును వహించి శ్రమకోర్చి యిచటికివచ్చి యైకమత్యముకొఱకు సర్వశక్తులు వినియోగించుకొన్న మీకు వేఱుగా నైకమత్యము మన కావశ్యకమనిచెప్ప నక్కరలేదు. ఏదేశమందలి ప్రజలైకమత్యము కలిగి ప్రవర్తింతురో ఆ దేశమును ముక్కోటి వేలుపులును మోహరింపఁజాలరు. మీరిప్పుడే యైకమత్యఫలము చవిచూచుచున్నారు. సేనాని

పూర్ణభద్రుఁడు, మహర్షి యాపస్తంబుఁడు సంఘీభావమును చేకూర్చించిన నాఁటఁగోలె మనదేశమున దుష్కార్యము లడుగంటినవి. పెక్కురు దోపిడికాండ్రు కృషి వాణిజ్యములు చేసి జీవించుచున్నారు. వారి నిత్యజీవనము సుఖముగా జరుగుటకు మన మెన్నియో కార్యము లొనర్పవలసి యున్నది. అప్పుడు కాని, దేశము వీర్యవంతము కాదు. ఏదేశ ప్రజలు తుచ్ఛ భోగములకు దాసులై పరస్పర పీడాకరములగు సంఘటనలను తెచ్చిపెట్టుచుందురో ఆదేశమన్ని విధముల నధోగతినొందును. ప్రజల నైతికసంపద దేశసౌభాగ్యమునకు వెన్నెముక. ఐకమత్యము జీవము. విజ్ఞానాభివృద్ధి రక్తమాంసములు. ఇవిలేని దేశము జీవరహితమైన యస్థిపంజరమువలె హేయమగును. మహాజనులారా! సారహీనములైన మాటలతో మిమ్ము విసిగింపక యమూల్యములైన యాపస్తంబ సుభాషితము లాలకింప మీకవకాశ మొసఁగుచున్నాఁడను

ఇట్లుచెప్పి భీమనాయకుఁడు విరమించెను. ప్రజలలో హర్షనినాదము లుప్పతిల్లెను. అర్జునదేవ పూర్ణభద్రుల ప్రయత్నము వలన నాసభ క్షణకాలములో నిస్తరంగసముద్రమువలె శాంతమై యొప్పారెను. ఆపస్తంబుఁడు సభాసదుల నందఱఁ గలయ జూచి గడ్డము సవరించి జపమాల వేల నూఁగులాడుచుండ నిట్లువచించెను. "మనీషులారా! మహాశూరులారా! ఐహికముగా మీ కెఱిఁగింపవలసిన విషయములనన్నిటి భీమేశ్వరుఁడు వచించి వక్తవ్యాంశము లేకుండఁ జేయుటచే నే నాధ్యాత్మికముగా మాటలాడెదను. ఈ కావితాల్పు ముక్కుమూసికొని యేకొండగుహలోనో కూరుచుండక యేటికీ జంఝూటమనిమీరు సంశయింపవచ్చును. మాగురు సంప్రదాయము నెఱిఁగించినచో

మీసందేహము నివర్తించుననుతలంపుతో నించుక సూచించె దను - అగస్త్య గౌతమ బాదరాయణాదులు మా గురుపరం పరలోనివారు - తపస్వియయ్యు నగస్త్యుఁడు లోకోపకారము కొఱకెన్ని ఘనకార్యములనో చేసెను. వింధ్యగర్వాపహారి; ఇల్వలవాతాపి దానవ నిషూదనుఁడు; సముద్రోదకము లాచమిం చినయోగి. ఇట్లె తక్కినవారును లోకసంబంధమును విడువక తపశ్శక్తినాశ్రయించి ధర్మశాస్త్రములు నిర్మించి మహా రాజుల సాహాయ్యమునఁ బ్రజలచే నాచరింపఁజేసి ధన్యులైరి. నేను నట్లేయపమార్గమునఁ బడియున్న ప్రజలకొఱకుధర్మసూత్ర ములు నిర్మించి వానిని మీకందఁజేయు చున్నాఁడను. ధర్మా చరణ మొనర్చుటే మీరు నా పరిశ్రమను సార్థకపఱచుట. ధర్మాచరణమునగాని యాధ్యాత్మికశక్తి పెంపొందదు. పురుషుఁడాధ్యాత్మికశక్తిహీనుఁడైనచో బాహ్యశక్తి యెంత యుత్కృష్టత గాంచినను నిరయగామి కాక మానఁడు. స్వస్వ జాత్యుచిత కర్మాచరణమే స్థూలముగా ధర్మస్వరూపము. ఏజాతి కేకర్మ విధింపఁ బడినదో దాని నాచరించి యాజాతి యౌన్నత్యమును గాంచును. జాతి సాంకర్యము పాప హేతువు. పాపము జాతి విచ్ఛేద హేతువు. స్వజాతియం దుద్భవించిన యౌరససంతతి జాతిని దేజోవంతముగాఁ జేయగలదు. మీ రే జాతివారు? ఆర్యసంతతివారు! కొందఱు మిమ్మనార్యులుగా మ్లేచ్ఛులుగా నేల పరిగణించు చున్నారు? దానికి మూల కారణమగు సాంకర్యమును నిరోధించి యార్యజాతి గౌరవ మును నిలుపుఁడు. కృష్ణా గోదావరీ తీరవాసులగు మీరందఱు నాంధ్రులను ప్రఖ్యాతి వహించి "యాంధ్రులార్యులే! అనార్యులు కారు - మ్లేచ్ఛులుకారు - వీరిదిసనాతనవిజ్ఞానము-వీరిధర్మము

సనాతనము. మేధాసంపద నితరులకు వీరుతీసిపోరు. ధైర్యము, సాహసము, కార్యదక్షత, మైకమత్యము వీరికి సమగ్రముగాఁ గలవు" అని లోకమునకు వ్యక్తము చేయుఁడు. నాఁడే యాంధ్రజాతికిఁ బ్రత్యేక వ్యక్తిత్వము లభించును. వ్యక్తిత్వమును, గౌరవమును నిలుపుకొనుటకు ధర్మాచరణము- ధర్మ సంరక్షణార్థము సామ్రాజ్యము- నపేక్షణీయములు. సుస్థిర సామ్రాజ్యము లేక యే ఘనకార్యమును మీరు సాధింపఁ జాలరు మీలో మీరు తగవులాడుకొనుచున్న లాఘవమునకు గుఱియగుదురు. లఘువు గురువగుటకు దీర్ఘకాలము పట్టును. గురుధర్మమే గౌరవము. ఈరహస్యమును మనస్సున నుంచుకొని స్వీయాభిమానమును దూరముగా నుంచి పరుఁడైనను దనవాఁడైనను సరే - బాలుఁడైనను వృద్ధుఁడైనను సరే - ఎవఁడు మీజాతిని, మీధర్మమును, మీగౌరవమును సంరక్షింపఁగలఁడో విషయలౌల్యముచే నెవఁడు ధర్మపరిత్యాగ మొనరింపఁడో- ఎవఁ డసహాయశూరుఁడై తన భుజచ్ఛాయ మిమ్ము సుఖముగా జీవింపఁజేయఁగలఁడో అట్టివానిని జక్రవర్తిగాఁ జేకొనుఁడు. అట్టి గుణశాలి నరసి నిర్ణయించుకొనుటకు మీకు రేపు మధ్యాహ్నము వఱకు నవకాశ మొసఁగఁబడినది. చిత్తశుద్ధితో నాలోచించి చేయుఁడు. ధనాశకు, నధికార వాంఛకు లోనై బాధ్యతను మఱచి జీవితము గళంకితము చేయకుఁడు. ఇంతకంటెఁ బ్రాజ్ఞులగు మీకుఁ జెప్పనక్కఱలేదు.

ఆపస్తంబుని మాటలు సభ్యుల కుత్తేజకారణము లయ్యెను. కొందఱు తమలోపము గ్రహించి నమ్రవదనులై పునర్విమర్శకు లోనైరి. గుసగుసలు ప్రారంభమయ్యెను. భీమనాయకుఁ డది గ్రహించి యింక నెవ్వరైన నేవిషయమునైన

సభ్యులకుఁ జెప్ప నుత్సహించుచున్నారా ? యనెను. ఎవ్వరును మాటాడనందునఁ, గాలమతీతము కానచ్చినందున నాఁటికి సభ ముగింపఁ బడినదనియధ్యక్షుఁడు సెలవిచ్చెను. అందఱు నాంధ్ర జాతికి జయమని యఱచుచుఁ దమ తమ విడుదుల కేగిరి.

అప్పటినుండియు గుంపులు గుంపులుగాఁగూడి ప్రజలు సార్వభౌముఁడెవ్వఁడని చర్చింప సాగిరి. మొదట నెవ్వరెవ్వరో పేర్కొనఁబడిరి కాని తుదకు విష్ణుదేవుఁడా నిశంభుఁడా యన నదే చర్చకు మిగిలెను. భోజనములకు ముందు, వెనుక, భోజన సమయమునందు నిదేచర్చ. కొందఱు విష్ణుదేవుని గుణ గణము లెన్నుచుండిరి. మఱికొందఱు నిశుంభుని సామర్థ్యము ప్రశంసించు చుండిరి. చెట్లక్రింద, నదీ తీరములఁ, బర్ణశాలాంతరముల, గుడారములందుఁబగలు, రాత్రి,ఏకాగ్రముగాఁ జర్చసాగెను. తెల్లవాఱు నప్పటికి మూఁడు వంతుల జనము విష్ణుదేవుని వైపు మొగ్గిరి. వజ్రధరార్జునదేవాదు లేకగ్రీవముగా నొక్కని బేరుచెప్పుటే యైకమత్యసూచకమని ప్రజలను హెచ్చరింపఁ జొచ్చిరి. మహీధర ప్రసేనాదుల మొగములు కళా విహీనములు కాఁజొచ్చెను. నిశుంభుఁడు నీ చింబో తెంత పని చేసినదని యాపస్తంభునిపై నిష్ఠలు గ్రక్క సాగెను. కార్యమేవిధముగాఁ దిరుగఁదోఁడఁగలమని ప్రసేనుఁడు బుద్ధికొలఁది యోచించు చుండెను.

మధ్యాహ్నము సమీపించుకొలది విష్ణుదేవుడే చక్రవర్తి కావలయు ననువారి సంఖ్య యత్యధికమయ్యెను. ప్రజా హృదయముల మార్పు విషయమున వారు నిరాశ చేసికొనిరి. నిశుంభుఁడు "తమ్ముఁడా ! యిక యుద్ధము తప్పదు. ఇక్కడనే

సంఘర్షణ తటస్థించు నేమోయని తోఁచుచున్నది. ఎందులకైన మంచిదే నీవు తగు సన్నాహముతో నుండుము. మణినాగుని వెంట గొనిపొమ్ము. పాళెగాండ్రఁ గూడఁగట్టుకొను"మని యాజ్ఞాపించెను. మహీధర మణినాగులు రాజశాసనము నిర్వర్తింపఁ బాళెగాండ్రను గలసికొనఁబోయిరి. నిశుంభుఁడు ప్రసేనుని దగ్గఱగాఁబిలిచి 'యీకడసారి ప్రయత్నమును గూడఁ జేయుదము' అని రహస్యముగాఁగొన్ని విషయముల నాతనికి బోధించెను. ప్రసేనుఁ డించుక హర్షమును సూచించు మొగముతో దేవర సెలవు ప్రకారము చేయుదునని వెడలి పోయెను.

## ఇరువదియువ ప్రకరణము

భీమనాయకుని గుడారమునకు దగ్గఱ దగ్గఱగా నాపస్తంబాదులు బసచేసిరి. పర్ణశాలలకు మధ్యగా విష్ణుదేవుని విడిది యేర్పఱుపఁబడెను. మధ్యాహ్న భోజనములకు వేళ కావచ్చినది. సభ్యు లించుమించుగా నేకాభిప్రాయమునకు వచ్చిరి. విష్ణుదేవుఁడు తన బసలోఁ దత్కాలోచితమగు కార్యకలాపమును సరిచూచుకొనుచుండెను. ఒకభటుఁడు వచ్చి అమాత్యప్రసేనుఁడు తేనిదర్శనము గోరుచున్నాఁడని మనవి చేసెను. విష్ణుదేవుఁడు సగౌరవముగాఁ బ్రవేశింపనిమ్మనిచెప్పెను. ప్రసేనుఁడు రాఁగానే సముచిత మర్యాదలు నడపి విష్ణుదేవుఁడు నిశుంభ మహారాజేమి కోరుచున్నాఁడు. శీఘ్రముగా వచింపుమని యడుగఁ బ్రసేనుఁడు రాజా! మాఱేఁడు మీతో నొక ముఖ్యవిషయమును ముచ్చటించి రమ్మని సెలవిచ్చినందున

వచ్చితిని. ముహూర్తకాలము నాకవకాశ మొసంగిన సర్వము నివేదించెదను.

విష్ణు:— ప్రసేనా! ముహూర్తము కాదు. దినమంతయుఁ గావలసిన నీతో మాటలాడుటకు నాకభ్యంతరము లేదు. గౌరవ పూర్వకముగా నడుగుచున్నాను. చెప్పుము.

ప్రసే:—ఇది మీ మనస్సులో మాత్రముంచి యోచింపవలసిన దనిమహారాజు ముందుగా మిమ్ముఁగోరుమనియెను.

విష్ణు:—తప్పక యట్లు చేయుదును? ఎవరక్కడ? (ద్వారపాలుఁడు రాఁగా) దౌవారికా! మరల నేఁజెప్పునందాఁక లోనికెవ్వరిని రానీయకు. నీవును రాకుము.

దౌవా:—చిత్తము దేవర సెలవు. (అని వాఁడు వెడలిపోయెను.)

విష్ణు:—అమాత్య శేఖరా! నిశ్శంకముగా మహారాజ నిశుంభుని సందేశము నెఱింగింపుము. శక్తివంచన చేయక శిరసావహించెదను.

ప్రసే:—అంగీకారమైనను గాకున్నను మీరు దీనిని వెల్లడి చేయగూడదు.

విష్ణు:—ప్రసేనా! ఏల యట్లు గొంకు వహించెదవు? రహస్యమును బయలు పెట్టుటకు నేనంత కుచ్ఛితుఁడనా?

ప్రసే:—మహారాజుగారి తనయ వసుంధరాదేవి యెట్టిపాలెమున మిమ్ము సందర్శించి యుండెనఁట! నాటినుండియు నా లతాంగి తమకై పలవరించుచు దుర్భర వేదనకుఁ బాలెనది.

విష్ణు:—(స్వగతము) అమృతము స్రవించు నక్షరములు వినఁబడుచున్నవి. (ప్రకాశముగ) అటులనా ? మీ మహారాజు తనయను మేనల్లున కీయనెంచునేమో ?

ప్రసే:—ఆ సంకల్పము పూర్తిగాఁ బరిత్యజింపఁబడినది. మహీధరతనయ మల్లిక నాతనికిచ్చి బరిణయమొనర్ప నన్నదమ్ములు నిశ్చయించుకొనిరి. యశోదాదేవియు నందుకు సుముఖురాలై యున్నది.

విష్ణు:—సింహళప్రభు దంపతులు దాని కంగీకరించిరా ? అది వారిని చిన్నపుచ్చుటగా భావింతురేమో ?

ప్రసే:—వసుంధర మణినాగుని ప్రేమింపమి ప్రకటితమైనది. దేవా ! ఇది రాజాంతఃపుర రహస్యము. మణినాగుఁ డెన్ని విధముల బ్రతిమాలిన రాజపుత్రిక కనురాగలేశము జనింపదయ్యెనఁట. పైఁగా నాతని బావా యని మల్లిక పిలుచుటకును సహింపకున్నది.

విష్ణు:—ఆతనియెడ నంత యేవ యేలజనించెనో ?

ప్రసే:—ఆతని దురదృష్టము—లేక—అవినయము.

విష్ణు:—కోమలాంగుల ప్రణయములు బహుచంచలములు. ధీరులు వానిని నమ్మి మోసపోరాదు.

ప్రసే:—మీరట్లు తలంపరాదు. ఆ రాజపుత్రి మీ పదదాస్యమైన లభింపనినాఁడు ప్రాణత్యాగము చేయ సిద్ధపడియున్నది.

విష్ణు:—(లజ్జచేఁ దలవంచుకొని యుండును.)

ప్రసే:—మీ మానసముకూడ నాపేశలగాత్రిపై సక్తమైయున్నట్లు మా మహారాజుగా రూహించుచున్నారు. ఉభ

యులకు నాంతరంగికుఁడ నగుటచే నాకు హృదయ మెఱిఁ
గించుటకు సిగ్గుపడ నక్కఱ లేదని మనవి చేయుచున్నాను.

విష్ణు:—ప్రసేనా! మీ రాజుగారి యూహ సత్యమైనదే. మీ రాజదుహితను జూచినప్పటినుండి నా యవస్థయు నంత కినుమడిగా నున్నది. ఇప్పుడు మీ మహారాజేమి యభిప్రాయ పడుచున్నాఁడు?

ప్రసే—దుహితను దయితగా స్వీకరింప మిమ్మర్థించుచున్నాఁడు. ఇది మొదటి కోరిక.

విష్ణు:—సుమానుషము నాయికా నాయకాధీనము. స్నేహమూలము. గుణసంపాద్యము. మొదటిదగుటచే మఱియొకటి కలదని వ్యక్తమైనది.

ప్రసే:—యథార్థమే! ప్రప్రథమాంధ్ర చక్రవర్తి యను ఖ్యాతి తనకుఁ గావలయునని ముచ్చటపడుచు నయ్యది లభింపఁజేయ మిమ్మాదర భావముతో నర్థించుచున్నాఁడు.

విష్ణు—(ఆశ్చర్య వైలక్ష్యములతో) ప్రసేనా! నేనెట్లు లాపని చేయఁగలను? అది నా చేతిలో నేమున్నది. ప్రజ లెవ్వని కోరుదురో వాఁడు చక్రవర్తి కాఁగలఁడు. మీ మహారాజు ప్రజాసమ్మతి పడసినచో నాతఁడే చక్రవర్తి కాఁగలఁడు. మేమందఱ మాతనియాజ్ఞలకు బద్ధులమై నడచుకొందుము.

ప్రసే:—ఆతనికోర్క సముచితమని మీరుతలంచిననో నెఱవేర్పగలరు. చక్రవర్తి విష్ణుదేవుఁడా? నిశుంభుఁడా? యనియే ప్రజలు నిర్ధారణ చేయవలసియున్నది. తక్కిన వారి నామము లడుగున బడిపోయినవి. మీ రడిగినచో గత్యంతరము లేక ప్రజలు మామహారాజునే చక్రవర్తిగాఁ గోరి

కొందురు చక్రవర్తి తన కూఁతునిచ్చి మిమ్ము సంభావించును. కాకులమువలెనే రత్నసానువును మీకు రాజధాని కాఁగలదు. బాగుగా నాలోచించుకొనుఁడు.

విష్ణు:—ప్రజాభీష్ట ప్రతిరోధము చేయఁజాలను. కావలయునని వాంఛింపను. మీ కేఁడంత కుతూహలిగాయున్న నొక్క మాట యివ్వఁగలను. ఐకకంఠ్యముగా నన్నే చక్రవర్తిగాఁ బ్రజలంగీకరించిరేని నిశుంభ దుహితను దత్సమ్మతినిఁ బెండ్లియాడి ప్రజాహితము భంగపడనంతవఱకు నిశుంభునిచే రాజకార్యములు చేయించెద. నేనుగాక మఱియొక్కఁడు చక్రవర్తి యైనచో మీకేని గౌరవమున కెట్టిభంగము కలుగకుండఁ గాపాడెద.

ప్రసే:—రాజా! తానుఁ జక్రవర్తి కాకున్న మాకేఁడు తనయను మీకీయక పోవచ్చును. రాణితోడి రాజ్యము. మీఁద మీ యిష్టము.

విష్ణు:—(అనాదరముగానవ్వి) ఐహికభోగములకాశించి విష్ణుదేవుఁడెన్నఁడు ప్రజాభీష్టమునకు భంగము కలిగింపఁడు. వసుంధరను నాహృదయము ప్రేమించినమాట సత్యము. ఆ సతీమణికి నాయం దనురాగము లేకున్నను, నిశుంభుఁడడ్డాదిడ్డి మాటలాడినను సువర్ణముతో వసుంధరా విగ్రహము చేయించి చూచి యానందించెదఁ గాని వేఱొక్కపడంతికి హృదయమున నిఁక స్థానమీయఁజాల. అమాత్యవరా! నీ వీ ప్రసంగముచే నన్నింక శ్రమపెట్టకుము.

ప్రసే:—నిశుంభమహారాజు మీ కనాదరము చేయఁదగిన చుట్టముకాఁడు.

విష్ణు:—ఎన్నఁడు నే ననాదరము చేయను. అంతటివాఁడు చక్రవర్తిగా లభించుట ప్రజలయదృష్టమే. వారాతని యేలుబడి నభిలషింప వలయుననియే నాయాశయము.

ప్రసే:—మీరు మీ యుద్యమము నుపసంహరించు కొనకున్నఁ బ్రజలాతని నాదరింపరు.

విష్ణు:—ప్రసేనా! మహారాజుమంత్రివై యుండియు నట్లు మాటాడుచున్నావు? నే నుద్యమము నుండి విరమించుకొన్నఁ బ్రజలు మీవిభుని చక్రవర్తిం జేయుదురా? అట్లెన్నటికి జరుగదు. తమకిష్టుఁడైన మఱియొకని బేర్కొందురు. నేనిప్పు డుద్యమమునుండి తొలఁగిన నాపస్తంబాది మహర్షులు, భీమేశ్వరాది ప్రభువులు, గురునాథాది పితృసఖులు నేమని భావింతురు? ప్రసేనా! నీ యుపదేశము నాకు రుచింపకున్నది. ఇట్లు చెప్పినందుకు నన్ను మన్నింపుము. నా యందు నీవు, మీఱేఁడు కనబఱచిన యనురాగమునకు సంతసించితిని.

ఇంతలో భోజనమునకు సమయమైనదని సూచించుగంట మ్రోఁగెను. ప్రసేనుఁడు సెలవు తీసికొందును. రహస్యగోపనము మఱవకుఁడని చెప్పి వెడలిపోయిరి. అర్జునదేవుఁడు ప్రసేనుని గమనాగమనములుచూచి విష్ణుదేవుని గలిసికొనెను. ఆతఁ డేమియుఁజెప్ప లేదు. అతఁడేమియుఁ బ్రశ్నింప లేదు. విష్ణుదేవుని ముఖము గభీరమై నిశ్చలమై యుండెను. అర్జునదేవుఁడు 'మిత్రమా! ఆపస్తంబాదులు నీ రాక కెదురు చూచు చున్నవా' రనెను. ఇదిగో! వచ్చు చున్నాననుచు విష్ణుదేవుఁడు సత్వరముగాఁ జనియెను.

భోజనానంతరము వేళకుఁ గార్యక్రమము ప్రారంభ మయ్యెను. అధ్యక్షుని యనుమతిని వేడి విష్ణుదేవుఁడు ప్రజల కభిముఖుఁడై "సభాస్తారులారా! మా యాహ్వానమును మన్నించి యిందఱు కాయ కష్టమునకోర్చి దయచేసి నందు లకు నా హార్దమును దెలుపుచు నొక్కమాట మనవి చేయు చున్నాఁడను. సమ్రాట్టును నిర్ణయించుకొను భారము మీపై నున్నది. అవ్యగ్ర హృదయములతో నిశ్చయము చేసికొని పరస్వీయాభిమానములు విడచి దైవముఖమును జూచి తగిన మహావీరుని జక్రవర్తిగా నిర్ణయించు కొనుఁడు. వయసుచేత, విక్రమ సంపద చేత నత్యధిక విఖ్యాతి గన్న భీమనాయక నిశుంభాది మహారాజు లున్నారు. మనము కొంత కాలము వారి చాటున నుండి యనుభవము సంపాదింప వలసిన తరుణమిది."

ఇట్లు చెప్పుచుండఁగా నిశుంభునివర్గ ముత్సాహముతో వినుచుండెను. తక్కిన ప్రజలెల్లరు నిరుత్సాహపడిరి. ఒక్క నిమిషములో చంద్రోదయకాలమున సముద్రమట్లు సభాస్థలము ఘూర్ణిల్లెను. ఆప స్తంబుఁడది గ్రహించి తటాలునలేచి విష్ణు దేవునితో 'వత్సా! నీవు కూర్చుండు'మని వారించి సభ్యుల కభి ముఖుఁడై యుచ్చైస్స్వరముతో నిట్లువచించెను. సభ్యులు మేఘ గర్జితమును మయూరములట్లు హృష్టులై వినఁదొడఁగిరి.

"సభాకల్పతరువునకు నమస్కృతిశతములు. మీకుఁ దెలుపవలసిన విషయములన్నిటిని నిన్నవివరించి యున్నాఁడను. మనమింక జాగుచేయఁదగదు. ఎవ్వఁడు సర్వజనాంగీకారమున లేదా - యత్యధిక జనాంగీకృతికిఁ బాత్రమగునో ఆ మహానీ

యుఁడు చక్రవర్తి కాఁగలఁడు. మన భావి మనచేతులలో నున్నది. మీరందఱు నైకకంఠ్యముగా నొక్కనిపేరు చెప్పుట ముదావహము."

ఆ మాటలువిని ప్రజలందఱు విష్ణుదేవుఁడు మా చక్రవర్తి విష్ణుదేవుఁడు మా చక్రవర్తి—యని యఱచిరి. నిశుంభుఁడు మా చక్రవర్తి యని కొందఱఱచిరి. ఆపస్తంబుఁ డల్ప సంఖ్యాకులు నిశుంభపక్షము నవలంబించియుండుట గ్రహించి "మీరంద ఱొకేపేరుచెప్పిన బాగుగానుండెడిది. ఇప్పుడు విష్ణుదేవుఁడు, నిశుంభుఁడు పేర్కొనఁబడిరి. ఎవరిపక్షమున నధిక సంఖ్యాకు లుందురో ఆతఁడె చక్రవర్తి యగును. విష్ణుదేవుని పక్షమువారు వేదికకు దక్షిణమునను నిశుంభ పక్షము వారు త్తరమునను గూరుచుండుఁడు." అని చెప్పెను. జనులుబిల బిలలాడుచు క్షణములో రెండుపాయలైరి. దక్షిణమున నత్యధిక సంఖ్యాకులు చేరిరి. ఆ సందడిలో నిశుంభుఁడు మెల్లగాఁ దన విడిదికిఁ బోయెను. మహీధరుఁ డచ్చటనే నిలిచి యేమి జరుగునోయని చూచుచుండెను. ఆపస్తంబుఁడు గంభీరస్వర ముతో నిశుంభుని పక్షమువా రత్యల్పులు, విష్ణుదేవునిపక్షము వా రత్యధికులునై యుండుటచే విష్ణుదేవుఁడు చక్రవర్తి యయ్యెను. ఆంధ్రసామ్రాజ్యము స్థాపితమయ్యెను. సుముహూర్తముచూచి సామ్రాజ్యపట్టాభిషేకము జరుపఁబడును. అప్పుడు మనమందఱము మరలఁగలిసికొందము" అనెను. నిశుంభుని పక్షమునుండి యెవరో 'ఈ చింబోతురాయని మాట మాకు పాటిలేదు. మాకు నిశుంభుఁడే చక్రవర్తి' అని యఱచిరి. ఆమాటలువిని యుగ్రుఁడై యాపస్తంబుఁడు—"ఎవ్వఁడాశఠుడు. మహర్షి ధిక్కారము మహానర్థ దాయకమని యెఱుఁ

గదా? నీవు నీ చక్రవర్తి యత్యల్పకాలముననే సంగ్రామరంగ మున దుర్మరణము నొందుదురు గాక! ఈ శుభతరుణమున నింకెవ్వరు ప్రతికూల వాక్యము లుచ్చరింపకుండ నిశుంభ పక్షమువారికి మందిరమున నున్నంతవఱకు వాగ్బంధ మగుం గాక!" అని శపించెను. భీమేశ్వరుఁడా మహర్షిని బ్రార్థించి శాంతింపఁ జేసెను. విష్ణుదేవుఁడు వినయముతో "మహాజను లారా! మీరు నాయందుఁ గనఁబఱచిన వాత్సల్యమునకు సంతోషము గలుగుచున్నను నా మీఁదఁ బెట్టిన మహాభార మును నేను నిర్వహింపఁ గలనాయను జంకు జనించుచున్నది. ప్రజాభిమతమును ద్రోసివేయఁ జాలక నేనీ పదవిని స్వీకరించు చున్నాఁడనుగాని యేవిధమైన యైహికవాంఛచేతను గాదని త్రికరణశుద్ధిగాఁ జెప్పుచున్నాను. మీ యభీష్టములు నిర్వ హింప శక్తివంచన చేయక పాటుపడియెదను. మఱియు దుష్ట త్వముతో మీ యాశయము నెఱవేఱకుండఁ జేయుటకుఁగాని యది సక్రమముగా నిర్వహింపఁ బడకుండుటకుఁ గాని ప్రయ త్నించిన వారినందఱినిబట్టి పరమేశ్వరుఁ డడ్డువచ్చినను వధించెద నిరాఘాతము నిష్ప్రతిద్వంద్వమునైన మార్గము నేర్పఱచియే నే నాంధ్రసామ్రాజ్యమునఁ బట్టాభిషిక్తుండ నయ్యెద. ఇది దక్షిణాయనము. ఉత్తరాయనము రాఁగానే యమూల్యమైన మీ యాశీర్వచనము పడయుటకు మరల నాహ్వానమంపెదను. మీరు మా కతిథులు. విందారగించి సుఖముగా నిండ్లకుఁ జేరుఁడు." విష్ణుదేవుఁడా మాట లను చుండఁగానే భీమనాయకుఁడు లేచి "మీయందఱి సమ్మతి ప్రకారము నాంధ్రసామ్రాజ్యమునకు విష్ణుదేవుఁ డధికారి యని నిర్ధరింపఁ బడినది. ఐకమత్యముతో సామ్రాజ్య నిర్వహణ

మునకుఁ దోడ్పడి శ్రేయ మనుభవింపుఁడని దీవించి సభా కార్యక్రమము ముగిసిన"దని చెప్పెను. అందఱు జయ జయ ధ్వానములు చేయుచు సభాభవనమును వీడిరి.

మహీధరుఁడు మాటాడకపోయి నిశుంభున కాపస్తం బుని శాపప్రకార మెఱిఁగించెను. నలుగురలోనాకు మఱి యొక ్యవమానమును దెచ్చిపెట్టిన యీ మూర్ఖుఁడెవఁడని నిశుంభుఁడాగ్రహించి యడిగెను. అప్పుడెవ్వరు చెప్పఁజాలరైరి. కాని కొంతసేపటికి ఋషిని ధిక్కరించినది మణినాగుఁడని వారికి తెలియవచ్చెను.

సమావేశము సక్రమముగా జరిగినదని యెల్లరు హర్షిం చిరి. మరునాఁడు జానపదుల యుత్సాహముకొఱకు వస్తుప్రద ర్శనమొకటి సమకూర్పఁ బడెను. అన్నియు దేశమున నిర్మింప బడిన వస్తువులేయైనను జేయువారి శ్రద్ధానైపుణ్యములనుబట్టి ప్రజలాదరించి యీ వస్తుజాలమును విఱుగఁబడి కొనుచుండిరి. ముఖ్యులైనవారు చాలమంది నిజనగరములకుఁ బోయిరి. సమీప గ్రామవాసులు తాముస్వీకరించిన వస్తుజాలమును మూటలుగాఁ గట్టి నెత్తిపైఁబెట్టుకొని మోసికొని పోఁదొడం గిరి. సంధ్యాసమయ మయ్యెను. జనులలోఁ బెద్ద గగ్గోలు పుట్టెను. బజాఱు దోఁపిడిచేయఁ బడుచున్నదని ప్రజలు చెప్ప కొనసాగిరి. బేరజపుమూఁకలు భయపడి పఱవసాగిరి. పూర్ణ భద్రాదులు రాజధానికిఁబోయి యుండిరి. అక్కడనున్న కొలఁది మంది భటులు ప్రజల యశాంతి నడఁపఁజాలరైరి. కొందఱు రాజధానికిఁ బరుగెత్తి వజ్రధర విష్ణుదేవాదులకా వృత్తాంతము దెలిపిరి. విష్ణుదేవుఁడు పూర్ణభద్రునిజూచి నీవుపోయి దానిని

జక్కపఱచి రమ్ము! ఎవరికిఁ జెరుపు చేయకుము. వారందఱు మనకతిథులు – ఈ దుండగమునకుఁ గారకులెవ్వరో తెలిసికొని చిక్కినచో వారిని బంధింపుమని చెప్పెను. పూర్ణభద్రుఁడు కొందఱాశ్వికులను వెంటఁగొని సత్వరముగాఁ బోయెను. అతఁ డేగునప్పటికే చాలభాగము సంక్షోభము చల్లారెను. ప్రజల సాహాయ్యమున నచటిభటులు కొందఱ దోఁపిడికాండ్రను వస్తువులతోఁ బట్టుకొనిరి. పూర్ణభద్రుఁడు వారినందఱను రాజధానికిఁ దీసికొనిపో సెలవొసంగి వ్యాపారులకుఁ గొల్లపోయిన వస్తువులకుఁ బరిహార మిప్పింతునని వారిని సమాధానపఱిచి పంపెను. ఒక్కపురుగు లేకుండ నెవరిఇండ్లకు వారు పోయిరి.

# ఇరువదియొకటవ ప్రకరణము

అనంతర కార్యక్రమ నిర్ణయమునకై యర్జునదేవుని గాకులమున విడిచి భీమేశ్వరుఁడు దక్షవాటి కరిగెను. యుద్ధమే తప్పనిసరియైనచోఁ దాను సముద్ర ప్రాంతమును గాపాడఁగలనని తన యుత్సాహమును వెల్లడించెను. ఆపస్తంబుఁడు తన శాపమున కమోఘతా సంపాదనము నీమీఁదనున్నదని, తన సైన్యములను గాలకేతువు నడపగలడని చెప్పి యాతని నచ్చట విడిచి వెళ్లెను. వజ్రధరుఁడు పట్టుబడిన చోరవీరులను విచారించెను. వారు మహీధరు ననుమతిని మణినాగుఁడు ప్రోత్సహింప నట్టి యకార్యమును గావించితిమని యంగీకరించి తమ్ము విడువఁ బ్రార్థించిరి. గురునాథుఁ డావశ్యకమైన స్వశక్తి నంతను ధారపోయుదునని తనతోఁ జెప్పిపోయెనని పూర్ణభద్రుఁ

డెత్తించెను. సర్వజనాభిప్రాయము యుద్ధము వలననే మొగ్గుచుండెను. అదియంతయు సావధానమనస్కుఁడై పరిశీలించి సంగ్రామము తప్పదని విష్ణుదేవుఁ డర్జునదేవ వజ్రధరాదులతో యోచించి నిశుంభున కంత్య సందేశము పంప నిశ్చయించెను.

నిశుంభుఁడును నిజనగరము చేరుకొన్న పిమ్మట ప్రసేనాదులరావించి కార్యనిర్ణయమునకుఁ గోరకొనెను. మహీధరుఁడు తమ సైన్యసంపదను వర్ణించి యెంద తేకమైన జయము తమకే నిశ్చయముగా లభించునని చెప్పెను. మణినాగుఁడు తాను స్వయముగా సింహళమునకుఁ బోయి యపార నౌకాబలముతో వచ్చి సముద్రతీర దేశము నాక్రమించెదనని చెప్పెను. ప్రసేనుఁడు "మహారాజా! మంత్రులు ప్రభుహితాభిలాషులే కాని వారికొక యభినివేశముండదు. కావున యేలిక మేలుకోరి నే నొక చిన్న మనవి చేయుచున్నాను. ప్రస్తుతము మన బలము కంటె శత్రుబల మధికముగాఁ గనఁబడుచున్నది. భీమనాయకుని కపారమగు నౌకాబలమున్నది. కాళింగులు మొదట నుండియు నోడల నిర్మాణమున నౌకాయుద్ధమున నిపుణులని పేరు పొందియున్నవారు. మణినాగుఁడు సైన్య సమేతుఁడై వచ్చునందము. కాళింగులకు స్థానబలము హెచ్చుగా నుండును. అదియుఁగాక వజ్రధరుఁడు కొంతకాలమునుండి నౌకాబలమును వృద్ధిచేయుచువచ్చెను. వారికి వీరు తోడైనచో సింహళసైన్యములు ప్రాణసంరక్షణమునకు లోను గావలసి వచ్చును. విష్ణుదేవుని మీరును జూచియున్నారు. అతని విక్రమ సంపదకు మోహరించి నిలుచుశూరుఁడు మనపక్షమునఁగానరాకున్నాడు. అగ్నికి వాయువువలె నర్జునదేవుఁ డాతనికి దోడైయున్నవాడు.

పూర్ణభద్రునివ్యూహ రచనాపటిమత లోకవిశ్రుతము. ఇట్లు చెప్పు చున్నానని మనము దుర్బలులమని యభిప్రాయ పడుచుంటినని కాని, ప్రాణములు దాఁచుకొన యత్నించు చుంటిననికాని దేవరవారు తలంప గూడదు. మనసామంతులలో నసహాయ శూరులు లేకపోలేదు. మహీధరుఁడొక్కఁడే వారి నందఱ మట్టు పెట్టఁగలఁడు. దేవరవిక్రమము చెప్పనేల? ఉభయ పక్ష బలాబలములు పరికించి నిష్పక్షపాతముగా వచింపవలయు నన్న నిత్తఱి మనకు సంగరము శ్రేయస్కరముకాదు. మఱి యొక్కటి. వసుంధరాదేవి విష్ణుదేవుని బ్రేమించియున్నది. తల్లిదండ్రులనువీడి యాకన్నియ మిమ్మే నమ్మియున్నది. విష్ణు దేవునకు నాలతాంగియెడ గాఢానురాగముకలదు. దైవికముగా వసుంధరా పాణిగ్రహణ భాగ్యము తనకబ్బనిచో నామె సువర్ణ విగ్రహమునైనఁ జేయించిచూచి యానందించెదఁగాని వేఱొక కాంతకు హృదయసీమను స్థానమొసంగనని యారాజ కుమారుఁడు ఖండితముగా నాతోఁజెప్పెను. అట్టి పవిత్రప్రేమకు విచ్ఛిత్తి కలిగించు కర్యమునకుఁ గాలుద్రవ్వక యేలినవారు తనయ నాతనికిచ్చి వివాహముచేసి కూడిబ్రదుకుట సర్వవిధ ముల సుఖావహము" అనిచెప్పెను. మణినాగుఁ డింతకంటె సిగ్గుచేటు మఱియొకటి లేదనెను. మహీధరుఁ డట్లుచేయుట గాజులు తొడిగించుకొనుట యనెను. నిశుంభుఁడు "నేనంతటి యవమానమును భరించి బ్రదుకుటకంటె కొనయూపిరి యున్నంతవఱకుఁ బోరాడి వీరస్వర్గ మలంకరించుటే మేలు. కాని నీవన్న తుదివిషయము నామనసును వేధించుచున్నది. వసుంధరమనసు చిన్నపుచ్చుకొనునని యెంతశాంతము వహించి కలుపుగోలుతనమునకుఁ బ్రయత్నించిన నాప్రయత్నము

బూడిదలోఁ బోసిన పన్నీరైనది. ప్రసేనా! ఏమిచేయుటకునిశ్చ యింపఁ జాలకున్నవాఁడ" ననియెను.

ప్రసేనుఁడు:—మనకిప్పుడు సంభవించిన యవమాన మేమియు లేదు. ప్రజలు విష్ణుదేవుని చక్రవర్తిగా నెన్నుకొనిరి అం దఱితోఁ బాటు మనము దాని కంగీకరింతుము. అను కూలుఁడైన వరునకు గన్యనిత్తుము; లేదా స్వయంవరము కావింపుఁడు. అందు మీ తనయ యాతని వరించును. అప్పు డన్యోన్యాను రాగముగల దంపతులకు వివాహము జరు గును. మన యొడంబడిక నాతఁడు పాలించును. మీ యిచ్చవచ్చినట్టులు రాజ్యతంత్రము నడచును.

నిశుం:—ప్రసేనా! నీవు చెప్పినది సమంజసముగానే యున్నది. కాని దురభిమానము నన్ను పీడకున్నది. ఆప స్తంబుని శాపమో దైవసంకల్పమో దీనికిఁ గారణము తెలియఁ జాలకున్నవాఁడ. సరే! రేపు యోజింతము. నేఁడు నామనసు వికలమైయున్నది. కొంత కుదుటఁబడినఁగాని కార్య నిశ్చయము తోఁపదు.

ప్రసే:—అట్లే చేయవచ్చును. నేఁడేమి మించిపోయినది.

మహీధరుఁడు మాటాడ లేదు. మణినాగుఁ డసమ్మతి సూచకముగ హసించెను. నిశుంభుఁడు కొలువు విడిచి యంతః పురమునకుఁ బోయెను. వసుంధర సంశయించుచు వచ్చి తండ్రిని బ్రియముగా మాటలాడి కొంత యుత్సాహము కలి గిన పిమ్మట సభాపర్యవసానమును బ్రశ్నించెను. జరిగిన దంతయు సవిస్తరముగా యథార్థముగా నాతఁ డామె కెఱిఁ గించెను. వికాస భాసురమగు నా బాలామణి ముఖపుండరీక

మునఁ దోలకాడు సామ్రాజ్యలక్ష్మీకళ నాతఁడు కన్నులారఁ జూచి యానందించెను. తల్లీ! నా జీవితము ధన్యమైనది. నేనింతమాత్రము నోఁచి పుట్టితిని. ఇంక నిశ్శంకముగా సమర సాగరమున నుఱికెదను. నక్రము నన్నీడ్చుకొనిపోయి పదచ్యుతి నొదవించినను విచారింపను. నీవు నీప్రాణేశ్వరుని గూడి సుఖింపుము. మీతల్లివలెనే జ్యోతిర్మయలోకమున నుండి నిన్నుఁ జూచి యానందించెదనని యాతఁడు ధీరముగా వచించెను. వసుంధర తెల్లపోయి 'తండ్రీ! కలవరించు చున్నావా?' యనెను.

నిశుం:—లేదు. జరుగఁగల యంశమునే వచించుచున్నాను.

వసుం:—నాకు భయము జనించుచున్నది.

నిశుం:—బిడ్డా! కన్నీరు తేకుము. ఎన్నివిధముల ప్రయత్నించి నను మనసు మరలకున్నది. సంగ్రామము తప్పదు.

వసుం:—పోరాటమున కిప్పు డేమివచ్చినది?

నిశుం:—నేను జీవించియుండి యితరుని యున్నతిని సహింపఁ జాలను. ఈ దుర్గణమునకే నేను బలియయ్యెదను. నీవు నీ ప్రాణేశ్వరునిగూడి సుఖింపుము. నా కది సంతోషదాయ కమే. నన్నుఁ దలంచి వంతనొందకుము.

వసుం:—(గద్గద కంఠముతో) అట్లనకుము. తండ్రీ! మహా రాజా! నీవు సుఖముగానుండుము. ఐహికసుఖములందు నాకంత ఆస్థ లేదు. యావజ్జీవము సన్యాసినినై యామహా పురుషు నారాధించుచుండెదను.

నిశుం:—వినఁజాలనుతల్లీ! నీప్రేమ సర్వోత్కృష్టమైనది. దానిని నిరోధింప వలయునని యెకప్పుడు నేననుకొనలేదు. నా

దురభిమానమే నన్ను మరణమునకుఁ బ్రేరేచుచున్నది. నీవు సమ్రాట్టునర్ధాంగివై సుఖింపవలయు ననియే నాకోరిక. ఆతనియందు నీకెంత ప్రేమయున్నదో నీయం దాతనికినంత ప్రేమయున్నదని రూఢిగావింటిని. దైవికముగానీవు లభింప కున్న స్వర్ణవసుంధరను జేయుంచి యానందించెదఁగానియన్య కాంతకుహృదయమీయనని యాతఁడు ప్రసేనునితోఁ జెప్పెనట. నేను లేకున్నను నీకులోపముండదు. ఆ ధైర్యముకలుగకే నేనింతకాలము దుర్భరావేదనకుఁ బాల్పడితిని. ఇఁకనాకు భయములేదు. జీవితాశలేదు.

వసుంధర విషమిశ్రితమైన యమృతమువలె నున్న యాతనిమాటలను విని నిశ్చేష్టయయ్యెను. తమంతదామె యామెకనుఱెప్పలువాలెను. జీవితేశ్వరుని సుందర వదనారవిం దము హృదయగోచరమయ్యెను. ఆమె కొంతసేపటివఱకు మాటాడలేకపోయెను. విష్ణుదేవుఁడు చంద్రహాసముతో నిశుం భునిదెగనేసి తన్నుంకపీఠినాదరించిన ట్లామెకుఁ బొడగట్టెను. అవ శ్యంభావికి విచారపడఁ గూడదనిచెప్పి పితృశోక కర్శితయైన తన్నూఱడించి సబాష్పవదనమును ముద్దాడినట్లు తోఁచెను. ఆమె మఱియేమియు మాటాడలేక తనగదిలోని కేగెను. నిశుంభుఁడును గొమారిత తనువు పులకితమై యుండుట గ్రహించి శూన్యహృదయముతో నచ్చోటు విడిచెను.

మఱునాఁడెప్పటివలె నోలగముననాసీనుఁడై నిశుంభుఁడు మహీంధరునితో "సోదరా! కార్యక్రమము నిశ్చితమైనది. ధైర్యసాహసములతోఁ బోరాటము సాగింపవలసినదే. అణు మాత్రము వెనుకచూపులేదు. సర్వసైన్యములను సమీకరించి

కావలసిన కట్టుదిట్టములుచేయుము. దుర్గసంరక్షణాది కార్యములఁ దగువారి నియోగింపుము. సామంతులకు నాటవికులకు నాహ్వానమంపుము. పిఱికిగుండె కలవారి నందఱ నవ్వలకుఁబంపివేయు' మని యాజ్ఞయొసఁగెను. సభలో నొక్కసారియుత్సాహఘోషము లుప్పతిల్లెను. ప్రసేనుఁడు నిశుంభుని తెగువకు, స్వాతంత్ర్యతకు వెఱగందె యాతని యెదుట నేమనుటకుఁ బుఱ్ఱలోడెను. మహీధరుఁడు 'మహారాజా! మనమవశ్యము గెలుపు గొందుము. సమృద్ధమగు సైనికబలము నిస్తులమగు ప్రభుశక్తి యనిర్వాచ్యమగు మేధాసమగ్రత కలిగి యాహవదోహలమున మెఱయు మనల ముల్లోకము లెదిర్చియుఁ బరిభవము నొందఁగలవు. అయినను మణినాగుని బంపి సింహళమునుండి సైనికుల రావింతము. మహారాజు చూలోదరున కిట్టులును మన సమర ప్రయత్న మెఱిఁగింప వలయుఁగాదా?' యనెను.

నిశుంభుఁడు సమ్మతించెను. మణినాగుఁ డపార సేనా సమేతుఁడనై వచ్చి వేలనతిక్రమించు పారావారంబు పగిది సముద్రతీర దేశముల నాక్రమించి నా విక్రమసంపదచే మాతులచిత్తము మెప్పించెదనని పలికి ప్రయాణసన్నాహ మొనర్ప నేగెను.

ఇంతలో ద్వారపాలకుఁడు వచ్చి 'దేవా! కాకులము నుండి యిరువురు సందేశము తెచ్చియున్న వారిని మోఁకరించి మ్రొక్కి వచించెను. నిశుంభుఁడింక సందేశములతోఁ బనిలేదు. అయినను బ్రవేశపెట్టు మనెను. చిత్తము మహాప్రభూ! యని వాఁడు వెడలిపోయెను. యోధవేషములతో నున్న యిరువురు నిశుంభునకు మ్రొక్కి సార్వభౌముల శాసనమని జాబు

నిశుంభు నెదుట నుంచిరి. ఎవఁడీ సార్వభౌముఁడు! మేమాతని జాబుచూడవలసిన పనియేమున్నదని నిశుంభుఁడుగద్దించి త్రోసి వేసెను. సందేశహరు లట్లే నిర్భయులై నిలిచియుండిరి. మహీంధరుఁడు సచివ సత్తమా! అది యేమో పరికింపు మనెను. నిశుంభుని మానము నర్ధాంగీకారముగా గొని ప్రసేనుఁడు జాబు విప్పి యిట్లు పఠించెను. శ్రీ శ్రీ శ్రీ మహారాజ నిశుంభునకు- ఆంధ్రచక్రవర్తి యాదర పూర్వకముగా వ్రాయు సమాచారము. మొన్నటిసమావేశానంతరము శేషించిన కార్య క్రమమును బూర్తి చేయవలసినదని భీమేశ్వరుఁడానతిచ్చినందున యీలేఖ మీకు వ్రాయుటావశ్యకమైనది. మన మేర్పఱచుకొనిన నిర్ణయముల ననుసరించి యొక యొడంబడిక వ్రాసికొని యందఱము సంతకములు పెట్టవలసి యున్నది. మే మొక పత్రమును వ్రాయించి దీనితో జతపఱచి పంపియున్నారము. దాని నుదార సరళస్వభావముతో విమర్శించి సమ్మతమైనచో హస్తాక్షరి చేర్పఁగోరుచున్నాము. సందేహము లేవైననున్నచో స్వయముగాఁగాని ప్రతినిధి ముఖమునఁగాని విన్నవించుకొన వచ్చును. నాలుగు దినములలో సందేహములు తెలుపక పోయిన, సంతకము చేసి యొడంబడిక పంపకపోయిన మీరీ సమాఖ్యకు వ్యతిరేకులని భావింపఁబడుదురు. ఆంధ్రజాతీ యాభ్యుదయము ప్రధానలక్ష్యముగా నెలకొల్పఁబడిన యీ సమాఖ్య కెవ్వరు వ్యతిరేకభావము చూపుదురో వారు సద్యోవధార్హులని సూత్రము కావింపఁబడినది కావున విముఖుల కిదియే యంత్యసందేశము.

మఱియొక్క సంగతి- మొన్న మీ పాళెగాండ్రు కొందఱు మణినాగుని ప్రోత్సాహముచే బజాఱు దోచుకొనుచు

సామ్రాజ్యరక్షకులచేఁ బట్టుకొనఁబడిరి. వారు తమ తప్పిదము నొప్పుకొని శరణు వేఁడినందున ప్రథమాపరాధముగా భావించి వారిని విడిచిపెట్టితిమి. ఇయ్యది మీయెఱుకపై జరిగినదని మేము తలంపము. అయిన నికముం దిట్టి దుష్కృతములు జరుగకుండ శ్రద్ధ చేయుదురని నమ్ముచున్నారము.

ఇట్లు,
విష్ణుదేవుఁడు
(ఆంధ్రచక్రవర్తి)

నిశుంభుఁ డదివిని నేయిపోసిన నిప్పువలె భగ్గుమనెను. విష్ణుదేవుఁడే యిట్లు వ్రాయ సాహసించెనా? ఆతనికడ నట్టి కూటము చేరినది. శుద్ధ సలిలోప శోభితమైనను బన్నగ కులాక్రాంతమగు విషాశయము విషాశయమే యగును. ప్రసేనా! మనసు భేదించినప్పు డన్నియు నహితములు నసహ్యములు నగును. "విన్నవించుకొన వచ్చును." నిశుంభుని భ్రేష్యునిగా దలంచునంతటి గర్వమునకు హేతువు కానరాదు. తన్నుఁ జక్రవర్తి యన్నవి మేఁకపోతులని యాబాలుఁ డెఱుఁగక మోస పోవుచున్నాఁడు. "ఇదియే అంత్యసందేశము." కితవుఁడగు వజ్రధరునిమాటయైయుండునిది. అట్లన్నచో వెఱచి నిశుంభుఁడు పాదాక్రాంతుఁడగునని యా బుద్ధిహీనుఁ డూహించియుండును. మహీధరా! మనపక్షపుఁ బాళెగాండ్రు, సామంతులు మనతోనే వచ్చియుండగా వారిమీఁద దోషారోపణచేయుట కయ్యము నకుఁ గాలుద్రవ్వుట కాదా! వీని కింతలోనే కన్నులు నెత్తి కెక్కినవని తలంప లేదు. (సందేశహారులతో) "మీ రాజు శ్రమ కోర్చి వచ్చినచోఁ దగినయాతిథ్య మొసఁగుదుమని చెప్పుడు.

రాక వెలిచినచో స్వయముగావచ్చి నిశుంభమత్తశుండాలము దుష్టచతుష్టయమును మట్టి చేయఁగలదని వచింపుఁడు. ఇఁక నాంధ్రదేశ మనేకులచే నేలఁబడుట మాత్ర మసంభవమని వక్కాణింపుఁడు" అనిచెప్పెను వార్తాహరులు "రాజా! వృథా వివాదము పెట్టుకొని దేశశాంతి కేల భంగము కల్పింతువు. 'బలవంతుఁడనని పలువురతో నిగ్రహించి పలుకుట మేలా?' సార్వభౌమునాజ్ఞ ననువర్తింపుము" అని వచించిరి. నిశుంభుఁ డుగ్రుఁడై "మహీధరా! వీరు తమ యర్హత నతిక్రమించి మాటాడుచున్నారు. వీరిని బంధింపుము! రణభేరి మ్రోయింప నాజ్ఞ యొసఁగుము" అనిచెప్పి కొలువు చాలించెను. ఆతని యాజ్ఞప్రకారము మహీధరుఁడు వార్తాహరులను బంధించెను. ప్రసేనుఁడు దూతలు శిక్షార్హులుకారు. అయిన వీరు రాజ నియోగమును నెఱవేర్చుటతోఁ దృప్తినొందక యధిక సంభాషణమున కుపక్రమించి స్వదోషమున దండితులైరి అనెను. వార్తాహరులు జంకక 'కావలయుననియే అట్లు చేసితి' మని పలికిరి. మహీధరుఁడు వారిని చెఱసాలలో నుంచున ట్లుత్తరు వొసంగెను.

చెఱసాలలో కొలఁది దినములు గడచినపిమ్మట నా వార్తాహరు లొకనాఁ డిట్లు సంభాషించుకొనిరి.

మణిభద్రా! కారాగారాధికారి మిగుల క్రూరునివలె నున్నాఁడు. మనమిచటనుండి బయలువెడలుటెట్లు? సార్వభౌముని శాసనము నిర్వహించుటెట్లు?

మణి:—కాలకేతూ! భయమక్కఱలేదు. నాకొకయుపాయము తోఁచుచున్నది. మనకన్నపానములు తెచ్చియిచ్చువారిలో

బొట్టిది సౌమ్యురాలివలెఁ గనఁబడుచున్నది. ఆమెతో నెమ్మదిగాఁ బరిచయము చేసికొని రాజదుహితలకు మన మిందున్నట్లు వర్తమానించినచో వారు మనసందేశము నందుకొని కొదువవపనికి మార్గమేర్పఱుపఁ గలరు. మల్లిక తలంచుకొన్నచో మహీంధరుఁడేమి చేయఁగలఁడు? నిశుంభుఁడు మొన్నటికంటెఁ గ్రౌర్యము వహించినట్లున్నాఁడు.

**కాల:**—అంతఃపురమునకు మనసమాచారము రహస్యముగా నెఱిఁగింపఁగలవారే కావలయును. నాబిడ్డ మోమొక్కసారి చూడవలయునని హృదయము తొందఱపడుచున్నది. నేను దండ్రినని పాపముబాల యెఱుఁగునో యెఱుఁగదో?

**మణి:**—ఎఱుఁగకుండునా? తప్పక వినియుండును. కాకపోయినను నైజమగు ననుబంధము హృదయమును ద్రవింపఁ జేయదా? ప్రేగుసంబంధ మెక్కడికిఁ బోవును? సార్వభౌముఁడు మనలఁబంపుచు నిదే యభిప్రాయపడియుండును. నన్నింతకుముందు వారెఱుఁగుదురు. నీవుమహారాజ్ఞికి జనకుఁడవు. నిశుంభవధవలనఁగలుగు దుఃఖ మామెకు నీసందర్శనమువలన శాంతించును. అట్లుజరుగదు కాని- యొకవేళ పరాజయఖిన్నమానసులగు శత్రువులు రాజపుత్రికలకేమైన నపకారము చేయుదురేమో కనుగలిగి వర్తింపుడని యర్జునదేవుఁడు వచ్చునప్పుడు నాతో నొక్కిచెప్పెను.

**కాల:**—మనకంఠమునఁ బ్రాణములుండఁగా శత్రువు లేమి చేయఁగలరులే? అదిగో నెవరో వచ్చుచున్నారు.

వారు మౌనమువహించి బందీకృతు లనువర్తింపవలసిన విధులను శ్రద్ధతో ననుసరించు చుండిరి.

# ఇరువదిరెండవ ప్రకరణము

ఉభయపక్ష సైన్య సమీకరణము సత్వరముగా జరుగుచుండెను. సామంతులు, పాళెగాండ్రు రత్నసాను దుర్గప్రాంత కాంతారములఁ దండోప తండములుగా విడిసిరి. చీమ చిటుక్కుమన్నను బాకుతళుక్కు మనుచుండెను. దుర్గమునకుఁ జేరు మార్గములన్నియు నవరోధ పరంపరతో నిబిడములై చేయఁబడెను. కొండ చఱియలలోఁ గందకములు నిర్మింపఁబడెను. హఠాత్తుగా నది సైన్యము నెదిరించుటకుఁ దగుమూఁకలందు నియుక్తము లయ్యెను. గిరిశిఖరముల బండఱాళ్లపారముగా నిలువచేయఁబడెను. కోటబురుజులు భద్రముగాఁ గాపాడుటకు వలయు సాధన సామగ్రితో ఖచరులవంటి యోధులు ప్రమాద రహితులై యుండిరి. మహీంధరుఁడు శత్రు వ్యూహములను భేదించు పద్ధతులందు సైనికుల శిక్షించుచుండెను.

అంత్య సందేశమును బంపిన వెనువెంటనే వజ్రధరుఁడు కూటములందుఁ గేంద్రములందు సుశిక్షితులైన సైనికవారమును రాజధానికి రావలసినదిగా నుత్తరువు లంపెను. పెక్కుమందిని సైన్యములోఁ జేర్చి యెప్పటి కప్పుడు క్రమశిక్ష యొసంగుటకుఁ జమూపతుల నియోగించెను. అసంఖ్యాకులైన యోధవరులు కాకులము చేరిరి. పూర్ణభద్రుఁడు సర్వ సైన్యముల నడపుటకు సర్జునదేవుఁ డతనికిఁ దగు నాలోచనలు చెప్పుచుండుటకు నేర్పాటు గావింపఁబడెను. భీమేశ్వరుఁ డీవార్త వినఁగానే నౌకావ్యూహమును బన్నించి కళింగ పట్టణము,

మొదలు బృందావనము వఱకుఁగల సముద్రతీర మంతయుఁ గట్టుదిట్టము గావించెను. వజ్రధరుఁడు భీమనాయకునకుఁ దోడై నిలిచి సింహళమునుండి వచ్చు నౌకల నెదిరించి పోరుటకు నియుక్తుఁడయ్యెను. ఆపస్తంబుఁడు శాంతిక పౌష్టిక విధు లొనరించి శత్రువు హతుఁడగుట కాభిచారిక హోమములు గావించి విజయ ముహూర్తమున దండయాత్ర గావింప నియోగించెను. అతని యమోఘాశీర్వాదమును గొని విష్ణుదేవుఁడు నగర సంరక్షణమునకుఁ దగువారిని నియమించి సైన్యములకు సాగిపో సెలవిచ్చెను. అపరిమితోత్సాహముతోఁ చతురంగబలము మహాసముద్రమువలె రత్నసాను దుర్గాభిముఖముగా నడచి పోవుచుండెను. అప్పటి కోలాహలము దివౌకసులకుఁ గూడ గుండెదడ పుట్టించునదై యుండెను. కృష్ణాతీర వాసుల సైన్యము ముందు, నెల్లిపాలెము ప్రాంతపు యోధవారము దానివెనుక, నాపస్తంబాశ్రమ వీరవారము దాని వెంబడిని, దాక్షారామ పదాతిదళము దానినంటియుఁ బోవుచుండెను. అన్నిటివెనుక కాకుళేశ్వరుని సైన్యపంక్తులు లోకభీకరలీల నరుగుచుండెను. ద్వాదశాదిత్యులు నేలకు దిగినట్లు, నాలుగు సముద్రము లేకమైనట్లు, కులపర్వతములకుఁ గాళ్లు వచ్చినట్లు, స్వర్గాదిలోకములు దండువెడలినట్లు తలంచి సామాన్యమానవులు సంక్షోభింప సాగిరి.

కతిపయప్రయాణములు చేసి యాంధ్రసైన్యములురత్నసానుదుర్గమును సమీపించినవి. బహువిధారణ్యములతోను నానావిధ పరిఖలతోను దుర్గమంబైన యాదుర్గమును జేరుటకు మార్గము గోచరింపదయ్యెను. పూర్ణభద్రుఁడు ప్రమాదరహితములైన కొండశిఖరములను జూచి వివిధస్థలముల సైన్యవిన్యా

సము గావించెను. సార్వభౌముఁడు సజ్జనదేవుఁడు వసించుటకుఁ దగు రక్షణముతోఁ గూడిన గుడారములు నిర్మింపబడెను. ఏ సైన్యమున కాసైన్యము స్వసంరక్షణము నేమఱక శత్రువుల భేదన భేదనమున కెదురు చూచుచుండిరి. సేనాసన్నివేశము ముగిసినపిమ్మట విష్ణుదేవుఁడు పూర్ణభద్రునిబిలిచి నగరము నకుఁ బోవుమార్గము నరయుటకై తగువారిని నియోగించి సైన్యసంరక్షణ మేమరక చూచుచుండుమని యానతిచ్చెను. ఆతఁడు కొండశిఖరముల నున్న మహోన్నత వృక్షముల నెక్కి నలువలంకలఁ బఱికించి శత్రువులజాడలు కనుఁగొనుటకు జాడ తెలియవచ్చి నంతనే సార్వభౌమునివఱకు వార్త తక్షణమే తెలియఁ బఱుటకు నంచెలంచెలుగా సైనికులనుంచి నగరమార్గ ములు వెదకించుచు నభ్యాఖ్యానములు చేయించి సైనికుల నుత్సాహపఱచు చుండెను.

దేశమందంతట నాంధ్రచక్రవర్తి నిశుంభరాక్షసుని సంహారింప దండెత్తెనని ప్రజలు నూతనోత్సాహముతోఁ జెప్పు కొనసాగిరి. ఎవరుమట్టుకువారు తమయింట శుభకార్యము జరుగుచున్నట్లు సంతసించుచుండిరి. తమచక్రవర్తికి విజయము లభింప వ్రతములు, దానములు, ప్రార్థనలు చేయమొదలిడిరి.

అచిరకాలములోనే యావార్త కాలకేతు నివాసమగు కాళేశ్వరమువఱకుఁ బ్రాఁకెను. విశ్వాసముగల కాలకేతు నమాత్యుఁడు సైన్యములనంపి యాంధ్రచక్రవర్తికిఁ దోడు చూప నెంచెను. సుశిక్షితులైన సైనికుల వెంటఁబెట్టుకొని పోయి శ్రీశైలము వాయవ్యమార్గము నరికట్టుమనిచెప్పి రణ తంత్రజ్ఞుఁడగు సేనానినొకని పంపెను.

ఎన్నిదినములు వెదకించిన నగరమార్గము గోచరము కాదయ్యెను. ఉన్నకొలఁది సైనికుల యుత్సాహము సన్నగిల్లు నని విష్ణుదేవుఁడు పూర్ణభద్రుని బిలిచి సేనానీ! మనమెంతకాల మిట్లు వేచియున్నను ప్రయోజనము లభింపదు. దూరముగా నెచ్చటికో సురంగమార్గ ముండితీఱును. దానికై వెదకుచుఁ గాలహరణము చేయుటకంటె నేదో యొకవైపున నరణ్యమును ఛేదించి దహించి మార్గము చేసికొనుటే మంచిది. మన యాటవిక సైన్యములిందుకు సమర్థములని భావించెదనని చెప్పెను. సార్వభౌముని యాదేశానుసారము పూర్ణభద్రార్జున దేవులు నిపుణముగాఁ బరిశీలించి యాటవికుల రావించి యీ మూలనుండి మార్గము గావింపుఁడని చెప్పిరి. రేయింబవళ్లు పట్టుపట్టి రెండుమూఁడు దినములలో నక్కతునకలవంటి యాటవిక సైనికులు పట్టకోట త్రొక్కఁ గలిగిరి. అది యొక మారుమూల మఱఁగు ప్రదేశమగుటచే శత్రువులు వారిచెయిదమును శీఘ్రముగాఁ దెలియఁజాలరైరి. మఱినాలుగు రోజులలో నామూల కోటగోడ యమాంతముగా గూలెను.

ఆ మహాధ్వని నాలకించి దుర్గరక్షకులు శత్రువులు కోటలోఁ జొరబడుచున్నారని మహీంధరునకెఱిఁగించిరి. అతఁడత్యాశ్చర్యముతో సైన్యసాగరము నామూలకు రావించెను. ఆయిఱుకు దారిలో నుభయపక్ష సైనికులకు ఘోరయుద్ధము ప్రారంభమయ్యెను. వివిధాయుధములతో ననేకు లనేకులుమడియించుచుండిరి. క్షణకాలములో నాగొంది శవసమూహములచేఁగప్పఁబడి పోయెను. నెత్తుటి సెలయేఱులు పాఱదొడఁగెను. పూర్ణభద్రుఁడు సైనికులఁ బ్రోత్సహించుచు శత్రుసందోహము నెదిరించి ఘోరసంగ్రామ మొనర్చుచుండెను. దివారాత్రములు

తెఱపి లేకుండ నాయుధములు మెఱయుచుండెను. రణభేరులు మెఱయుచుండెను. నాలుగుదిసము లేకాధ్వరముగఁ దెంపు నిలుపులులేక పోరాడియు నొక్కఁడు నొక్కఁడుగైన ముందుకుఁ బెట్టఁజాలరైరి.

ఇంతలో మఱియొకమూలఁ గోటగోడ కూలినచప్పుడయ్యెను. పూర్ణభద్రుని నాయకత్వమున నిచ్చట యుద్ధము జరుగుచుండ నర్జునదేవుఁడు వేఱొకమూల నాటవికులచేఁగోటగోడ దొలిపించెను. అపారమైన యాంధ్రసేన రత్నసానుదుర్గమునఁ జొరఁబడెను. అర్జునదేవుఁడు ప్రప్రథమమున దుర్గప్రవేశ మొనరించెనని విని సార్వభౌముఁడపరిమితానందమునొందెను. శత్రుసైన్యము రెండుపాయలయ్యెను. ఒకవైపున మహీధరుఁడు నొకవైపున ప్రసేనుఁడుసైన్యములనడపుచుండిరి. పూర్ణభద్రుఁడు మహీధరునెదిరించు చుండెను. అర్జునదేవుఁడు ప్రసేనుసేనల రూపుమాపు చుండెను. వారివెనుక నిశుంభుఁడు, వీరివెనుక సార్వభౌముఁడు నిలిచి సైనికులఁ బురికొలుపు చుండిరి. ఆశచే నొకపక్షము, నిరాశచే నొకపక్షము ప్రాణములకుఁ దెగించి విజృంభించు చుండెను. సర్వాలంకారశోభితమగు రత్నసాను దుర్గము నాఁడు శవదుర్గంధ దూషితమై నిలువ శక్యము గాకుండెను. ప్రారంభించిన దాది యెడతెఱపిలేక పోరు జరుగు చుండుటచే సైనికులలసటచెందఁ జొచ్చిరి.

ఆ సమయమున నర్జునదేవుఁడు తెల్లని యాజానేయము నెక్కి కరవాలు కేలఁ గీలించి వజ్రహస్తుఁ డుచ్చైశ్రవము నెక్కి వచ్చినట్లు వైరివీరుల దెగటార్పఁ దొడగెను. ప్రసేనుఁడును దనతురంగమును ముందుకుఁ దోలించి యావీరు నెదిరించెను.

వారియుద్ధము చూచునెపమున నావంక నుభయపక్షసైనికులు విశ్రాంతి తీసికొనఁ జొచ్చిరి.

ప్రసేనుఁడు విక్రమాటోపము మెఱయ నర్జునదేవుని మిగులడాసి యాతనికుడిభుజము నఱకుటకు బ్రయత్నించెను. అది కనిపెట్టి యర్జునదేవుని యశ్వరాజము చంగుననెగిరి, వెనుకటి కాళ్ళతో బ్రసేనుని దన్నెను. ఆంధ్ర సైనికులు పరిహాసించుచుఁ గరతాళధ్వనులు చేసిరి. ప్రసేనుఁడు స్వామిభక్తికిఁ బరిభవావేశము తోడుగాఁగ దుర్వార క్రోధముతో నర్జునదేవుని గలిసి మరలఁ గుడిభుజమునే గుఱిచూచి కొట్టెను. ఆదెబ్బకు నర్జునదేవుని కవచము తునియుటే కాక భుజమున గూడ గాయమయ్యెను. అందుల కమ్మహావీరుఁడు రోషించి 'నేను సవ్యసాచినని యెఱుఁగవా! మూఢ!' యనుచు నెడమచేత జంద్రహాస మెత్తి లాఘవము మెఱయ నిశుంభుఁడు చూచుచుండఁగనే ప్రసేనుని శిరము తెగనేసెను. నిశుంభుఁడది చూచి యోర్వరానికోపముతో సైనికుల నెచ్చరించెను. కొంత విశ్రాంతి చెందియున్న సైనికు లర్జునదేవుని ముట్టడించిరి. ఇంతలో విష్ణుదేవు నానతిని నూతన సైన్యములు వచ్చి నిశుంభుని సైన్యములఁ జెల్లాచెదరు చేసెను. వారు వెఱచఱచి మహీంధరుని మఱుఁగు చొచ్చిరి.

ప్రసేనుఁడు మడిసెనని విని మహీంధరుఁడు శోకక్రోధములు ముప్పిరిగొనఁ గ్రొత్త సేనల రావించి కదన మొనర్పసాగెను. అతని యుద్ధతి కాంధ్రసైనికు లోర్వఁజాలక నొచ్చియు వెనుకంజ వేయక ప్రాణములున్నంత వఱకుఁ బెనగులాడుచుండిరి. పూర్ణభద్రున కర్జునదేవుఁడు తోడయ్యెను. అర్జునదేవుని దక్షిణా

భుజము గాయమై యుండుట చూచి సార్వభౌముఁడాతని సాహాయ్యార్థము క్రొత్త సేనను బురికొలిపెను. వారు మహీధరుని ముట్టడించి చీకాకుపెట్టసాగిరి. ఇంతలో నర్జున దేవుఁడు తన మీఁదికెగిరి వచ్చుచున్న మహీధరుని పంచకల్యాణి తురగము నగ్రపాదము లొక్క వేటున నఱికెను. ఆ యశ్వము నేలపై మోకరించియే నాకమునకు డేఁకెను. మహీధరుఁడు తటాలున నవనికి లంఘించెను. ఆ సందడిలోఁ బూర్ణభద్రుఁ డా శూరుని కరవాలు లాగుకొని నిరాయుధుఁడైన యతనిని బట్టుకొని విష్ణుదేవుని ముందుఁబెట్టెను. సార్వభౌముఁడాతని నాదరించి సగౌరవముగాఁ గాపాడుచుండుఁడని సమర్థులగు యోధులను నియమించెను. ఉభయపక్ష సైనికులువిశ్రాంతి గోరుచున్నందున తాత్కాలికముగా నాఁటికి యుద్ధము నిలుపు చేయఁబడెను.

మఱుసటి యుదయమున యుద్ధప్రారంభమునుసూచించు రణదుందుభులు మ్రోఁగుచుండెను. నాఁడెట్లయిన విజయము సంపాదించి యుద్ధమును ముగింపవలయునని పూర్ణభద్రుఁ డాయత్తపడుచుండెను. ఇంతలో భటుఁడొకఁడు దారి చూప వజ్రధరుఁడు వచ్చి 'కుమారా! జయము!' అని పలికెను. విష్ణుదేవుఁడాశ్చర్యముతో 'ఏల యిట్లు వచ్చితివి? మణినాగుఁడు నౌకలతో రాలేదా? భీమనాయకుఁడు సుఖముగా నుండెనా?' యని తొందరగా నడిగెను.

వజ్ర:—కుమారా! భీమనాయకుఁడు సుఖియై యున్నవాఁడు. మణినాగుఁడు రాకేమి? అపారనౌకాబల సమేతుఁడై సముద్ర మార్గము లరికట్టెను.

విష్ణు:—మణినాగుఁడిప్పు డెక్కడ?

వజ్ర:—అకూపార గర్భమున.

విష్ణు:—ఏమి! వాఁడు జల స్తంభన మొనర్చెనా?

వజ్ర:—సైనిక శవములతో వాని మొండెము సముద్ర జలముల దేలినది. అప్పుడే మూన్నాళ్ళయినది. ఈపాటికి తిమింగిలములకడుపులో నా యధముఁడు జీర్ణమై యుండును. నౌకలు స్వాధీనము చేసికొని మన నౌకాశ్రయమున జేర్చితిమి.

విష్ణు:—భీమనాయకుఁ డెక్కడ?

వజ్ర:—భీమేశ్వరుఁ డంతర్వేది రేవును, నేను బృందావనమును గాచు చుంటిమి. మణినాగుఁడు బృందావనము రేవే చేరెను. భీమనాయకుఁ డావృత్తాంతము విని తాను బృందావనమున కరుదెంచెను. పిమ్మట నాతోఁ బోరాడి మణినాఁగు డర్ణవాంభఃపూర తరంగ డోలికలలో మృత్యుదేవతచేఁ జోకొట్టఁబడియె. అదిచూచి భీమేశ్వరుఁడు ద్రాక్షారామ కేగెను.

విష్ణు:—కుచ్ఛితు లెప్పుడు దుర్మరణమునకే పాలగుదురు.

ఇంతలోఁ గొందఱు వేగముగాఁ బరుగెత్తుకొని వచ్చి నిశుంభున కెవ్వరో సైన్యముతోఁ దోడు వచ్చు చున్నారని పూర్ణభద్రున కెఱిఁగించిరి. 'వారి నింతవఱకు రానిచ్చు టెందులకు? కొలఁది సైన్యమును నావెంటఁ బంపుము వారి నక్కడనే యుక్కడఁగించి వచ్చెద' నని వజ్రధరుఁడు చెప్పెను.

విష్ణు:—ఆర్యా! ఎవ్వరు వచ్చినను మనకు వెఱపు లేదు. నిశుంభుని సైన్య మల్పావశిష్టమై యున్నది. నేఁటితో

సంగ్రామము ముగియఁగలదని యందఱు నభిప్రాయ పడు చున్నారు. ఇంతకు నావచ్చిన దెవ్వరైనది తెలిసికొను టావశ్యకము.

వజ్ర:—అట్లేకానిమ్ము.

అనుచుండఁగాఁ జారుఁడొకఁడు వచ్చి 'జయము! జయము! ఆంధ్ర సార్వభౌమునకు— కాళేశ్వరప్రభు నమాత్యుఁడు దేవర దండయాత్ర నాలకించి తనయుఁడు తన భక్తి తెలిసికొనఁ గొంతసైన్యమును దోడంపెను. ఏమార్గముగా రమ్మని సెలవు.'

విష్ణు:— ఋజుమార్గముననే రమ్మను!

చారుఁడు నమస్కరించి వెడలిపోయెను. పూర్ణభద్రుని యనుచరులు కొందఱు పోయి కాళేశ్వరమునుండి వచ్చిన సైనికులను గొనివచ్చి యుచిత ప్రదేశమున గుడారములు నిర్మించుకొనునట్లు గావించిరి. ఇంకను గ్రొత్తసైనికులు వచ్చి పడుచుండెనని చారులెఱిఁగింప నుక్కిరిబిక్కిరి యగుచున్నను నిశుంభుఁడు నిసర్గధైర్యగుణము విడువక స్వయముగా సైన్యముల నాయత్తపఱచి తానే నడుపుచు యుద్ధము చేయ సంకల్పించెను. ఆతఁడు కదన రంగమునకు వచ్చునప్పటికి యోధుఁ డొకఁడు నమస్కరించి జాబు చేతికిచ్చెను. అతఁడు సక్రోధముగా వానిని వీక్షించి జాబు విప్పి చదివి కొనెను. అది పఠించునప్పటి కాతని ముఖమున వికట మందహాస ముదయించెను. సమ్మతమే! అట్లే జరుగవచ్చు నని ధీరముగావచించెను. యోధుఁడు మరలిపోయెను. అదివిష్ణు దేవుఁడ౦పినజాబు. అందు సార్వభౌమబిరుదముతో సంతకము

లేదు. "ఇప్పటికే చాలమంది హతులైరి. ఇంకను ప్రజానాశనమేల? దీనికంతకు మూలకారణభూతులమగు మనమిరువురము ద్వంద్వ యుద్ధము చేయుదము. ఇంతకుముందు జరిగిన నిర్ణయముల నన్నిటిని విడిచిపుత్తము. ఈయుద్ధమునగెలుపొందిన వీరుడే సార్వభౌముఁడు. క్షత్రియుఁడు జయించి యనుభవింపఁదగినవాఁడను ధర్మశాస్త్రమునే గౌరవింతము. మీకిదిసమ్మతమేని యందుకుఁ దగు నేర్పాటుచేయుదము." అని యందు లిఖింపఁబడియుండెను.

ఉభయపక్ష సైనికులు నాయుధములు ముడిచిరి. ఇరువాగులనాయకులు నాలోచించి ద్వంద్వయుద్ధమునకుఁ దగు స్థలము నిర్ణయించిరి. మహారాజు లిద్దఱు నాయుధములు ధరించిరి. కవచములు దొడిగిరి. అశ్వారోహణ మొనర్చిరి. సింహనాదములొనర్చిరి. ద్వంద్వయుద్ధము ప్రారంభమయ్యెను. ఇరువాగులవారు నద్భుతహర్షములతోఁ జూచుచుండిరి.

నిశుంభుని కరవాలఖేలనము, ఆంధ్రనాయకుని హస్తలాఘవము నొకదానినొకటి మించిచూపర కచ్చెరువు కూర్చుచుండెను. ఎచ్చుతక్కువులు నిర్ణయింప నెవ్వరికి వీలుగాకుండెను. గడియలు గడిచెను. జాములుచెల్లెను. సాయంసమయము కావచ్చెను. నిశుంభుఁడు నిరూఢవిక్రమ సంపద యేపుమీర నాంధ్రనాయకుని మీఁదికి లంఘించి బల్లెముతోఁ బొడిచెను. దానినిదప్పించుకొని విష్ణుదేవుఁడు చంద్రహాసముతో నాతని వేసెను. తమప్రహారమ్ము వ్యర్థమగుట యింతకుముందెఱుఁగని యావీరసత్తములు రౌద్రరసము తాండవింప మరల లంఘించిరి. పరస్పర ప్రహారములచే మేనులు రక్తసిక్తములయ్యెను. విష్ణు

దేవుఁడు త్రొక్కఁబడిన కాలభుజంగమువలెచంద్రహాసముతోడి దక్షిణహస్తమెత్తి నిశుంభునిమీఁది కుఱికెను. ఎల్లరు నిశుంభుఁడు హతుఁడయ్యెనని తలంచిరి. కాని యశ్రుపూర్ణ నయనములతో దీనాననయై వసుంధర పితృప్రాణ దానమును యాచించుచున్నట్లాతనికి గోచరించెను. ఉద్ధతిమందగించెను. నిశుంభుఁడత్తరుణమున శూలముతో విష్ణుదేవుని గసితీర బొడిచెను. ఆపోటుతో నావీరుఁడించుక సొమ్మసిల్లెను. నిశుంభుఁడంతటితో నాఁగలేదు. వెంటనే సునిశితమగు దీర్ఘ కరవాల మెత్తి విష్ణుదేవుని కంఠమును ఛేదింప లంఘించెను. ఆంధ్రసైనికులు హాహారవము లొనర్చిరి. వజ్రధరుఁడు నిమీలితాక్షుఁడై ప్రక్కకొరిగి మూర్ఛిల్లెను. అర్జునదేవుఁడు ఖడ్గపాణియై రణరంగమున దుమికెను. అదిచూచి వైరిబలము లధర్మమధర్మమని యఱచిరి. పూర్ణభద్రుఁ డర్జునదేవును సందిటఁబట్టి వారించెను. నిశుంభుఁడు విష్ణుదేవుని సమీపించెను. దీనాననయైన వసుంధర నుపలాలించుచు విశ్వంభర దివ్యరూపముతో విష్ణుదేవుని కడ్డముగా నిలచియున్నట్లాతనికిఁ దోఁచెను. చేయి చెమర్చెను. వాలు బరువెక్కెను. దృష్టిచెదరెను. గుఱితప్పెను. ఆంధ్రుల సంతోషారావములు మిన్నుముట్టెను. వజ్రధరుఁ డుచ్చైస్స్వరముతోఁ "కుమారా! ఏల యిట్లు జంపునడపి మమ్మలయించుచున్నావు? ఏదివ్యపురుషుఁడు నిష్కల్మష హృదయముతో సంకల్పించి యికార్యమునకు బీజమునాటెనో, ఏమహామహుఁడు ప్రజాక్షేమమునకై తనజీవితముధారపోసెనో, ఏమహావీరుఁడు నిజసద్భావముచే లోకమును వశముచేసికొనెనో ఆపురుషోత్తముని- మీతండ్రిని- సుచంద్రు నొక్కమాఱు సంస్మరించి దివ్యతేజో విరాజితుఁడవై విజయము చేకొనుము!" అనిపలి-

కెను. విష్ణుదేవునియొడలు జలదరించెను. సుచంద్రుని యుగ్ర రూపమాతనికి స్ఫురించెను. హిరణ్యకశిపుని యాంత్రహార ములు ధరించు నరసింహదేవుని భయంకర లీల యా ఘోర రూపమునగోచరించెను. ఖడ్గపాణియై నిశుంభుని చుఱ చుఱ జూచెను. గుఱిచూచి తటాలున లంఘించి ప్రహరించెను. ఆతని చంద్రహాసము నిశుంభుని దక్షిణహస్తమును ఖండించి డొక్కలోఁ బ్రవేశించి రక్తపానమునఁ దనివిసెందనిదానివలె నక్కడనే నిలిచిపోయెను. తెక్కలు తెగినకొంగవలె నిశుంభుఁడు నేలఁగూలెను. విష్ణుదేవుఁడు తక్షణమే గుఱ్ఱముదిగి యాతని డాయనేగి యుపచారములు చేయించెను. కొంతసేపటికి దెలి వొంది యావీరుఁడు విష్ణుదేవునివంక ధీరముగాఁ జూచుచు 'ఆంధ్రవీరా! నీవేసార్వభౌముఁడవు. నాకొక్క వాగ్దానము – వసుంధర' –

విష్ణు:—రాజా! నీయభిమత మెఱుంగుదును. వసుంధర నా యర్ధాంగి. అందులకే –

నిశుం:—చాలు! ఇంకేమియుఁ జెప్పవద్దు. నిశ్చలనిర్మలహృద యముతో వీరస్వర్గము నలంకరింప బోవుచున్నాఁడను. చంద్రహాసము తీసికొనుము.

విష్ణుదేవుఁడు పూర్ణభద్రునిచే నాయుధము తీయించెను. సెలయేఱువలె రక్తము స్రవించెను. చూచుచుండగనే నిశుంభుని యంతరాత్మ పరమాత్మలో లీనమయ్యెను.



# ఇరువదిమూడవ ప్రకరణము

విజయలక్ష్మీ విరాజమానుఁడగు నాంధ్రసార్వభౌముఁడు
రత్నసాను దుర్గమునఁ గోటలో గుడారము వేయించెను. అందు
సుహృద్బృందము చుట్టును జేరియుండ నిష్టసంభాషణ మొనర్చు
చు మహీధరుని రావించి యుచితాసనమునఁ గూరుచుండఁ
జేసి యాదుర్గము పుట్టు పూర్వోత్తరములు తెలిసికొనుచుండెను.
ఆసమయమందే రాజ సౌధప్రాంగణమునఁ దూర్యస్వనము విన
వచ్చెను. తోడనే యలంకృతములగు రెండు భద్రదంతావళ
ములు వారిడేరాలవైపు వచ్చుచుండెను. వసుంధర, మల్లికయుఁ
జెలి యొక సామజమున నాసీనలైయుండిరి. వారు జలపూర్ణ
సువర్ణకలశములను కుంభి కుంభాగ్రమున నుంచి జాగ్రత్తగాఁ
బట్టుకొనియుండిరి. కాలకేతు మణిభద్రులు మత్తమాతంగ
ములనడపుచుండిరి. తూర్యారావములు జయ జయధ్వానముల
తో మేళగించి మిన్ను ముట్టుచుండెను. గుడారములోని
వారందఱు నావింత చూచుటకు బయటికి వచ్చి నిలిచిరి.
భద్రేభములు వారి చెంతకు వచ్చి నిలిచెను. తోడనే యవి
హస్తాగ్రములతో సువర్ణ కలశము లందుకొని పావనజలంబులు
సార్వభౌమార్జున దేవుల పాద మూలంబులఁ గుమ్మరించెను.
మల్లికావసుంధరలు గజావరోహణ మొనర్చిరి. కాలకేతు
ప్రేరితయై వసుంధరాదేవి ప్రత్యగ్రసురభిళ ప్రసూన మాలికను
సార్వభౌముని కంఠమున గీలించెను. విష్ణుదేవుఁడు వినయలజ్జా
సంభ్రమములు సందడింప స్మేరమగు నాననపంకజము నించుక
వంచి నిలుచుండెను. మల్లిక మహీధరుని జూచి సంభ్రమ
ముతో సమీపించి 'తండ్రీ నమస్కార'మని మ్రొక్కెను.

మహీధరుఁడామెవంకఁ జఱచుఱఁ జూచి 'తల్లీ! యిదియేమి' యనెను. మల్లిక యీషన్ముద్రవదన కమలయై 'అభివందనము' అనెను. మహీధరుఁడు మంత్రరుద్ధమగు మహోరగము వలెఁ గ్రోధ దందహ్యమానుఁడయ్యు నాకృతి గోపనము మెఱయ వికృతముగా నవ్వి 'ఎందులకు! పెద తండ్రి చచ్చినందులకా? తండ్రి శత్రువులకు జిక్కినందులకా? అభినందనము' అనెను. విష్ణుదేవుఁ డందఱ స్వస్థానములఁ గూరుచుండ నియమించి, మహీధరుని చేయిపట్టుకొని లోనికిఁ గొనిపోయి కూర్చున్న పిమ్మట 'సేనాపతీ! నీవంటి శూరుఁడు' 'ప్రాజ్ఞు'డిట్లు నుడువఁ దగునా? ఎవ్వరికైన మరణాంతములు వైరములుగాని యెల్ల కాలము పగ సాధింపఁ జూచుట పాఁడియగునా? నిశుంభుఁడు నిహతుఁడయ్యె! మణినాగుఁడు మరణించె! ఇఁక నెవ్వరికొఱ కెవ్వరిమీఁద శత్రుత్వము వహింతువు?' అని సబహుమానముగా వచించెను.

మహీధరుఁడు:—మణినాగుఁడు నౌకాబలము తెచ్చెనా!

వజ్ర:—తెచ్చెను. కాని ప్రయోజనము లేకపోయెను. సామ్రాజ్య నౌకాబలముచే నది నిహతమయ్యెను. మణినాగుఁడు మడిసెను.

మల్లిక:—(స్వగతము) బంధువత్సలతచే హృదయము స్విన్నమగు చున్నను, పెద్దబరువు దింపినట్లు సముచ్ఛ్వసితమగుచున్నది.

వసుం:—(స్వగతము) పాపాత్ముఁడు కర్మఫల మనుభవించెను.

మహీ:—ఇంక యశోధరాదేవి మోమెట్లు చూడఁగలను?

(విషాద మభినయించును.)

విష్ణు:—క్షత్రియ వంశ్యుఁడవగు నీ వట్లు ఖిన్నుఁడ వగుట భావ్యముకాదు. ఒండొరులంగాంచి వలవంతచే నవయు జామాతల మన్నింపుము.

మహీ:—(తెల్లపోయి చూచుచుండును.)

కాల:—సైన్యాధిపా! నీతనయ యర్జునదేవుని వరించి చాల కాలమైనది. వారు పరస్పరము పుష్పమాలలను నలంకరించుకొనిరని మాబిడ్డ చెప్పినది.

(మల్లికార్జునదేవులు శృంగారచేష్ట లభినయించిరి.)

మహీ:—ఓహో! కాలకేతూ! నీవు కూడ నీకూటమున నుంటివా?

కాల:—ఉంటిని. నిన్నుఁగూడ జేరుమనుచుంటిని. ఇదియొక వడివాతము. అందఱను లాగుకొని పోవుచున్నది. పెనఁగులాడిన వ్యవహార మడ్డముతిరుగును.

విష్ణు:—సేనాధ్యక్షా! రత్నసానుదుర్గ మర్జునదేవునకు బహుమానముగా నొసఁగఁదలంచితిని. కూఁతునల్లుని బెట్టుకొని సుఖముగా జీవింపుము.

మహీ:—(సంతోషముతో) సార్వభౌముని దివ్యశాసనమునకు బద్ధుఁడను.

కాల:—సార్వభౌమా! నగరు ప్రవేశింప నియ్యది సుముహూర్తమని పెద్దలు వాక్రుచ్చిరి. కాలవిళంబమేల?

విష్ణు:—అట్లైన రాజసౌధమునకే పోవుదము. (అందఱు లేచిరి)

విష్ణు:—మిత్రమా! గజారోహణ మొనరింపుము.

అర్జు:—అన్నగారి యనుమతి పడయక—

విష్ణు :—(చిఱునగవుతో) సిమ్మంటం బడయవచ్చును. ఇది సార్వభౌముని శాసనము.

అందఱు నానందస్మితములతో 'జయము సార్వభౌమునకు, ఆంధ్రసామ్రాజ్య సంస్థాపకునకు శుభము' అనుచుండ విష్ణుదేవుఁడు దంతావళము నధిరోహించెను. కాలకేతువు వసుంధరనుగూడ గజారోహణము చేయించెను. మల్లికార్జున దేవులు రెండవయేనుఁగు నెక్కిరి. యథాప్రకారము మణిభద్రకాలకేతువులు దంతావళముల నడపిరి. తక్కిన వారుత్తమాశ్వముల నెక్కి వారిననుగమించిరి. తూర్యారావములు మిన్నుముట్ట, జయఘోషము పిక్కటిల్ల, స్వస్తివచనము లుప్పతిల్ల, ధ్వజపతాకా సమలంకృతమగు రాజమార్గమున నాపవిత్రదంపతులు పుణ్యాంగనలు లాజాంజలులు చల్లుచుండ, సువాసినులు కర్పూరహారతు లొసంగుచుండ బాలికామణులు ప్రసూన గుచ్ఛములు వర్షించుచుండ సలీల మంద గమనంబునం జని రాజభవన ప్రవేశ మొనరించిరి.

# ఇరువదినాల్గవ ప్రకరణము

ఆంధ్రసార్వభౌముని రాజధాని యనర్ఘాలంకరణముచే నలరారుచుండెను. ఎక్కడఁజూచినను గీతవాదిత్ర నిక్వాణము బూరటిల్లుచుండెను. ధూపగంధములు గుబాళించుచుండెను. పుష్పపరిమళము గుబులుకొనుచుండెను. అమరావతి యవనికి డిగ్గెనో, యలకానగర మీరూపమున నవతరించెనో యనునట్లు దివ్యశోభా విరాజమానములగు సుందర మందిరములతో

సతతదోహద సంవర్ధిత పుష్పఫలభార భాసురములగు నుపవన తరువులతో స్నాతానులిప్తులై దివ్యాంబరాభరణముల ధరించి సార్వభౌము నభిషేకింపఁ దర్పడు కన్యామ తల్లికలతో, ఉచిత కర్మ కలాపంబులు నెఱపి పావన నదీ జలంబులు, సముద్రోదకములు దెప్పించి పల్లవ ప్రసవ ఫలాదులు సిద్ధపఱచి సుముహూర్తమున కెదురుచూచుచు మాటిమాటికిఁ బాదచ్ఛాయలు లెక్కించు పురోధసులతో జన కలకలంబు వారించుచు బారులుతీర్చి ప్రజాసౌకర్యముఁ నకుఁ బాటుపడు రాజభటులతోఁ గాకులము కలకలలాడు చుండెను. అన్ని దిక్కులనుండి విచ్చేసిన జన సమూహ మాస్థాన మండపమున సుఖముగాఁ గూరుచుండెను. నవరత్న ఖచితమగు సింహాసనము సిద్ధము చేయఁబడెను. భీమేశ్వర గురునాథ ప్రభృతులగు నాప్తు లుచితపీఠము లలంకరించి మేరు హిమాచలాది గోత్ర శిఖరులవలె నొప్పారుచుండిరి. ఆపస్తంబాది మహర్షు లగ్రస్థానము లలంకరించి జటాకృష్ణాజి నాద్యుపకరణములతో సుహుత వీతిహోత్రముల చందమున విరాజిల్లుచుండిరి. కాలకేతువు మహీధరుఁడు మొదలగు రాజ బంధువులు సముచితాసనముల నుపవిష్టులై యభిషే కోత్సవసందర్శనాభిలాషమున నఱులు సాచి చూచుచుండిరి. పౌరులు, జానపదులు, నాటవికులు, పార్వతీయులు వీరువారన నేల యాంధ్రదేశమునం దన్నిప్రాంతములనుండి వచ్చినవారు యథోచితముగా నాసీనులై యుండిరి. స్త్రీలు, బాలురు, వృద్ధులు నిర్బాధకముగాఁ గూర్చుండిరి. ఒజ్జలపెద్ద వసిష్ఠుఁడు పవిత్రాక్షతలతోఁ గూడిన బంగారుపళ్ళె మొకచేతను బర్హి ష్పాకచేతను బట్టుకొని లేచి సుముహూర్త మాసన్నమైనది.

సార్వభౌమ దంపతులు దయచేయ వలయునని వచించి, మహాజ్ఞయని యుపక్రమించెను. వేదవిదు లిరుపక్షములుగాఁ జేరి క్రమసాహమందుకొనిరి. అభిషేకోచిత మాంగళ్య వేషము లతో వసుంధరా విష్ణుదేవులు రాజహంస దంపతులవలె సలీల మందగమనంబు చెలువార మహాజన సభకు మున్మార్లు ప్రదక్షిణము చేసి యభిషేకవేదిక నధిరోహించి సభావందన మాచరించి పురోహితుని యాదేశ ప్రకారము కూర్చుండిరి. యథావిధిగా నభిషేక తంత్రము జరిగెను. ఆపస్తంబుఁడు సూత్రము లందించుచుఁ దూచా తప్పకుండ నభిషేక విధి సక్రమముగా జరుగునట్లు హెచ్చరించుచు వచ్చెను. ముందు వృద్ధభూసురులు పిమ్మటఁ గన్యామణులు నసంతరము వేదవిదులు తరువాత పుణ్యాంగనలు నభిషేక క్రియనిర్వర్తించిరి. బ్రాహ్మ ణోత్తములు క్రమము జట ఘన జెప్పుచు వైదికమంత్రములచే సార్వభౌమ దంపతుల నాశీర్వదించిరి.

నానాదేశాగతులగు రాజులు సార్వభౌమునకుఁ గానుక లర్పించు కాలమిదియని వసిష్ఠుఁ డుచ్చైస్స్వరముతో జెప్పెను. భీమనాయకుఁడు పదియోడలు, నూఱు మాతంగ ములు, నైదువందల తురంగములు సార్వభౌమునకు బహు మానముగాఁ జదివించెను. గురునాథుఁడు పదిరథములు, నూఱు తురంగములు, మూడువందల గోవులు, నన్ని వృషభములును జదివించెను. అర్జునదేవుఁడు వెలపెట్టరాని నవరత్నహారము, అణిముత్తియముల పేరు, చంద్రహాసమును రాజదంపతులకు బహుమతిగా నొసంగెను. కాలకేతువు తనమంత్రిపంపిన సైన్య మును, మహీధరుఁడు ఛత్రచామరాది రాజపరికరములను, ఆపస్తంబుఁడు ధర్మదండమునిచ్చి బహూకరించిరి.

అనంతరము విష్ణుదేవుఁడు ఫలతాంబూల సహితముగా రత్నస్వర్ణ రౌప్యములతో బ్రాహ్మణోత్తముల సత్కరించెను. దుకూలాభరణాదులచే సువాసినులను గన్యామణులను నలంకరించెను. నానావిధ సుగంధద్రవ్యములు, చందనతాంబూలాదులు మహార్ణ మణిమౌక్తికాంబరము లొసంగి బంధుమిత్రాదులను సమ్మానించెను. బీదసాదలకుఁ గోరిక కెక్కువగా నడుగుట తడవుగా సమస్తవస్తువు లొసంగెను.

పిమ్మట నాపస్తంబమహర్షి యెల్లవారు వినుచుండ నిట్లు వచించెను. "ఆంధ్ర మహారాజులారా! నేటికి మనసంకల్పము నెఱవేఱినది. ఆంధ్రసామ్రాజ్యము స్థాపితమైనది. ఇది మీ యైకమత్యమునకు ఫలము. అల్పసారములైన తృణములతో నేర్పడిన రజ్జువు మదపుటేనుగుల బంధించుచున్నది. మీరందఱు నైకమత్యముతో వర్తించుటచే నిక్కార్యము సులభసాధ్య మైనది. దీనినిబట్టి యైకమత్యమునకుఁగల విలువ యెంతటిదో మీరు గ్రహించియుందురు. మహనీయులగు నను భవజ్ఞులు 'సంఘేశక్తిః కలౌయుగే' అని వచించియున్నారు. ఇంతటితో మనపని పూర్తియైనదని తలంపరాదు. దేశము, జాతి యున్నంతకాలము నైకమత్య మావశ్యకమని మీరు భావింపవలయును. ఏనాఁడు మనమీ రహస్యమును విస్మరింతుమో ఆనాఁడే యధఃపతితుల మగుదుము. ఉన్నతస్థితి నొందుట దుర్లభముకాని పతనమునొందుట దుర్ఘటముగాదు. కష్టార్జితమగు సామ్రాజ్యము రక్షించుకొనఁ జాలనిచో మనము పరిహాస పాత్రులమగుటేకాక మనసంతతివారిని దుర్భర వ్యథల పాలుచేసిన వారలమగుదుము. కావున మీరందఱు సంఘీభావమును బెంపొందించుకొనుచు మీదేశమునకు, మీజాతికి,

మీసంతతికిఁ బేరుదెచ్చియాంధ్రులకు వ్యక్తిత్వముకలదని నిరూపింపుఁడు. అధికారవాంఛలకు, నహంకారమునకు లోనుగాకుఁడు. సంపాదనము కష్టము. సంపాదిత సంరక్షణము కష్టతరము. రాజాజ్ఞ ననుసరింపుడు. రాజానుమతము ధర్మము. రాజు భగవదంశ సంభూతుఁడు. రాజభక్తి, దేశభక్తి గృహస్థులకు మోక్షకారణము లగుచున్నవి. ఎప్పుడో ఫలమిచ్చు దైవముకంటె సద్యఃఫలదాతయగు రాజు గృహస్థులకుఁ బూజార్హుఁడు."

మహర్షి చెప్పినవాక్యము లాలకించి యందఱు హర్షమును సూచించుచు జయము! సార్వభౌమునకు జయము! అని వాక్రుచ్చిరి. పిమ్మట విష్ణుదేవుఁడుసింహాసనము నుండి లేచి వినయముతో నిట్లు వచించెను.

"ఆంధ్రమహాజనులారా! యీసామ్రాజ్య స్థాపనమునకు మీరందఱు నాకపారమైన సాహాయ్య మొనర్చి నందులకు మీకు యావజ్జీవము కృతజ్ఞుఁడను. ఒక్కఁడెప్పుడు నిట్టి ఘనకార్యమును నిర్వహింపఁజాలడు. అట్లునిర్వహించెనని యింతకు ముందు మనము వినియుండను లేదు. నన్నుఁబురస్కరించుకొని మీరందఱు మీసర్వస్వమును ధారపోసి యీసామ్రాజ్యమును సంపాదించుకొనిరి. కావునసామ్రాజ్యముమీది: మీరాంధ్రులు; మీలోని ప్రతిమనుష్యుఁడు ప్రధానుడే; సామ్రాజ్యఫల మనుభవించుట కందఱకు సమానాధికారమున్నది. ఎవరికివారే యధికారము నిర్వహించుట యసంభవమగుటచే నిమిత్తమాత్రముగా నన్ను సమ్రాట్టుగాఁ గల్పనచేసిరని నేనెఱుంగుదును. సామ్రా

జ్యమను పేరఁ బ్రజాసేవ నా కర్తవ్యమనియు నే నెఱుంగుదును. కాని సామ్రాజ్యమొక మహారథము. దీనినొక్కఁ డెవ్వఁడు లాగఁజాలఁడు. పరస్పర సాహాయ్యముతో నల్వురుఁడుగూడ నాపని చేయఁజాలుదు. కావున నేను యితోధిక సాహాయ్య సంపద నర్థించుచున్నవాఁడ. రథము మీరు. రథ్యములు మీరు. సారథి మాత్రుఁడనగు నేను మీకు సూచనలు చేయవలసిన వాఁడను. ఇట్లనుటచే భారమంతయు మీమీఁద విడువఁదలంచు చున్నాఁడనని యెంచరాదు. అవసరమెట్టిఁగి రథముదిగి భుజ మొగ్గి కదలించిదారిబడునట్లుచేయుట కణుమాత్రము వెనుదీయ నని మనవిచేయుచున్నాను.

ఇట్టి యుత్సవసమయములందు మహారాజులు, చక్ర వర్తులు శిలాశాసనములు కావించుట మనసంప్రదాయము. తదనుగుణముగా నీక్రిందివిషయములు శాసించుచున్నవాఁడ దీనినాప స్తంబమహర్షి పద్యబంధము గావింపఁగలడని మనవి చేయుచున్నవాఁడ.

మన నిత్యజీవితమునకు రాజభక్తి వన్నెపెట్టుచున్నది. ఆర్యుల రాజభక్తి కాలాంతరమున దైవభక్తియైపరిణమించును. తరతరములవారికది యిహపర సాధనమగుచుండును. నేమనవి చేయువాక్యములను శ్రద్ధతో నాలకింపఁ గోరుచున్నవాఁడ.

ఈ సామ్రాజ్య స్థాపనమునకు సంపూర్ణసహాయుఁడైన భీమనాయకుఁడు ద్రాక్షారామమున భీమేశ్వరుఁ డనుపేర విఖ్యాతుఁడై యాంధ్రులచేఁదరతరములు పూజింపఁబడుచుండు

గాక! ఆతనిసోదరుఁడీ యర్జునదేవుఁ డవక్ర విక్రమ సంపదచే సామ్రాజ్య ప్రతిరోధముల నడంచెఁగావుననీతఁడు శ్రీశైలమున శ్రీమల్లికార్జున దేవుఁడని ప్రఖ్యాతి నొంది యాంధ్రులకే కాక యెల్ల భారతీయులకు సంసేవ్యుఁడగుఁగాక! ఈ కాలకేతుని స్థానమునఁ బూర్ణభద్రుఁడు సుస్థాపితుఁడై కాళేశ్వరమున మన ప్రతినిధియై పూజింపఁబడు చుండుఁగాక! ఈ మూఁడు దివ్య క్షేత్రములు గలిపికొని హేమ ప్రాకార మొకటి నిర్మితమగుఁగాక! అట్టి స్వర్ణప్రాకార మధ్యస్థమగు నీయాంధ్ర దేశము—వజ్రభూమి—త్రిలింగ దేశమని కూడ నింతటినుండి వ్యవహారార్హ మగుగాక! ఇది నాకోరిక! ఇది నా దాన శాసనము! ఇది నా విధి నిర్వాహణము." అని కూరుచుండెను. ఆపస్తంబుఁడత్తఁడెదటాలున లేచి "మహాజనులారా! వక్తవ్యాంశ మొక్కటిమిగిలియున్నది. వినుఁడు. మీ సార్వభౌముఁడు స్వవిషయ మగుటచే వివరింపఁ డయ్యెను. మొదటి యాంధ్రరాజధాని యగు నీ శ్రీకాకుల నగరరాజమునఁ గృష్ణవేణీ తీరమున ప్రప్రథ మాంధ్రచక్రవర్తి యీవిష్ణుదేవుఁ డింతటినుంచి యాంధ్రవిష్ణు వని ప్రఖ్యాతుఁడై కలకాలము నాంధ్రుల కారాధ్యుఁ డయ్యెఁడుఁగాక! భీమ నాయకుఁడే భీమేశ్వరుఁడు! అర్జునదేవుఁడే మల్లికార్జునస్వామి! కాలకేతువే కాళేశ్వర పూర్ణభద్రస్వామి! విష్ణుదేవుఁడే ఆంధ్ర విష్ణుసార్వభౌముఁడు. ఆంధ్రదేశమే త్రిలింగ దేశము. పూజింప వలసినవారు మనమే గాక మన సంతతివారు — తరతరము! తరతరము! ఆంధ్రదేశమున్నంత కాలము! ఆంధ్రజాతి

యున్నంత కాలము! ఈవేల్పుల యవ్యాజ కరుణాకటా క్షముచే నాంధ్రుల ప్రతిభ జగద్వ్యాప్తమగుగాక!

హరిః ఓం. తత్సత్.

జయ జయ ధ్వానములతో నభిషేకమహోత్సవము ముగిసెను. ఆసంతోషమునకు మేరలేదయ్యెను. అనంతర మందఱు విందులారగించిరి. క్రమ క్రమముగా నెవరియిండ్లకు వారు చేరుకొనిరి. అయ్యాంధ్రకేసరిపరిపాలనముననాంధ్రజాతి సుఖించెను. ఆంధ్రులవిఖ్యాతి దశదిశలమాఱుమ్రోగెను.

సమాప్తము



